# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి

# రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క పారి తోముకొంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును**

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే అపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమెన్నడూ తెలియచేయనంతలా శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమం తప్పకుండా కాల్గేట్ తో పళ్లు తోముకోండి. దాని చేవతనమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్ తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు ఎందుకంటె చాల పేపు ఉండే దాని పిప్పర్ మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !




మీకు పౌడరు కావాలంటే,
ఈ లాభములన్నిటిని మీరు
కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా
పొందగలరు... ఒక డబ్బా
వెలలు వస్తుంది

కాల్గేట్ తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్ నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DCG.3197 TEL.,

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

## తెలుగు వెలుగులు

శ్రీ విడదవోలు వెంకట్రావుగారిని గూర్చి 'తెలుగు వెలుగు'లలో చదివి పరమానందభరితుడ నయితిని. సాహిత్య ప్రపంచమున పరిశోధన పరమేశ్వరులయిన వారిని గూర్చి యీనాటికైన తెలుగు వెలుగులలో వచ్చుట సంతోషప్రదమయిన విషయము.

తిమ్మావజ్ఝల కోదండరామయ్య.

* * *

మీరు ప్రచురించే 'తెలుగు వెలుగులు' శీర్షిక చాలా బాగుంటోంది. కాని వాటితోపాటుగా వారి అడ్రసులు కూడా ప్రచురిస్తే చాలా బాగుంటుందని నా ఉద్దేశ్యము.

యం. లక్ష్మణమూర్తి (హైదరాబాదు)

* * *

## ముఖచిత్రం

ఈవారం (8—2—61) మీరు ప్రచురించిన "ముఖ చిత్రానికి సంబంధించిన వ్యాసం" మనోరంజకముగ నున్నది. నాగేశ్వరరావు బాగా నటించలేకపోవడమన్నది నాకు కనిపించదు. అది మాత్రం "ఆయనమీద ఉన్న అభిమానము" అని నేను అను

కొనలేను. ఆయన నిజముగ "నిత్య సినీ సంగ్రామ శీలుడే". ముఖచిత్రం చాల ఆకర్షణీయముగ నున్నది. ఈ వ్యాస రచయితకు, మీకు నా ధన్యవాదములు.

ఎస్. విశ్వేశ్వరావు (భీమవరము)

* * *

మీ ఆంధ్ర వార పత్రికఅంటె నాకు చాల అభిమానము. ప్రతివారము పత్రిక యెప్పుడు వచ్చునా యని యెదురు చూచుచుందును. ఒకరోజు ఆలశ్యమైన నాకా రోజు బుక్‌స్టాలువారిమీద కోపము వచ్చును. ఈ వారము (8—2—61) పత్రిక చూచి చాల సంతోషించాను. ముఖచిత్రం, వ్యాసం అనునది బాగున్నది.

సూర్యదేవర గిరిజాప్రసాద్ (తుమ్మపూడి)

* * *

మీరు మూడు వారాల ముందునుంచి "ముచ్చటైన ముఖ చిత్రం" వేస్తామని పూరించారు. నూతనపద్ధతిలో ప్రచురించే ఆ పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు తెన్నులు చూచాము. కాని ఏం లాభం. చూచి చూచి విసుగెత్తిన సినిమా మోహమే మళ్ళీ ప్రత్యక్షం. అలా ఆశించిన దానికి భిన్నంగా అయినందుకు చాలా ఆశాభంగం కలిగింది.

ఇంత వేలంవెర్రిగా ఎక్కడ చూచినా నాగేశ్వరరావు, భానుమతి, అంజలీ, రామారావు, జమున వీరి మొహాలే చూడటంవలన వారిమీద వుండే అభిమానం ఆదరణ కూడా సన్నగిల్లి విసుగు పుడుతోంది. ఒక విధంగా వారు కళాకారులు. వారిని అంతమటుకే గౌరవించాలి. అంతేగాని మహనీయులు కారు, అనుదినమూ దర్శించి పూజించడానికి. వారి తరఫున వకాల్తా పుచ్చుకున్నట్లుగా ముఖ చిత్రాలు ప్రచురించి బ్రహ్మరథం పట్టేటంత యుగ పురుషులా? ఒక్కసారి సింహావలోకనంచేసిచూస్తే తెలుస్తుంది, ఒక్కొక్క నటుడు ఎన్ని వందలసార్లు ముఖ చిత్రంమీద ప్రత్యక్షమయిందీ, ప్రకృతిమాత వినూతన సౌందర్యాన్ని సునిశితంగా తిలకించి చూస్తే ఎన్నో ఆకర్షణీయమైన చిత్రాలు కనిపిస్తాయి. హృదయాన్ని స్పందింపచేసే ఎన్నో కొంగ్రొత్త దృశ్యాలు మనల్ని ఆకర్షిస్తాయి. కళాకారులకు చిత్రకారులకు ప్రోత్సాహమిచ్చి మీరు దేశంలో మూల మూలలనుంచి చిత్రాలను తెప్పించవచ్చు. దిక్కూ, దివాణంలేక అథోగతిలోవున్న కళాకారులకి ప్రోత్సాహం ఇచ్చిన పుణ్యం కూడా మీకు దక్కుతుంది. శిల్ప సంపదని, కళల ఔన్నత్యాన్ని రూపొందించగలరని ఆశిస్తున్నాను.

ఇంత నిశితంగా విమర్శించినందుకు అన్యథా భావించకండి. సంవత్సరాలుగా మీ పత్రిక అభిమాన పఠితలలో ఒకరను.

యస్. ప్రసూన (మద్రాసు)

* * *

## కార్టూనులు

పూమెన్‌గారి వ్యంగ్య చిత్రాలు పత్రికకు ఒక ప్రత్యేక ఆకర్షణ. 25—1—61 వ తేది పత్రికలో వ్యంగ్య చిత్రాలు బాగానే వున్నాయి. "నేటి కాంగ్రెస్ వ్యవస్థలో అధ్యక్షుడు" వ్యంగ్య చిత్రం అద్వితీయంగాను, చాల సహజంగాను వుంది.

ఆర్. కె. రాజా (పిగిలాం)







ఈ రోగం కుదరాలంటే....
కీచులాటలు, ముఠాతగాదాలు,
పదవీవ్యామోహాలు,
నిషేధించాలి

డాక్టర్ నెహ్రూ

ఆంధ్రప్రదేశ్

# ఆంధ్రపత్రిక
# వారపత్రిక

☆

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

☆

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

☆

| | |
|---|---|
| సంపుటము | 55 |
| సంచిక | 23 |

15-2-61

బుధవారం

శార్వరిమాఘబహుళఅమావాస్య

☆

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

☆

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం :

శ్రీ వెంకటసాయి ఫిలిమ్స్‌వారి 'మాయా మశ్చీంద్ర'లో
నిరూపరాయ్



## వచ్చే వారం......

స్వప్నదీనం—కథ

పరిత్యక్తల పరితాపం—వనితాలోకం

కృష్ణదేవరాయలు—చాటుకథామంజరి

## గళ్లనుడికట్టు - 37

### ఆధారాల పోటీ ఫలితం

శ్రీ బద్దూరి నరసింహారావు (నిజామాబాదు) పంపినఆధారాలు ఈ తడవ సరైనవిగా నిర్ణయించి ఆయనకు బహుమతిగా రు 5 లు పంపుతున్నాము.

శ్రీ నరసింహారావు పంపిన ఆధారాలు ఇవి :

17 అడ్డం. "జగడాలమారి చేసేపని మొదట్లో నే చెప్పబడింది." (మేము ఇచ్చినది — డాలు చివర విరిగి పోయినది గాని లేకపోతే జగడాలొచ్చేవే.) జవాబు—జగడా.

5 నిలువు. "గొప్పలేని ఘనభోగం", (మేముఇచ్చినది—వైష్ణవాలయంలో ప్రసాదం రోజూ ఇది చేయిస్తారు.) జవాబు—భోగం.



# తెలుగు వెలుగులు 71

పౌరాణిక కలరవ మాధుర్యంతో, అలతి అలతి పదాలకూర్పు బిగువుతో, జగితో ఆధునిక కవితా మార్గంలో విశిష్టత గడించుకొన్న శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి గారు అలనాటి సాహితీసమితిలో ప్రధాన సభ్యులు.

వీరి జన్మస్థానం భద్రగిరి. చిన్ననాట శ్రీ గొట్టుపుల్లి శ్రీనివాసాచార్యులవారి వద్దర కావ్యనాటకాలంకారా లధ్యయనంచేశారు. ఆపైన కొంతకాలం శ్రీ చిలుకూరి సోమనాథశాస్త్రిగారివద్ద వ్యాకరణశాస్త్ర వ్యాసంగం కొనసాగించారు. తరవాత శ్రీ చల్లా వెంకటనరసయ్యగారి శిష్యులై స్మార్తం చదువుకొన్నా వీరి దృష్టి దానిమీదికి మరలలేదు. మరికొంతకాలానికి లభించిన కవిసార్వభౌము శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి అంతేవాసిత్వంతో ఆయన ఎడదలో తలదాచుకొన్న కవితాకోకిల గొంతు ముడివిడివడింది. అయితే గురుశిష్యుల కవనప్రస్థానాల కెక్కడ పొత్తు కలియలేదు. కొంగ్రొత్త ఖండకావ్యాల ఆలాపాలతో వీ రానాటే తమ గౌతమీకోకిల బిరుదు సార్థకం చేసుకొన్నారు.

> 'మెరుగు కళ్ళజోళ్లు గిరజాలు సరదాలు
> భావకవికిలేని చవిలేవు!
> కవితయందు దప్ప గట్టివాడన్నింట
> విశ్వదాభిరామ వినురవేమ'

అని అన్నారొకచోట ఆధునిక వేమన్న శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. గౌతమీ కోకిల భావకవివర్గంలో ప్రముఖులయినా వారికి హంగామా లేవీ అలవడలేదు. అభనే వికారి సంవత్సరంలో అవనీతలిపై అవతరించారు శ్రీ వేదులవారు. ఎప్పుడు ఏదో సంసార జంజాటంలోపడి కొట్టుకుపోవడం వారికొక పరిపాటిగా తయారయింది. సహజంగా కవిశేఖరు లయినా శ్రీ శాస్త్రిగారు అంతగా అదృష్టజాతకులు కాలేదు.

విద్వత్పరీక్షలో ఉత్తీర్ణులయిన పిమ్మట వీరు పెద్దాపురంలో, కాకినాడలో, పేరూరులో ఆయా హైస్కూళ్ళలో తెలుగు పండితపదవితో తమ సంసారయాత్ర సాగించుకొన్నారు. ఇరవై నాలుగు సంవత్సరాలు తీవిధంగా గడిచిన పిమ్మట కొంతకాలంనుంచి వీరు కావలికళాశాలలో అదే పండితపదవిలో కుదుకొన్నారు. ఇలాగ శ్రీ శాస్త్రిగారి జీవితపంథా పరిశీలిస్తే అడుగడుగునా ఏవేవో ఎగుడు దిగుడులే కనిపిస్తాయిగాని అంతగా చెప్పుకొనదగిన ఘనత లేవిగోచరించవు. ఇటువంటి గడ్డుపరిస్థితులలో కవితలో అతిమనోజ్ఞమయిన కమ్మని గొంతు వీరి కెలాగ అలవడిందా అని ఆశ్చర్యం కలుగుతుంది.

వేదులవారు దీపావళి, విముక్తి, మాతల్లి, ఆరాధన, ముక్తావళి మొదలుగాగల ఖండికలు, కావ్యసంపుటాలు వెలువరించారు. ఇంకా కథానికలు, నవలలు, నాటికలు మొదలయినవెన్నో రచించారు. అయితే కవనంలో వీరు పట్టినదంతా పదారవన్నె బంగారుగా తరలించింది. ఆంధ్ర సంస్కృతపదాల చిక్కని చక్కని పోహళింపులతో, తీయని జాతీయ మాధురితో కృత్తిల్లగల పద్యవిద్యాధిక్యతలో శ్రీ శాస్త్రిగారితో తులతూగగల వారెంతోమంది లేరు.

శ్రీ సత్యనారాయణశాస్త్రిగారు ఉగ్గుబాలతో అనూచాన సంప్రదాయం రంగరించుకొన్న చేతలతో సంఘసంస్కర్తలయిన ధీరులు. ప్రబతుకుబాటలో చిమ్మచీకటు లలముకొంటున్నా సున్నితమయిన హాస్యధోరణితో శ్రోతల నుర్రూతలూగించగల సరసప్రసంగ చతురులు. షష్టిపూర్తి సమీపిస్తున్నా జనస్తుతి సంక్రమించిన కవిత్వంలో నవనవోన్మేషం కురిపించగల పరిణతి శిల్పులు.

వేదులవారి కవిత ఆకళించుకొంటేనే అంతరాంతరాలలో మనోహరమయిన అగరుధూమ మాలికలా నిలిచిపోతుంది. వీరు పద్యాలు బళ్లకొద్ది ప్రచురించినవారి జాబితాలో చేరకపోవచ్చును. కాని శ్రీ శాస్త్రిగారి ఒక్కొక్క కవితాఖండిక సానబట్టిన మణిశలాక. ఆంధ్రవాఙ్మయ రంగంలో చిరకాలం నిలిచిపోగల జయపతాక.

> 'వేసవిరేల వేణువన వీధులయం
> దలస ప్రసారముల్ చేసిన కమ్మతెమ్మెరల
> చిందులతో స్ఫురియించు గాన వి
> న్యాసమువోలె, మెల్ల మెల నాచెవి
> సోకను, నీ నిరంతర వ్యాపిత విశ్వఘోషణ
> రహస్యము దూరమునుండి వింపగన్' ★

# ప్రతీకారం

'వీరాజీ'



ధుమధుమ లాడుతూఉన్న మొహంతో వచ్చాడు శైలేంద్ర. చంకనున్న పుస్తకాలనంచీ గబుక్కున జార్చి నిర్లక్ష్యంగా బీరువా మీదికి విసిరి కోపంగా గోడవారకువెళ్లి నించున్నాడు. ఏడు సంవత్సరాలు నిండని వాడి పసి మొహంలో కాఠిన్యం స్ఫురించింది. కందగడ్డలా కందిపోయిందది. తల దించుకుని ఆఫీసు కాగితాలు చూసుకుంటున్న రాజేంద్ర తల ఎత్తి కొడుకు అలక గమనించి కించిత్ విస్మయపడ్డాడు. వాడి కళ్లల్లోని తీవ్ర ప్రతీకారవాంఛ ఏమోనని అనునయంగానే అడిగాడు. "బాబూ! మాస్టారు కోప్పడ్డారా?" శైలేంద్రకు తండ్రి సానుభూతితో కనుకొలకుల్లోకి దుఃఖమే పొర్లుకు వచ్చింది. ఐతేనేం మగపిల్లవాడు కదా మరి. దర్పమే పుంజుకుందామని వాడి ప్రయత్నం. తండ్రికి తల అడ్డంగా తిప్పి సమాధాన మిచ్చాడు.

"మరి అంత కోప మెవరి మీదరా! ... బళ్లో నేస్తాలెవరేనా కొట్టారా .... చెప్పు నేను కనుక్కుంటాగా."

శైలేంద్ర లేత పెదవులు వణికాయి. రెండు క్షణా లూరుకుని "అదికాదు నాన్నగారూ! మాష్టారే దాన్ని కొట్టమన్నారు .... అదేమో .... అదేమో ..."

వాడికి చిన్నతన మనిపించింది కాబోలు ఊరుకున్నాడు. రాజేంద్ర లేచి వెళ్లి వాడి బుగ్గలు పుణికాడు. కుడి చెంపకంటే ఎడం చెంపఎర్రగా కందిపోయింది. తండ్రి మనస్సు చివుక్కుమంది. "అదెవర్రా! .... మాస్టారికేం పోయే గాలం? ఎందుకు కొట్టమన్నాడూ ...."—పార్వతి ఆందోళన వ్యక్తపరుస్తూ వచ్చింది. ఎట్టకేలకు శైలేంద్ర ఒప్పుకున్నాడు. "నాకు పదహారో ఎక్కం రాలేదూ .... మరి వందన కేమో వచ్చింది.... అందుకని...." వాడికి తల్లిని చూచే సరికి మరి దుఃఖం ఆగింది కాదు. పార్వతి గుండెలకదుముకుంది. "అందుకని నిన్ను

పదహారో ఎక్కం రాలేదు. శిక్షగా మాస్టారు అమ్మాయి చేత దవడ వాయగొట్టించారు. అవమానం, సిగ్గు, బాధ—శైలేంద్ర ఏడుపు మొహంతో ఇంటికి వచ్చాడు. అంతా తండ్రి పోలికే.

"కాని మన వాణ్ణి దవడ కందగొట్టిన ఆ చిన్నది మాత్రం నీ వంటిది కాదు" అని మెచ్చుకున్నాడు రాజేంద్ర పార్వతిని.

"ఎందుకంటే మనవాడి ఎడం చెంప కంది పోయింది... నీది పుత్ర చేతి వాటమాయె!"

పార్వతి ఏమంటుంది? "రేపు కోడలువచ్చాక చూద్దాం..."

---

దానిచేత కొట్టించాడన్నమాట."—ఆమె మాస్టారుని తిట్టుకుంది.

రాజేంద్రకు సంగతంతా అర్థమై పోయింది. "ఒరే బాబూ! రేపు నీవు దాని దవడ పళ్ళు రాల గొడుదువులే .... ఇవాళ్టికి వూరుకో .... అదెవరో .... మీ అమ్మలాంటిది కాబోలు" అన్నాడు కొడుకును బుజ్జగించి, అదే సందన్నట్లు, భార్యను కొంటెగా వీక్షించి.

"వాడికి బుగ్గ ఎలా కందిపోయిందీ చూసే మీరు నవ్వుతా రేం ?" అంటూ పార్వతి వాడి నెత్తుకుని వంటింట్లోకి నడిచింది.

రాజేంద్రకు కాగితాలమీద నిలవలేదు మనసు. అతగాడి పెదవుల మధ్య మందహాస మున్నది. మనస్సు వెనక్కు పరుగెత్తింది. పాతికేళ్లనాటి స్మృతి చిత్రాలు మెదిలాయి.

రాజేంద్రకు ఏడో ఏడో,ఎనిమిదో ఏడో అది. ఐదో క్లాసు : మాస్టర్లందరిదీ ఒకటే తత్వము. వాళ్ల పద్ధతులకు వ్యాకరణసూత్రాలకూ మార్పూ కూర్పూ అసాధారణమే. రాజేంద్రకు లెక్క రాలేదు. వున్న ముగ్గు రాడపిల్లల్లో ఆరేళ్ళ పార్వతి ఉడుత పిల్లలా యిట్టే వచ్చి "ఇదోనండీ" అంటూ చూపెట్టేసింది లెక్క.

"భేష్ ! యీ లెక్క చెయ్యలేని వాళ్ళందరికీ నువ్వు చెంపలు వెయ్యి .... బుద్ధైనా వస్తుంది ...." అన్నారు మాస్టారు. పార్వతికి హుకుం ఇచ్చేశారు.

అప్పటికీ రాజేంద్ర ధైర్యంగానే ఉన్నాడు. "నిన్ననే గదా దాన్ని నేను ఎక్కాలు రాపోతే మాస్టారు కొట్టమంటే చిటికవేసి వూరుకున్నాను. అది మాత్రం నన్ను కొడుతుందా"ని. రెండు జేబుల్లో రెండు చేతులు పెట్టుకుని నించున్నాడు—నిక్కరు జారిపోకుండా కడుపు వూరించి. పార్వతి మొట్టమొదట రాజేంద్ర దగ్గరకే వచ్చింది. ఆ యీడులో మగపిల్లలకంటే ఆడపిల్లలే కాస్త జబరుగా, ఏపుగా ఉంటారుకదా !

ఎడంచేతి వాటం పార్వతిది.

రాజేంద్ర కుడి చెంప చెళ్ళుమంది.

ఎంత శీవిని ప్రదర్శిస్తే మాత్రమేం ? పసివాడు కదా ! భూమిని పచ్చగా చూసి గ్రుడ్లనిండా నీరు నింపుకున్నాడు — ఆ క్షణంలో రాజేంద్రకు పార్వతికి పీకేపిసికేద్దామన్నంత కసి వేసింది. కాని యీ ధర్మరాజులాగ ఎదుటనే పేప రువ్వుతో సహా

---

నరసింహమ్మాస్టారు. ఆయనకు కోపం వస్తే 'నర' పదార్థం పూర్తిగా లోపిస్తుంది. ... సింహమే మిగుల్తుంది.

రాజేంద్రకు ఆ వేళంతా పార్వతిని చితక తన్నేయాలని మాస్టారి కాళ్లల్లో సీనప్పెంకులు గుచ్చెయ్యాలనీ తలంపులే. ఇంటికి వచ్చి వెక్కి వెక్కి ఏడ్చాడు. ఆ రాత్రి కలలో బడి — బడిలో తను మాస్టారు ! నరసింహం మాస్టారేమో పిల్లాడు — పార్వతి తనకు లెఖ్ఖచేసి చూపించింది. తనేమో "వాడ్ని దవడ వాయగొట్టు" మన్నాడు అచ్చం నరసింహం మాస్టారి కేసి, నరసింహం మాస్టారిలాగే చూసి — పార్వతి "చిత్తం" అంది తను చూసిన అల్లాఉద్దీన్ సినిమాలో అల్లాఉద్దీన్ భూతం తెచ్చిన దేవకన్యలాగ — అంతే చెళ్లుమంది నరసింహం మాస్టారి దవడమీద. కాని రాజేంద్రకు కసి తీరలేదు. అసలు తను పార్వతిని దవడవాయ గొట్టాలి. దాని జెడ యింత పొడుగ్గుంటుంది. దాన్ని దొరక పుచ్చుకుని .... దాన్ని దొరక పుచ్చుకొని .... ఐతే ఆ కల మాత్రం రాలేదు. రెండు రోజులు తగిలిన దెబ్బకంటే మిన్నగా పసిహృదయం దెబ్బతిన్నదేమో జ్వరం వచ్చింది.

జ్వరం వదిలి రాజేంద్ర బళ్లోకి వెళితే మాత్రం ? పార్వతి రాలేదు — రాజేంద్రకి పార్వతి ఏమయ్యిందీ అన్న జిజ్ఞాస పీడించింది. "పార్వతి నాన్నగారు బదిలీ అయిపోయారు .... అది గూడా మాస్టారికి చెప్పిపోయింది. .. మాకందరికీ జేజేలు చెప్పింది..... మరి నువ్వు రాలేదుగా. నువ్వొస్తే....యిదో యీ చాకలేటు యిమ్మంది"— మరియమ్మ చెప్పింది .... రాజేంద్ర మొహం చూసి ఆ పిల్ల జాలిపడ్డది. రాజేంద్ర తీవ్రమైన కళ్లల్లో ప్రతీకార వాంఛ — బహుశా యివాళ శైలేంద్ర కళ్లల్లోని అవమానం లాంటిదే — చూసి మరియమ్మ కంగారుపడ్డది. "పోనిలే రాజా ! నీ నేస్తం నే నుంటాగా" అంది — రాజేంద్ర చాకలేట్ పుచ్చుకుని విస్సిరి నేలని కొట్టాడు — మరియమ్మ తనను కాని తంతా డనుకుందో యేమో — పారిపోయిం దక్కడె నుంచి.

అసలైన ప్రత్యర్థి ఎదుట లేకపోవడంతో, రాజేంద్ర మనస్సు, నరసింహమ్మాస్టారి పిదవుడా సీనత వహించింది, కాని పార్వతిని మాత్రం వెదుకుతూనే ఉంది. ఆటు తర్వాత రాజేంద్ర హైస్కూల్లో చేరాడు — వాళ్ళ నాన్నగారికి బదిలీ ఐతే కాకినాడలో కాలేజీలో చేరాడు. అతగాడు మాత్రం, పార్వతిని వెదుకుతూనే ఉన్నాడు. నరసింహమ్మాస్టారునే అడిగాడు ఐదో క్లాసుపాసవుతూఉన్నప్పుడు 'పార్వతీ వాళ్ళూ ఏవూరు వెళ్లారని ?'—ఆయన బహుశా రాజేంద్ర చూడగా నవ్వడం అదే మొదటిసారి— "కాకినాడరా .... ఏం వెడతావా!" అన్నాడు నవ్వుతూను.

తన క్లాసుమేట్లు ముగ్గురు అమ్మాయిలు — ఐతే ఎవరి పేరూ, పార్వతి కాదు. ఎవరి బుగ్గ మీదా తేనె రంగు పుట్టుమచ్చ లేదు. రాజేంద్ర అన్నీ మర్చిపోయాడు. ఆఖరికి నరసింహమ్మాస్టారి మొట్టికాయలు కూడా మర్చిపోయాడు కాని పార్వతి బుగ్గమీద పుట్టుమచ్చ మాత్రం గుర్తుండి పోయింది. కొడితే చెంపమీదే కొట్టాలితను. కాని పార్వ తెక్కడ ?

తన దవడ వాయ గొట్టింది గనక తనకి జ్ఞాపకం ఉంది — మరి ఆ పిల్లకి ఏం జ్ఞాపకం ఉంటుంది — అదీగాక తనెంత మారిపోయాడు— ఉంగరాల జుట్టు వచ్చేసింది. మొహంమీద మీసం, గెడ్డం పెరిగి పోయాయి—"నా మొహాన ఏ పుట్టుమచ్చా లేదాయిరి"—అని ఎప్పుడేనా పైలా పచ్చీసులో ఉన్న రాజేంద్ర తలపోసేవాడు.

కాని పార్వతి మాత్రం తటస్థపడలేదు.

ఐతే : ఒకనాడు దైవికమైన సంఘటన ఒకటి జరిగింది. ఇంటర్ కాలేజియేట్ డిబేట్లు జరిగాయి, రాజేంద్ర ఫైనలియర్‌లో. అవి ఏ ఏడాది జరగవు గనక ? కాని రాజేంద్ర ఆ ఏడాది తన కాలేజీ తరపున ప్రతినిధిగా ఎన్నికయ్యాడు.

స్ఫురద్రూపి, మాటకారి, వీటికి తోడు వినమ్రుడు, రాజేంద్ర—అటువంటి అభిప్రాయం కాలేజీలోని అమ్మాయిలకు స్థైర్యం వుందని ఎవరి నమ్మకం ఎలా ఉన్నా, తను నమ్మేవాడు రాజేంద్ర. ఇందులో ఒక్కతె పేరు పార్వతి. ఐనా, సాచి లెంపకాయ కొట్టి—ఆనక క్షమాపణ చెబుదా మనుకునేవాడు రాజేంద్ర. రాజేంద్రకి నవ్వు వచ్చేది— తనలోని యీ విపరీత ప్రతికారవాంఛకు.

విశాఖ కాలేజీ నించి ఓ అమ్మాయి డిబేట్‌కి వచ్చిందంటే—అదో విశేషమై పోయింది మిగతా టీములకు. మాటాడ్డంకంటే, మజాగా ఆలోచించడంలోనే గడిపేశారు కొందరు.

వేదిక మీదకు టీముల నాహ్వానిస్తున్నప్పుడే మొదటిసారి కంట బడింది ఆ ఏకైక నారీ ప్రతినిధి. వెన్నెలలాంటి తెల్లని చీరెలో చందమామలాంటి మొహం. దానిమ్మ పువ్వులాంటి నోరు. ఆ చంద్రవదన మొహాన తేనె రంగు పుట్టుమచ్చ విద్యుత్ కాంతిలో మిలమిలా మెరుస్తున్నది. అదీ ఎంత ? కందిబద్దంత ! రాజేంద్ర ఉలిక్కిపడ్డాడు. పార్వతి కాబోలు— మరి యీ రతీదేవికిన్నూ, అతని హృదయ ఫలకం మీది లాగూ గాను పార్వతికీ పోలిక లెలా కలుస్తాయి ! రాజేంద్రకు అద్దాన

వడిన పాదరసంలాగ మనసు నిలకడ తప్పింది. 'స్త్రీలకున్నూ పురుషులతో సమాన హక్కులు కావాలి' అంటూ వాగ్యుద్ధం జరిగింది, వేదికమీద. జలపాతంలాంటి ఉధృతంలో మాటాడుతూ ఉండటం అంతలో అధ్యక్షులు "టింగ్" మని బెల్లు కొట్టటం—అక్కడి కది సమాప్తం. జనం గొల్లు మనడం.

రాజేంద్ర ఎడమ మాత్రం ఈ పార్వతి ఎడమ చెయ్యి వాటం పార్వతి అవునా కాదా ? .... తనేం చెయ్యాలి .... మరి దవడమీద యీ పిల్లని కొట్టడం అంటే మాటలా ? పురుషుల హక్కుల గొడవ మాటకేం గాని — స్త్రీల కున్న ప్రత్యేక హక్కుల సంగతి తనకు తెల్సును కదా — ఆ పిల్ల నుఖమల్ చెప్పులు తొడుక్కుంది కూడాను. శాటిన్ లాంటి ఆ చిన్న దాని బుగ్గలమీద తను ?—రాజేంద్రకు యిన్ని సంవత్సరాలుగా నాటిపోయిన పగ—కసి అంతా నాటితో, చేత వేసుకున్న ఆల్కాహోలు చుక్కలాగ కరిగిపో సాగింది.

"ఆ విల్లంది తదగణ్యానంత ...." అన్నట్లు సత్యభామ విల్లు సంధిచే పోజులో మైకును పట్టు కుని వించువ్నది మిస్ పార్వతి .... సభ మొద రిక్కించింది—సెలయేటి తుళ్ళింతలు ఆమె పలుకులు. జలపాతపు ఉధృతం కాదు—జనం ఓహో ! చప్పట్లు !—అందులోకీ విద్యార్థినీ జనం చప్పట్లు—తర్వాత మిస్టర్ రాజేంద్ర .... రెండు సార్లు ఎనౌన్సు చేస్తేగాని తన కుడి చెంప తడుము కుంటూ ఉన్న రాజేంద్రకు తెలివి రాలేదు.

"ఎవ రొద్దన్నారు ? స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు—" అదీ ఆరంభ వాక్యం రాజేంద్రది. విస్తుపోయా రంతా. ప్రతివాదిస్తు న్నాడా యితగాడు ?— "యూ ఆర్ టు టాక్ ఎగ్నెన్స్ట్"—జనం చప్పట్లు ! రాజేంద్ర చలించ లేదు. అతని తుమ్మెదల దండు లాంటి ముంగు రులు విద్యుత్కాంతిలో మెరుస్తున్నాయి.

"ఈ దేశంలో స్త్రీల కున్న ప్రత్యేక హక్కులు వదులుకుంటామంటే ఎవరు కాదన్నారు సమాన హక్కులు ? — తప్పకుండా నేటినుంచి బస్సుల్లో ప్రత్యేక సీట్లు తీసెయ్యండి—తీసెయ్యండి రైలు బళ్లలో ఆడవాళ్ల పెట్టెలు—మగవాళ్ల పెట్టెల మీద కూడా రాయండి మగవారికి మాత్రమే అని —కలాశాలల్లో ఆడపిల్లల కెందుకు ప్రత్యేక విశ్రాంతి గదులు ? ఉంటారా ? వారున్నూ, పురుషులకు మల్లే చింతచెట్ల క్రింద లీజర్ అవర్సులో—ఎందుకయ్యా వారికి సగం రేట్లు. విశ్వవిద్యాలయం బస్సుల్లో ? — వారికీ సమాన హక్కు లివ్వండి పాపం ! ...." నటన గూడా ఉంది రాజేంద్ర దగ్గర .... సాగించాడు వాదన. "యీ ప్రత్యేకతలు వద్దా ? ఏమో నే ననుకోను. ఉత్త మన రొదనే గాని స్త్రీలు సమాన హక్కులు కోరుతారని — వాళ్లకే అవన్నీ కావలసి వస్తే కొన్ని వదులుకోవాలి—మన ఆదిశక్తి పేరు మార్చాలి—మన భరతమాత నామధేయమున్నూ మార్చాలి—హారి భగవాన్ ! వారు కనడం మానేస్తే మనం — యింపాజిబిల్ విధాత, తీర్చవలసిన యీ చిక్కును సోదరీ మణులు—ఆఫ్టర్ ఆల్ మగవాళ్లం



# సంసారమాధురి

## కొమరగిరి వేంకటసుబ్బారావు

సతి వదన పూర్ణిమాచంద్ర చంద్రికా ప్ర
సారమునకును సంసార సలిల రాశి
యుబికి యుప్పొంగదే యట్టి యువతి మణి వి
లాస సంసారములకును లంతె గాదె.

అరయ ముద్దులొల్కు ప్రియురాలి మనోజ్ఞ ముఖాబ్జ చంద్రికా
వారము, చంచలంపు చెలువారు కనుంగవ లేమెఱుంగులుగా,
తారక దంతకాంతుల వితానము, నవ్వుల వెల్గులుండ, సం
సారము నంధకారమయ సాగరమంట విచిత్రమయ్యెడిన్.

పయ్యెదలోని పుత్తెలు ప్రభల్ విరజిమ్మగ, జన్నుదోయితో
కయ్యములాడు మేల్ పసిడి కంఠసరాలు వెలుంగు లీనగా
నయ్యలివేణిలోని పువు లల్లన తెల్లగ నవ్వుచుండ నా
తొయ్యలితోడ కాపురము దుఃఖపయోధి యెట్టులౌనొకో.

తరుణి దుస్తుల జలతారు తళుకు దళుకు
నీలిని బంగారు మెయి చాయ నైగనిగ్య
మామె మాటాడ రాలు ముత్యాల వెలుగు
లకును సంసార తిమిరంబు లడగకున్నె !

అట్టి చక్కని గార్హస్థ్య మవని దుఃఖ
సాగరమ్మని యనుట హాస్యంబు గాదె !

# కవితాపోటీలో

## బహుమతి పొందిన కవిత

మనల్నేమని అడుగుతారు ? వా రిప్పటికిన్నీ సమాన హక్కులు కావాలని—ఉన్న అంతస్థు నుంచి దిగజారుతా మంటే "వెల్‌కమ్ ! .... మనకు అభ్యంతరం నాస్తి .... నో అబ్జక్షన్"— యిలా అన్నప్పుడు రాజేంద్ర కొంటెగా పార్వతిని వీక్షించాడు. ఆ పిల్ల రెండు బుగ్గలు కంది పోయాయి. జనం చప్పట్లు మిన్ను ముట్టేయి !

రాజేంద్రుకు పార్వతి తన నెప్పుడో దవడ మీద కొట్టిందన్న పగ పోయింది సరే—యిప్పుడు మరొక్కసారి కొట్టకూడదూ అనిపించింది— అంతలో రివ్వున రానే వచ్చింది పార్వతి. అయినా మళ్ళీ—ఉహూ .... లేదు—యింత మందిలో అలాంటిదేం చెయ్యదు ! ఎందుకేనా మంచిది .... రాజేంద్ర కుడిచేయి "ఎటెంషన్" తో ఉంచుకున్నాడు. "కంగ్రాచ్యులేషన్సు .... మీదంతా కుతర్కం .... ఉత్త దగాకోరు మాటలు ...." అభినందించింది రెండో ప్రయిజు మాత్రమే పుచ్చుకున్న పార్వతి—రాజేంద్ర నవ్వేశాడు. 'దవడ వాయగొడ్తారా ? మళ్ళీను—" పార్వతి "తెల్ల బోయింది. చక్రాలంతేసి కళ్ళతో యిలా చూసి 'ఎప్పుడు కొట్టే నేను ...." అన్నది అంతలో ఎవరో ఆ పిల్లను మరిద్దరాడపిల్లలు లాక్కు పోయేరు.

రాజేంద్రను అభినందనల పరంపర ముంచే స్తున్నా—"అన్నా ! పార్వతి మర్చిపోయిందే" నన్న మనోవ్యథ పీడించ సాగింది. ఏమయితే నేం పార్వతి మళ్ళీ అగుపించలేదు. తన ప్రతీకార వాంఛ మంత్రించినట్లు అదెప్పుడో పోయింది, సరే .... అందుకు ప్రతిగా వ్యథ మిగిలింది.

రాజేంద్రకు పార్వతి తన ఎదుట నిల్చింది క్షణమే ఇనా, అదే అనుభూతి, ఎన్నో మధుర భావాలకు ప్రాతిపదిక అయ్యింది. అటుతర్వాత ఆర్నెల్లు గడిచాయి. డిగ్రీ వచ్చింది. ఇంట్లో "ఓ యింటి వాడివి" కమ్మని బలవంతమ్మైన ఒత్తిడిమ్మొ రా సాగింది. రాజేంద్రకు మాత్రం పార్వతి తలంపు మొలకెత్తి మొగ్గ తొడిగి దినదిన ప్రవర్ధమానం కాసాగింది. అలనాడు దవడమీద కొట్టి ప్రతీకార జ్వాల రేపింది కాని—యీసారి హృదయం దోచుకుని కార్చిచ్చు నింపి మరీ వెళ్ళిపోయింది.

ఎవరితోనైనా అంటే ఏమంటారు ? నవ్వుతారు .... పిచ్చాడివిరా భాయ్ .... స్వప్నసుందరి కథ కాదురా జీవితం ! అంటారు. అందుకే రాజేంద్ర మూగ తపస్సు చేశాడు. మరి తపస్సు ఫలించదా !

ఒకనాడు : మద్రాసు హౌరా మెయిలు తన మామూలు ప్రకారం త్రిక్కిరిసి పరిగెడుతూ రాజమండ్రిలో ఆగింది. రాజేంద్ర అక్కడినుంచి అందులోకి భుజశక్తి, యుక్తి అంటే కిటికీలో నుంచి దూసుకోవడం వినియోగించి ఎక్కేశాడు. మెయిలు ఆ ప్రక్క స్టేషను కెళ్ళేలోపున— తన కాలూ చెయ్యీ ఎక్కడ నక్కడ ఉన్నాయని స్థిమిత పడడమే గాకుండా, మరో మంచివాడి ట్రంకు పెట్టెమీద కూచుందుకు సానుభూతి కూడా సంపాదించాడు. రాజేంద్ర కిళ్ళీ కొట్టుకు కాస్సేపు మనసార తిట్టుకున్నాడు. కాస్సేపు ? ... మరి మనసు తిట్టినట్లు పగవాళ్ళన్నా తిట్టరుగా ! ఐతే తాను రైల్వేకు పగవాడా ? కాదు .... ఆత్మీయుడు. అందుకనే నాలి క్కరచుకుని ఆ ప్రయత్నం విరమించుకుని— పెట్టె కలయజూచ చూచాడు. అంతలో తళుక్కున ఒక్క మెరుపు మెరిసింది. ఆ విద్యుల్లత నన్ని కలువ కాడలా — అందరు పరపురుషుల మధ్య—ఎవరినీ తాకకుండా ఎల్లాగో పైది బల్ల అంచు పట్టుకుని, దివి నుంచి భువికి దిగు దేవ కన్యలా నుంచుంది. రాజేంద్రకు కెవ్వుమని కేక వేద్దా మన్నంత ఆనంద మయ్యింది. పార్వతి ! .... ఎవరా సుందరి .... పార్వతి !! .... అమాంతం ఎగిరి గెంతేసి .... అయితే రాజేంద్ర అంతలో మేల్కొని, ఆ అమ్మాయి తనను గుర్తించిన, చిరునవ్వందుకుని — తను దిగ్గన లేచి — "ప్లీజ్ యిటు కూచోండి" అన్నాడు. పార్వతి "మరి మీరో" అన్నది. నేను మీ "ఉద్యోగం పుచ్చుకుంటా" నన్నాడు నవ్వుతూ .... ఆమె బుగ్గమీది లేనెరంగు పుట్టుమచ్చను తనివిదీరా వీక్షించి....

అటు తర్వాత ప్రయాణమంతా ప్రేమాయణమే అయ్యింది. అప్పటి ప్రయాణమే వాళ్ళ ప్రేమకు నాందిఐ, అనక ప్రస్తావన సవ్యంగా ముగిసి (అదృష్టం కదా) ఈ సంసార నాటకం రక్తి గట్టింది. మరి శైలేంద్ర అందుకు ప్రత్యక్ష నిదర్శనం కదా.

రాజేంద్రకు గతమంతా ఎదను దూరి కిత కితలు పెట్టింది. తన ప్రతీకార వాంఛ ఆఖరికి పార్వతి బుగ్గమీద చేతో గాక నోటితో తీర్చుకో వలసి వచ్చినందుకు, అతగాడు ద్వైవా న్నభినందించుకున్నాడు.

రాజేంద్ర అంతా నెమరు వేసుకుని ఉలిక్కి పడ్డట్లు "పారో" అన్నాడు. "అదేమిటండీ" అంటూ సంరంభంగా వచ్చింది పార్వతి. ఆమెను గాభరా పెట్టినందుకు సిగ్గుపడి "ఉహూ ! మరేం లేదు....మన శైలేంద్ర దంతా నా పోలికే" నన్నాడు.

"ఛీస్ ! సరిపోయింది ! యిదా మీ పరిశోధన." కిలకిలా నవ్వింది పార్వతి.

"అంతేనా యింకా ఉంది" చిలిపిగా నవ్వాడు రాజేంద్ర. తన దగ్గరగా వచ్చిన పార్వతిని నడుం చుట్టూరా చెయ్యి వేసి దగ్గర లాక్కుని .... చెవి దగ్గరగా రహస్యం చెప్పేవాడిలా మొహం పెట్టి అన్నాడు. "మనవాడి దవడ కందగొట్టిన ఆ చిన్నది మాత్రం .... నీ పోలిక కాదు .... ఎందుకంటే మనవాడి ఎడం చెంప కందిపోయింది .... నీది పుత్రచేతి వాటమాయె .... "

భర్తని విడిపించుకుని కందిపోయిన చెక్కిళ్ళ సొట్టలుపడగా నవ్వి .... "పొన్లెండి .... రేపు కోడలు వస్తే కుడిచేత వాయిస్తుంది లెండి మీ దవడ కూడా" అంటూ .... శైలేంద్రతో "వస్తున్నారా బాబూ ! యిదో యిక్కడ మీ నాన్నగారు అంతా నువ్వు ఆయన పోలికేనుట .... అంటూ గర్వపడుతున్నారు .... " అన్నది.

"మరి గర్వమే .... మనిషికి సంసారం స్వర్గతుల్యమైతే యింక కొరదగిం దేముంది" అనుకున్నాడు తృప్తిగా నైట్లైట్ మునిగిపోయే ముందు రాజేంద్ర.






# దంతశూల

డా॥ గాలి బాలసుందరరావు

**గత వారములో దంతశూలకు ఒక కారణమైన పుప్పి పన్నునుగురించీ,** ఆ వ్యాధి రాకుండా తీసుకోవలసిన జాగరూకతలనుగురించీ తెలుసుకున్నాము. దంతశూల అనేక రకములు. అందుకు కారణములూ అనేకములే. వాటినిగురించి క్లుప్తముగా చర్చిస్తాను.

దంతశూలకు ముఖ్యకారణం, దంతాంతరాళములో ఉండే పంటి గుజ్జులోను, దంతములను అనుసరించి ఉన్న పెరిడోంటల్ మెంబ్రేను, చిగుళ్ళు వీటిలోను ఇన్‌ఫ్లమేషను ఏర్పడడం. వాపు, వేడి, ఎరుపు, బాధ. శరీరభాగ ధర్మ నిర్వహణకు ఆటంకము. ఈ అయిదు ఇన్‌ఫ్లమేషనుకు ప్రధాన లక్షణములని యిదివరకే తెలుసుకున్నాము. ఇన్‌ఫ్లేం అయిన భాగం కంటికి కనుపించినపుడే, ఎర్రదనం మనం గుర్తించగలం. చిగురు వాచినపుడు, ఎర్రగా కనుపిస్తుంది కాని చిగుళ్లకు, దంతములకు మధ్య ఉన్న పెరిడోంటల్ మెంబ్రేను వాచినప్పుడు పంటి గుజ్జు వాచినప్పుడు ఎరుపుదనం మినహాగా మిగతా ఇన్‌ఫ్లమేషన్ లక్షణములన్నీ మనం తెలుసుకోగలం.

పెరిడోంటల్ మెంబ్రేను ఇన్‌ఫ్లేం కావడానికి ప్రధాన కారణములు (1) అపాయము, (2) ఇన్‌ఫెక్షను. అపాయం కేవలం స్థానికం కావచ్చును. కాని ఇన్‌ఫెక్షను స్థానికం మాత్రమే కావాలనే సిద్ధాంతం లేదు. శరీరంలో ఎక్కడో ఏర్పడిన క్రిమిదోషం రక్తనాళముల ద్వారా, లింఫాటెక్సు ద్వారా వ్యాపించి, దంతముల మధ్య ఇన్‌ఫ్లమేషను కలిగించవచ్చును. దంతశుద్ధికి ఉపయోగించే కొన్ని రసాయనిక ద్రవ్యములు, ఇతరవ్యాధుల నివారణకై లోపలికి తీసుకున్న, పాదరసం, పాషాణం, బిస్మత్, నాగం, తుత్తునాగం ఇటువంటి లోహ భస్మాదులూ కూడా, దంతోపరిభాగములలో వ్యాధి ఏర్పరచి క్రిమిదోషం కలిగించవచ్చును.

ఇన్‌ఫ్లమేషన్ ఏర్పడగానే, ఇన్‌ఫ్లేం అయిన ప్రదేశంలోని రక్తం అధికంగా ప్రవేశించినందునా చీము ఏర్పడినందునా, స్థానికములైన నరాంతముల మీద వత్తిడి ఏర్పడి, బాధ కలుగుతుంది. బాధయొక్క పరిమితి యీ వత్తిడిని బట్టి ఉంటుంది. సన్నని నాదునుంచి భరించరానంతగా యీ బాధ ఉండవచ్చును.

పెరిడోంటల్ మెంబ్రేను, దంతానికీ దవడ ఎముకకు మధ్య ఉన్న పొర. దంతానికి దెబ్బ తగిలినప్పుడు ఇది షాక్ ఎబ్జార్బరులాగా పని చేస్తుంది. దంతానికి అపాయం కలిగించకుండా ఉండడానికి తనే నలిగి ఇన్‌ఫ్లేం అవుతుంది. అప్పుడు ఏర్పడిన చీము వస్తే పైకి ఉబికి, చిగుళ్ల ప్రక్కనుంచి బయటికి రావాలి. లేకపోతే దంతమూలముల వైపుగా పోయి, దవడ ఎముకకు దానిపైన ఉన్న పొరకూ మధ్య చేరుకోవాలి. వీరుపల్లమెరిగిన ట్లే చీము ఎటు ప్రక్కగా పోవడానికి వీలుంటే అటుప్రక్కకు ప్రవహిస్తుంది. వీలున్నంత వరకు శరీరాంతరాళములలోకి పోకుండా చీము బయటకు పోవడానికే శరీరం దోహదం చేస్తుంది. కాని మార్గాంతరం లేనప్పుడు చీము శరీరాంతరాళములలోకి ప్రవేశించి ప్రమాదం కలిగిస్తుంది.

**పెరిడోంటల్ మెంబ్రేను వాచినందున ఏర్పడ్డ** చీము, ఒకేచోట బుడగలాగా ఉండిపోవచ్చును. లేక పైకి వచ్చి, ఉమ్మి నీటిలో కలిసిపోవచ్చును. ఇల్లా జరిగినప్పుడు దంతమూలముల ద్వారా దవడ ఎముకలో ప్రవేశించవచ్చును. ఈ చివరపరిస్థితి ఏర్పడ్డప్పుడు ప్రాణోపద్రవమే సంభవించవచ్చును.

కొన్ని చిన్న నదులు సముద్రంలో పడకుండా సరస్సులలో కలిసిపోయినట్లే, కొన్ని వెయినులు (శరీర భాగములలో నుంచి రక్తమును తిరిగి హృదయానికి తీసుకొనిపోయే రక్తనాళములు) సైనసులు, (Sinuses) అనబడే రక్తాశ్రయములలో అంతమొంది, అక్కడ నుంచి ఏర్పడే వెయినుల ద్వారా తిరిగి హృదయానికి చేరుకుంటవి. ఈ సైనసులు, వెయినులు విస్తరించినందున ఏర్పడ్డవే. ఇటువంటి సైనసులు మెదడులో చాలా ఉన్నవి. పై ముఖం నుంచీ, చెక్కిళ్లనుంచీ రక్తమును హృదయానికి తీసుకువెళ్లే వెయిను, క్రింది దవడ ఎముకలోనుంచి ఆరంభమయ్యే వెయినుతోనూ, మెదడులో ఉన్న ఒక సైనస్‌లో నుంచి ప్రారంభమయ్యే వెయినుతోనూ సంబంధం కలిగి ఉన్నది. ఈ కారణంచేత, చెక్కిళ్లమీద లేచే గడ్డలలోనూ, మొటిమలు చిదిపితే వచ్చే ఏబ్సెసుల లోనూ 'ఎక్నీ' అనే చర్మ వ్యాధిలో ఏర్పడే బుడగలలోనూ దంతభాగములలో ఇన్‌ఫ్లమేషన్ ఏర్పడినందున దవడఎముకలోకి పోయిన చీము లోనూ ఉన్న క్రిములు, మెదడులోకి ప్రవేశించి, అక్కడ ప్రాణాపాయకరమైన ఇన్‌ఫ్లమేషన్ కలిగించడానికి చాలా అవకాశ మున్నది. ఇది సకృతుగానే జరుగవచ్చును. కాని చాలామార్లు జరిగింది. అందువల్లనే మనవారు ముఖంమీద కురుపులనూ, మొటిమలనూ చితపద్దంటారు. పంటిలో ఏర్పడ్డ చీము, దాని ధర్మమా అని బయటికి వస్తే సరే సరి. కాక దవడ ఎముకలోకి పోయిందా ఆ తర్వాత అది కలిగించే బాధలకూ, ప్రమాదాలకూ అంతూ పంతూ ఉండదు. అందుచేత పంటిపోటు ఏర్పడగానే దంతవైద్యుణ్ణి చూడడం అత్యవసరం. పెన్సిలిన్ సల్ఫానిలమైడ్, ఏక్రోమైసిన్ వంటి మందులు వచ్చాక ఈ క్రిమిదోషం ప్రాణాపాయం తేవడం లేదు. ఇవి లేనప్పుడు ఈవిధంగా జరిగి అనేక మంది ప్రాణాలు కోలుపోయినారు.

దంతశూల ప్రధానంగా పెరిడోంటల్ మెంబ్రేను వాచినప్పుడూ, దంతంలో గుజ్జు వాచినప్పుడూ ఏర్పడుతుందని ఇదివరకే చెప్పేను. అయితే యీ రెండు రకముల బాధలకూ చాలా వ్యత్యాసం ఉన్నది. దంతంలో 'పోటు' ఏర్పడగానే బాధపడలేక రోగులూ, వారి బాధ పడలేక కొందరు డాక్టర్లు పంటిని పీకివేయడం జరుగుతున్నది. పెన్సిలిన్ వంటి ఆధునిక క్రిమిసంహారక ఔషధములు, ఏస్పిరిన్ శారిడాన్ సిబాల్జిర్ వంటి బాధోపశమనక ఔషధములు వచ్చిన తరువాత, పన్ను పీకవలసిన అవసరం ఎప్పుడో గాని ఉండదు. దదంత వైద్యులు అన్నిచోట్లా ఉండరు. స్థానికంగా ఉండే వైద్యులకు, దంత రోగములకు చేయవలసిన ప్రత్యేక చికిత్స, ఎప్పుడూ తెలిసి ఉండదు. పీకడం మటుకు చాలామందికి తెలును. కాగా, వ్యాధిగ్రస్తములయిన దంతములను, క్రిమిదోషానికి గురి అయి బాధపెట్టే దంతములను, బాధా కారణములనుంచి రక్షించడం ఎంత అవసరమో, పీకివేసే సరదా ఉన్న వైద్యులనుంచి రక్షించడం అంతే అవసర మవుతున్నది. శాశ్వత దంతములు ఒకమాటు పీకివేస్తే మళ్లీ మొలిచేవి కావు. ఒక్కొక్కటిగా కృత్రిమ దంతములను నిర్మించడం అంత వాంఛనీయమైంది కాదు. పెరిడోంటల్ మెంబ్రేను వాచినప్పుడు ఏర్పడే బాధ అంత దుర్భరమైంది కాదు.

పెరిడోంటల్ మెంబ్రేను ఇన్‌ఫ్లేం కాగానే, దాని మధ్యన ఉన్న పన్ను తక్కిన పళ్ల కంటె పైకి లేచి ఉంటుంది. వాపు అధికమైన కొద్దీ పైకి లేస్తూ ఉంటుంది. ఇల్లా జరిగిన కొద్దీ దానిని అనుసరించిఉన్న చిగురూ వాస్తుంది. బాధ అధిక మవుతుంది. దవడ ఎముక పోగేదికాదు. దంతమూలము కొనదేరి ఉంటుంది. అందువల్ల పెటి

# మనము-మన దేహస్థితి

డోంటల్ మెంబ్రేను వాచి ఉబ్బినకొద్దీ పన్నుకు పైకి లేవడంకంటే వేరే మార్గంలేదు. ఇటువంటి పన్ను ఆడిస్తే ఆడుతూ ఉంటుంది. చెమిచాలాంటి దాంతో పంటిమీద నెమ్మదిగా కొడితే బాధ కలుగుతోంది. నమలడమూ బాధ కలిగిస్తుంది. చిగుళ్లకూ, దంతములకు మధ్య నుంచి చీము వస్తుంది. ఇల్లా జరగనప్పుడు, చీము దంతముల దగ్గరకు వెళ్లి చిగురును తొలిచి చిగురుకూ దవడ లోపలివేపుకూ మధ్య ఉండే ఖాళీ ప్రదేశంలో ఉబ్బు ఏర్పరిచి, పగిలి, నోటిలోకి కారిపోతుంది. పగలక ముందు, బుగ్గన పిప్పరిమెంటు బిళ్ల పెట్టుకున్నట్లు ఉంటుంది. జ్వరం వస్తుంది. కాని చిగురులో ఏబ్సెస్ ఏర్పడగానే, దంతంమీద ఒత్తిడి తగ్గి బాధ ఉపశమిస్తుంది. ఈ చీము బుడగ తనంతట తానే పగలవచ్చును. కాని యిది ఏర్పడగానే శస్త్రవైద్యం చేస్తే త్వరగా బాధ ఉపశమిస్తుంది. దంతం రక్షించబడుతుంది.

ఈ స్థితిలో పన్ను పీకవలసిన అవసరమే రాగూడదు. ఈ స్థితిలో కలిగే పంటిబాధ నిరంతరాయమైనది. ఉండి ఉండి వచ్చేది కాదు. ఈ స్థితి ఏర్పడగానే ఉప్పును భరించగలిగినంత వేడి నీరులో కలిపి, పుక్కిలిస్తే వాచిన ప్రదేశముల నుంచి నీటిని గుంజుకుని బాధ తగ్గుతూ ఉంటుంది. ఉప్పు క్రిమిసంహారక ద్రవము. పొటాస్సియం పెర్మాంగనేట్ స్ఫటికం ఒకటి నీళ్లలో వేసి, పుక్కిలిస్తే చీము, నశించి క్రిమిదోషం తగ్గుతుంది. ఈ స్థితిలో వేడి తగిలినప్పుడు సుఖంగా ఉంటుంది. దవడపైన కాపు పెట్టితే మంచిది. ఈ లక్షణమూ, పన్ను తక్కిన పళ్లకంటె పైకి లేవడమూ గమనించదగిన లక్షణాలు.

పెరిడోంటల్ మెంబ్రేను ఇన్‌ఫ్లేం కాగానే చికిత్స పారంభిస్తే పంటిని పీకవలసిన అవసరం రాదు. చీము లోపలికి పోయి, విపరీతమైన జ్వరం, ధాక్సినులవల్ల శరీరమునకే ప్రమాదమూ వస్తున్నప్పుడూ, చిగురు గట్టిదై చీము బయటకు రావడానికి వీలు లేనప్పుడూ, శస్త్రవైద్యం సాధ్యంకానప్పుడూ ప్రాణరక్షణకై పంటిని పీకివేయవలసిన అవసరం రావచ్చును. అద్భుత క్రిమి సంహారక శక్తి సంపన్నములయిన ఆధునికౌషధములు ఉన్నప్పుడు కూడా రోగులు నిర్లక్ష్యం చేసి వ్యాధి ముదరబెట్టుకుని వస్తే వైద్యులు చేయుగలిగిందేమీ ఉండదు.

కేరీస్ వంటి కారణములవల్ల పంటి గుజ్జు ఇన్‌ఫ్లేం అయి విపరీతమైన బాధ కలుగుతుంది. చీముకు చిగుళ్లు దారి ఇచ్చినట్లుగా దంతము దారి యివ్వదు. దంతాంతరాళములో ఏర్పడ్డ ఇన్‌ఫ్లమేషను త్వరగా ఉపశమించకపోతే, ఏర్పడే చీము బైటకు రావడానికి నైసర్గికమైన మార్గములు రెండే. అది ఆదంతమూలము నుండి బయటికి వచ్చి చిగురును చీల్చుకు బయటకు రావడం. లేదా దవడ ఎముకకూ దానిపైన ఉన్న పొరకు మధ్యకు పోవడం. చీము అధికమైనకొద్దీ పంటి గుజ్జులో ఉన్న నరములు మీద ఒత్తిడి అధికమై బాధ దుర్భరమైపోతుంది. ఆ బాధ పడలేక "వెధవ పన్ను పోతే పోయింది. పీకెయ్యమంటారు" రోగులు. ఈ స్థితిలో దంతోపరిభాగంలో డ్రిల్లుతో చిన్న రంధ్రము చేసి చీమును బయటికి లాగి, వెంటనే బాధానివారణ చేయవచ్చును. కాని ఇది దంత వైద్యులు ఉన్నచోట మాత్రమే సాధ్యము. ఆవిధంగా ఏర్పడ్డ రంధ్రాన్ని తరువాత మళ్లీ ఎనామెల్‌తో మూసివేయ వచ్చును. ఇల్లా సాధ్యంకానప్పుడు క్రిమి సంహార కౌషధములతో బాధానివారణ, క్రిమిదోష నివారణ, జరగనప్పుడు పీకివేయక తప్పదు.

పంటి గుజ్జులో వాపు ఏర్పడి పంటి పోటు వచ్చినప్పుడు, పన్ను కదిపితే కదలదు. చెమిచాలాంటి వస్తువులతో కొడితే బాధ అధికం కాదు. పన్ను స్థానం తప్పి పైకి లేవదు. వేడి వస్తువులు ఘన పరిమాణాన్ని అధికం చేస్తుందిగదా. అందువల్ల పంటిగుజ్జు వాచిన పంటికి వేడి తగిలితే అది మరీ పెద్దదై నరములమీద వత్తిడి అధికమై మరీ బాధ కలుగుతోంది. విశ్రామకాలంలో బాధ అధికమవుతుంది.

పెరిడోంటల్ మెంబ్రేనూ, పంటి గుజ్జు వాయక పోయినా, చెవిలో పోటూ, జలుబు చేసినప్పుడు పై దవడ ఎముకలో సైనసులు వాచినప్పుడు, పళ్లలో పోటు వచ్చినట్లు ఉండవచ్చును. దవడ ఎముకలలో ఉన్న నరములపై పొరలు వాచి పళ్లలో పోటు రావచ్చును. చిగుళ్లు వాచినప్పుడూ పళ్లలో పోటు రావచ్చును. కాని యీ విధమైన పోటు, ఒక పంటికీ రెండు పళ్లకూ సంబంధించి ఉండదు. ఎనామెల్ పొర పోయి, డెంటైన్ బయట పడినప్పుడు, వేడి, చల్లన కూడా బాధ కలిగించవచ్చును.

ఎనామెల్ పొర పోవడానికి ప్రధాన కారణమైన లెక్టోబేసిల్లస్ ఏసిడోఫైలస్ అనే క్రిమి, చింత పండు పులుసులో బ్రతకలేదు. ఈ కారణంచేత చింతపండు విరివిగా ఉపయోగించేవారిలో దంత వ్యాధులు సక్కువ. కేరీస్ యింకా సక్కువగా ఉంటుంది. దక్షిణాదివారి ఆహారంలో చింతపండు కేవలం రుచికి మాత్రమే అవసరమైన వస్తువు కాదు. ఈమధ్య డాలర్ల కోసం కేంద్ర ప్రభుత్వం చింతపండును విదేశాలకు విపరీతంగా ఎగుమతి చేస్తున్నది. ఇది దక్షిణాదివారికి ముఖ్యంగా వారి దంతాలకు చాలా అన్యాయం. తరతరాలుగా ఒక ఆహార పదార్థం మానవజాతుల ఆహారంలో నిత్యమూ వినియోగించబడుతున్నదంటే దానిలో ఏదో అత్యవసరమైన పదార్థం ఉన్నదని శతాబ్దముల అనుభవంవల్ల ఆ జాతివారు తెలుసుకుని అల్లా చేయడం జరుగుతుంది. దాని వెనక ఉన్న వైజ్ఞానిక సత్యం వారికి తెలియకపోవచ్చు. చింతపండు ఎగుమతి సందర్భంలో కొందరు మంత్రులు, దేశాభివృద్ధిదృష్ట్యా ఆహార విధానాలు మార్చుకోడం మంచిదని వేదాంతం బోధించారు. దేశాభివృద్ధి ప్రజారోగ్యానికి! ప్రజారోగ్యాన్ని బలి చేసే దేశాభివృద్ధి దేశాభివృద్ధి కాదు. ★



రాజఘాట్ వద్ద గాంధీ స్మారక సంగ్రహాలయానికి రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్ జనవరి 31 న ప్రారంభోత్సవం చేశారు.

## న్యూఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణ

# వయసుమళ్లిన మిటారికత్తెల విడిసిపాట: "భూటాన్ విముక్తి"కి చైనా తాపత్రయం

ఎలిజబెత్ రాణి, ఢిల్లీ నగరంమీద, నగరవాసుల మనస్సులలోను, చిర స్థాయిగా నిలిచే ముద్ర వేశారు. ఆమె క్షేత్రయాత్రకు పూనుకొని యిక్కడకు రాలేదు కాని, తమ సౌజన్యంతోను, అభిజాత్యంతోను, రాజతంత్రజ్ఞతతోను ప్రతి వారిని లోబరుచుకోగలిగారు. ఉదాహరణకు, పౌర సన్మాన సభలో ఆమె తమ తాతగారి భారత యాత్రను ప్రస్తావించి, ఆనాడు ఆయన ఈ దేశానికి రావడానికి నెలరోజులు ప్రయాణం చేయవలసి వచ్చిందనీ, ఇప్పుడు తాము రావడానికి 24 గంటలు కూడా పట్టలేదనీ అన్నారు. ఉత్తరోత్తర తమ పిల్లలు భారతదేశంలోని "వారి మిత్రులను చూచేందుకు" రావాలంటే ఎన్ని గంటలు పట్టవచ్చునో వూహిస్తేనే ఆశ్చర్యం కలుగుతుందని చెప్పారు.

రాణిగారు ఢిల్లీలో ఉండగా, వెనుక 1911 తమ తాత ముత్తవ్వలు మకాం చేసిన భవనాలను గాని, పట్టాభిషేక మహోత్సవంతో సహా మూడుసార్లు అప్పుడు దర్బారు ఏర్పాటైన మందిరాన్ని గాని, దర్శించేందుకు ప్రయత్నించలేదు. న్యూఢిల్లీ నగరనిర్మాణానికి శంకుస్థాపన ఎక్కడ జరిగిందో కూడా ఆమెకు తెలియదు. అసలు ఆ విషయం గూర్చి ఆమె దర్యాప్తు చేయలేదు.

ప్రతిదానిలోను వెలుగు నీడలు ఉంటాయి. రాణిగారి పర్యటనలో కూడా అంతే. పర్యటన కార్యక్రమం సవ్యంగా లేకపోవటం మొదటి లోపం. జయపూర్‌లో పులుల వేటకని రెండు రోజులు ప్రత్యేకించారు. దుస్తుల ప్రదర్శనంలో దాదాపు ఒక గంట గడిచిపోయింది. రాణిగారు కుటీర పరిశ్రమల ప్రదర్శనశాలను తిలకించేందుకు బొటాబొటిగా అరగంట మాత్రమే ప్రత్యేకించటం జరిగింది.

అసలు ఈ దుస్తుల ప్రదర్శనం ఏమిటి? సమాజంలో ఉన్నత స్థానానికి ఎగబ్రాకటమే జీవిత లక్ష్యంగా పెట్టుకున్న కొందరు వ్యక్తులు వెలా తెలా పోతున్న తమసౌందర్యాన్ని రాణిగారికి చూపేందుకు సమావేశమయ్యారు. కాని పాపం వారు తమను ఆవహించిన వృద్ధాప్యాన్ని మాత్రం కప్పిపుచ్చలేకపోయారు. తాము వృద్ధులమన్న సంగతిని అంగీకరించే సౌజన్యం వారివద్ద లేదు.

ఒకానొకప్పుడు అందాలరాణిగా ప్రసిద్ధిగన్న డయానా కూపర్ ఈ విషయమై వ్రాసిన కొన్ని వాక్యాలను ఇక్కడ ఉదహరిస్తాను. ఆమె యిటీవల వ్రాసిన పుస్తకంలోనివి ఈ వాక్యాలు: "ఇకమీద నా జ్ఞాపకాలను ప్రస్తావించను. వాటిని విచారఛాయలు అలముకుంటాయి. వృద్ధాప్యం మన్ని జయిస్తుంది. దానికి మనం అలవాటు పడాలి. అందవిహీనమైన ఈ సుదీర్ఘ శిశిర మార్గంలో అడుగు వేయడం నే నిప్పుడు నేర్చుకోవాలి. నా

# న్యూఢిల్లీ లేఖ

విద్దెతనాన్ని చూచి పొరపాటున నన్ను వోదార్చటానికి ఇతరులు ప్రయత్నించే ముందు నాకు నేనే నచ్చుకో గలగాలి.''

నిన్నటి న్యూఢిల్లీ సౌందర్యవతులు, వృద్ధాప్యం అనే అంద విహీనమైన సుదీర్ఘ శిశిర మార్గంలో పొందికగా అడుగు వేయటం ఇంకా నేర్చుకో లేదు. అడపా దడపా వీరు తమ దుస్తులను ప్రదర్శించేందుకు న్యూయార్క్ వెళ్లి వస్తూ ఉంటారు. గతవారం వీరు రాణిగారి సమక్షంలో దుస్తుల ప్రదర్శించారు.

రాణిగారి పర్యటన సందర్భంలో జమీందారీ వ్యవస్థ మళ్లీ తన కోరలు ప్రదర్శించింది. సర్దార్ పటేల్ ధర్మమా అని జయపూర్ మాజీ మహారాజా ఇంతవరకు వార్షిక భత్యం పుచ్చుకో గలుగుతున్నాడు. ఈయన ఇప్పుడు రాణిగారి పర్యటన తన సొంత వ్యవహారంగా భావించాడు. తన హోదాను ఇతడు డబ్బుగా మార్చుకుంటున్నట్లు ఇదివరకే అందరికీ తెలుసు. ఎలా వినియోగించుకోవాలో కూడా తెలియనంత ధనం ఉన్న కొందరు అమెరికన్లు హోదా కోసం అర్రులు చాచి, ఈ మహారాజా భవనంలో జరిగే విందులచేత ఆకర్షింప బడుతారు. అయితే అందుకు వారు డబ్బు దర్శించుకోవలసి వస్తుంది. ఇప్పుడు రాణిగారి రాక సందర్భంలో కూడా నాలుగు డబ్బులు చేసుకుందామని మహారాజా సాహెబ్ ఆశించారు. కర్మ కాలి ఈ విషయం బయటకు పొక్కింది. అయినా వేలాదిగా టిక్కెట్లు అమ్మినప్పుడు దాచాలన్నా ఆ వార్త దాగదుకదా! జయపూర్ మహారాజా వంశం చరిత్ర ప్రసిద్ధమైనది. ఒకవంక మహారాణా ప్రతాప్, తన భూభాగంమీద విరుచుకుపడిన అక్బర్ సైన్యాలతో పోరాటం సాగిస్తూంటే, వేరొక వంక ఆయన సోదరుడు, జోదాబాయ్‌ని అక్బర్ కిచ్చి అతనితో సంధిచేసుకున్నాడు.

మహాత్మాగాంధి సన్నిహిత వర్గంలోని ఒక వ్యక్తి కూడా న్యూఢిల్లీలో ఒక చిన్న తరహా ప్రదర్శనం ఏర్పాటు చేశారు. తమను ''రాజకుమారి'' అని సంబోధించాలని భారత రిపబ్లిక్‌లో పట్టుపడుతున్న కుమారి అమృతకౌర్, భారత వైద్య సంస్థపై ఇంకా ఆధిపత్యం చెలాయిస్తూనే ఉన్నారు. ప్రధాన మంత్రి వద్ద ఆమెకు గల పలుకుబడి పుణ్యమా అని, కుతుబ్ రోడ్డులో ఎదురు బదురుగా రెండు పెద్ద ఆసుపత్రులు ఉంటాయి. యుద్ధ కాలంలో అమెరికన్ల కోసం నిర్మించిన సఫ్దర్ జంగ్ ఆస్పత్రి వీటిలో ఒకటి. రెండవది భారత వైద్య సంస్థకు అనుబంధంగా ఉండే ఆసుపత్రి. కుమారి అమృత కౌర్, ప్రణాళికా సంఘం అధ్యక్షుడు శ్రీ నెహ్రూనే ఒప్పించగలరు కాబట్టి, పాపం ఆ సంఘం నిస్సహాయంగా మిన్నకుండక తప్పిందికాదు. కేంద్ర ఆరోగ్య శాఖతో అసలు నిమిత్తమే లేదు. నగర నిర్మాణ అధికారి రంగంలోకి వచ్చేసరికి పుణ్యకాలం తీరిపోయింది.

సంక్షిప్తంగా చెప్పాలంటే అసలు సమస్య ఇది: దిన దినాభివృద్ధి చెందుతున్న ఢిల్లీ నగరంలో ఎన్నో ప్రాంతాలలో వైద్య సదుపాయాలులేక నానా అవస్థల పడుతుంటే, సఫ్దర్‌జంగ్ సమీపంలోని కొద్దిపాటి భూమిలో సుమారు వెయ్యి మంచాలు ఉండే రెండు ఆస్పత్రులు ఉంటాయి. వీటివల్ల రహదారికి సంబంధించిన సమస్యలు ఉత్పన్నం అవటమేకాక, పేద రోగులకు రవాణా సదుపాయాలు లేక ఇబ్బంది కలుగుతుంది కూడాను.

ఇందుకు చెప్ప గలిగే సంజాయిషీ అల్లా ఒక్కటే. రాణిగారు ఈ ఆస్పత్రిని (వైద్య సంస్థ ఆస్పత్రి) చూడాలని కుమారి కౌర్ కోరారు. సంస్థ ప్రారంభోత్సవంఅని చెప్పి ఒక కార్యక్రమాన్ని కూడా రూపొందించారు. కాని కుమారి కౌర్ దురదృష్టమేమంటే, రాణిగారితో కలిసి ఆమె తీయించుకున్న ఒక్క ఛాయాచిత్రం కూడా పత్రికలలో పడలేదు.

ఇక పులుల వేటను గూర్చి కూడా వాదోప వాదాలు జరిగాయి. కొందరు ఈ వేటను బ్రిటిష్ వారి పరిపాలనతో ముడిపెట్టారు. అంతకు పూర్వం గాని, ఆ తరువాతగాని ఇలాంటి వేటలు జరుగ లేదని కాబోలు వీరి భావం. పులుల వేటను చిత్రించిన మొగల్ వర్ణ చిత్రాలు అనేకం ఉన్నాయి. జహంగీర్ స్వీయచరిత్రలో పులుల వేటను గూర్చిన ప్రస్తావన పెక్కుచోట్ల కనిపిస్తుంది. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత, ఉత్తరప్రదేశ్ అటవీశాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ చతుర్వేది పులులను వేటాడటంలో పేరు పొందారు.

పెద్ద పులి ఏదో సాత్వికస్వభావం కల శాకాహారి అయినట్లు, దానిని వేటాడకుండా నిరోధించేందుకు నిరాహార దీక్ష కొనసాగిస్తానని ఒక పెద్ద మనిషి కబుర్లు చెప్పాడు. శాకాహారంతినే ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, గాడిదలు, ఎద్దు, మేకలు గుర్రాలు మొదలైన జంతువులన్నీ కూడా మానవునకు వెట్టి చాకిరి చేస్తున్నాయి.

స్విట్జర్లాండ్‌లో కుక్కలను మినహా, మాంసాహారంతినే మిగతా ఏ జంతువులను మానవుడు ఇలా వినియోగించుకోలేకపోయాడు. అశోకుడు అహింసా ఉద్యమాన్ని ప్రారంభించినప్పటినుంచే హిందువుల పతనావస్థ ప్రారంభమైనదేమో పరిశోధించి తెల్సుకోటం ఎంతైనా అవసరం!

* * *

జనవరి ఉత్సవాల మాసం. మహాత్మాగాంధి వర్ధంతితో ఈ మాసం సమాప్తమవుతుంది.

రివాజు ప్రకారం రాష్ట్రపతి, ప్రధాన మంత్రి గాంధిజీ సమాధిని దర్శించారు. వీరు రాట్నాలు వడుకుతుండగా తీయబడిన ఛాయాచిత్రాలు పత్రికలలో పడ్డాయి. కాని ఆ చిత్రాలలో కుమారి అమృతకౌర్‌గాని, డా. సుశీలానయ్యర్‌గాని కనిపించ లేదు.

* * *

భూటాన్ మహారాజా వచ్చే వారంలో ఇక్కడకు వస్తున్నారు. నేపాల్, భూటాన్, సిక్కిం దేశాలు భారత దేశాన్ని చైనా ప్రమాదంనుంచి నివారించే కోటల వంటివి. చైనీయుల దురాక్రమణను నిరోధించగలమని సిక్కిం మహారాజా విశ్వసిస్తున్నట్లు వార్తలు అందాయి. భూటాన్ వ్యవహారం ఇందుకు భిన్నంగా ఉన్నది. భూటాన్‌లోని సుమారు 300 చదరపుమైళ్ళ వైశాల్యంగల భూభాగం తమకు చెందుతుందని చైనీయులు వాదిస్తున్నారు. ఈ వివాదాన్నిగూర్చిగాని, లేక మరో విషయాన్ని గూర్చిగాని భూటాన్ తరపున సంప్రదింపులు జరిపే అధికారం భారతదేశానికిలేదని చైనా ఇదివరకు సూచన మాత్రంగా తెల్పినా, ఇటీవల అధికారుల స్థాయిలో జరిగిన చర్చల సందర్భంలో ఈ సూచనను ధృవపరిచింది.

భారతదేశంతో కుదుర్చుకున్న ఒక ఒప్పందాన్ని అనుసరించి భూటాన్ తన విదేశీ వ్యవహారాలలో భారతదేశం సలహాను పాటించడానికి అంగీకరించింది. ఆంతరంగికంగా ఆ దేశం స్వేచ్ఛగా వ్యవహరించవచ్చునని భారతదేశం హామీ ఇచ్చింది. ఈ విధంగా భూటాన్‌ను రక్షించే బాధ్యత భారత దేశంమీద ఉన్నా, ఆదేశం సహాయం కోరితేగాని చేయగలిగిందేమీలేదు.

భూటాన్‌లో భారతవ్యతిరేకవర్గం ఒకటి ఉన్నదని అందరికీ తెలుసు. ఈ వర్గాన్ని లోబరుచుకుని చైనీయులు భూటాన్‌లో ప్రవేశించినట్లయితే, వారిని తరిమి వేయడానికి అక్కడనుంచి ఆహ్వానం వచ్చేవరకు భారతదేశం వేచి ఉంటుందా? అన్నదే సమస్య. అంతేకాక మరొక విధంగా కూడా ప్రమాదం ఏర్పడవచ్చు. టిబెట్‌లో ప్రవేశించినట్లుగా ''భూటాన్‌కు విముక్తి'' కలిగిస్తున్నామనే నెపంతో చైనీయులు ఆదేశంలో కూడా ప్రవేశించి, భారత వ్యతిరేకవర్గంతో కూడిన నామమాత్రమైన ప్రభుత్వాన్ని ఒకటి ఏర్పాటు చేయవచ్చు. దీనివల్ల అనేక ప్రమాదాలకు ఆస్కారం కలుగుతుంది కాబట్టి, రాజ్యతంత్రజ్ఞతతోనేకాక, నిక్కచ్చిగా కూడా వ్యవహరించాలి. భారతదేశం స్వాతంత్ర్యానికే ఇది పరీక్షాసమయం. ★

---

గుమాస్తా—ఇవిగోనండి ఫైల్స్.

మానేజర్ — (చూస్తూ) ఈఫైల్ మన హెడ్ గుమాస్తాకు పంపించు...దీనిని యజమానికిపంపు...అరే,ఇదేమిటి? ఈఫైలుమీద ఉప్పు, బెల్లం, చింతపండు అని వ్రాసిఉందేం?

గుమాస్తా — క్షమించండి సార్. అది నా స్వంత ఫైల్. పొరపాటున...

మానేజర్ - అయితే దీన్ని మాఇంటావిడకు పంపు.

అచ్చుకోలకోటేశ్వరరావు నాయుడు
(గుంటూరు-8)

---



జూల్స్ వెర్న్ నవల

# ౮౦ రోజులలో భూప్రదక్షిణం

(గతసంచిక తరువాయి)

తలపెట్టింది దుస్సాహసం. ప్రమాదకరమైనది. అసాధ్యం అనిపించేదే కాదు. నిజంగా అసాధ్యమే నేమో కూడా. ఈ ఉద్యమానికి వడికడితే, ఫిలియాస్‌ఫాగ్ తన ప్రాణాలే ఒడ్డినట్టన్న మాట. ప్రాణాలు కాపోతే, ప్రాణ సమానమైన స్వేచ్ఛ. పట్టుబడితే బందీకాక తప్పదు. అలా బందీ అయితే, తరువాత తప్పించుకున్నా మానినా పుణ్యకాలం కాస్తా తీరి ఇటు ఇరవైవేల పౌండ్ల పందెం నట్టేట కలిసిపోతుంది. ఏది ఎలా పోయినా సరేనని తెగించాడు ఫాగ్. అందుకు, సర్ ఫ్రాన్సిస్ క్రోమార్టీ కూడా అండగా నిలబడడానికి ముందంజ వేశాడు.

పాస్పార్టూ అన్నిటికీ సిద్ధమే. అతన్ని వేరే అడగక్కర్లేదు. అసలు పాస్పార్టూ, యజమాని మాట విన్నప్పటినించి ఉత్సాహంతో పొంగి పోతు న్నాడు. ఫాగ్ మీద అతనికి అపేక్ష ముంచు కొచ్చేసింది. ఒక్కసారిగా. పీడు మనిషా, మర మనిషా అన్నట్టు కనిపించిన ఫాగ్‌లో, అతని అంతరాంతరాలలో నిజంగా హృదయం అనేది ఉందన్న మాట. దయా దాక్షిణ్యం సమృద్ధిగా ఉన్నాయన్న మాట. పాస్పార్టూకు, యజమాని పట్ల భక్తి గౌరవాలతో బాటు దాదాపు ప్రేమ కూడా కలిగింది.

ఇంక ఎటొచ్చి, పార్సీ అత మన్నాడు. అతనే మంటాడు, ఏం చేస్తాడు అన్నదే ప్రశ్న. ఇండియన్ కాబట్టి వాళ్లవేపే అవుతాడేమో ? కనీసం తమ పక్షంలోచేరి మద్దతు ఇవ్వక పోయినా, తటస్థంగా ఉంటే అదే పదివేలు. ముసుగులో గుద్దులాటెందుకని, సర్ ఫ్రాన్సిస్ నిష్కర్షగా ఉన్న సంగతి చెప్పి, నువ్వే మంటావని మాటిగా అడిగేశాడు.

"అయ్యా ! నేను పార్సీని. ఆ పిల్లా పార్సీవే. చెప్పేదేముంది. మీ యిష్టం. మీ రెలా చెబుతే అలా చేదాం" అన్నాడు మావటీడు.

"బేష్. అయితే సరే" అన్నాడు ఫాగ్.

"మనం దొరికితే, ప్రాణాలు పోవడం అటుంచి ముందర ఘోరమైన బాధలు పడాలి వాళ్ల చేతుల్లో. అది మాత్రం చూసుకోండి ముందే" అన్నాడు పార్సీ.

అనువాదం :

## ఎస్. పార్థసారధి

"అవన్నీ చూసుకునే దిగుతున్నాం. అయితే, మనం ప్రయత్నం ఆరంభించడానికి పొద్దుపోయే దాకా ఆగా లనుకుంటాము. కదూ ?" అన్నాడు. ఫాగ్.

"సరే. అదే మంచిదనిపిస్తుంది" అన్నాడు పార్సీ. తరవాత, సహగమనానికి బలికాబోతున్న ఆ అమ్మాయి కథను టూకీగా చెప్పాడు. ఆమె పార్సీ యువతి. బొంబాయిలో ఒక గొప్ప వర్తకుడి కూతురు. చాలా అందగత్తె. ఆ పిల్లకి అంతా ఇంగ్లీషు చదువు చెప్పించారు. వేషభాషలూ, తీరూ తెన్నూ అంతా దొరల పద్ధతే. చూసినవా రసలు దొరపిల్లే అనుకుంటారు. ఆ అమ్మాయి పేరు అయూదా.

తల్లిదండ్రులు పోయాక, అయినవాళ్లంతా కూడబలుక్కుని ఆ అమ్మాయిని బలవంతాన ఒక ముసలిరాజా కిచ్చి పెళ్లి చేశారు. అదే ఇప్పుడు పోయిన, ఈ బుందేల్‌ఖండ్ రాజన్నమాట. పెళ్లి అయి మూడు నెలలు తిరిగేసరికి అతను హరీ మన్నాడు. ఈ పిల్ల విధవ అయింది. విధవలను బతకనివ్వరు గదా. సహగమనం తప్పదు. ఆ పిల్ల భయపడి పారిపోయింది గాని వెంటనే పట్టు కున్నారు. ముసలి రాజా బంధువు లున్నారు కొందరు—ఇప్పుడు ఈవిడచేత సహగమనం చేయిస్తే వాళ్లకి వారసత్వంగా గిట్టుబా టవుతుంది. అందువల్ల ఈ ఆచారాన్ని అమలు జరిపించడానికి వాళ్లంతా ఏకమై పట్టుబట్టారు. ఇవు డీ పిల్ల ఇక తప్పించుకుందికి వీల్లేదు ....

ఈ పట్టుదలలూ, వాటి ఆంతర్యాలూ అన్నీ విన్నాక, ఫాగ్‌కూ, అతని మిత్రులకూ ఈమెను కాపాడాలన్న పట్టుదల పదలడానికి బదులు రెట్టింపయింది. దయాదాక్షిణ్యాలు ఇనుమడించాయి. ఏనుగుని మెల్లిగా ఆ కోవెల వైపు నడిపించమన్నారు. వీలైనంత దగ్గరగా వెళ్లి కాపు వేదామన్నారు వెంటనే.

నెమ్మదిగా చెట్లమాటునే ప్రయాణం సాగించి ఓ అరగంట తరువాత—గుడికి ఐదు వందల అడుగుల దూరంగా—కాస్త చిక్కగా ఉన్న పొదల చాటున ఆగింది ఫాగ్ బృందం. వాళ్లున్న చోటు నుంచి గుడి, అక్కడి జనం కనబడటంలేదు గాని, సందడి బాగా తెలుస్తోంది. గావు కేకలూ, బాకా మోతలూ హోరెత్తుతున్నాయి.

అయుదాని ఆ జనాభా నించి తప్పించి తీసుకు వచ్చే పద్ధతి ఏది, ఎప్పుడు కార్యక్రమం ఆరంభించాలీ అనే విషయాలన్నీ చర్చించారు. పార్సీకి ఆ కోవెల, అక్కడి పానుపానులూ అన్నీ బాగా తెలుసును. ఆ గుడిలోనే అయూదాను బంధించి ఉంచుతారు. జనం అంతా నిద్రపోయిన తరువాత వెళ్లి తలుపులు బద్దలుకొట్టి ఆమెను తీసుకు రావడం ఒకపద్ధతి లేదా వెనుకవేపునుంచి

వెళ్లి గోడకు కన్నంవేసి లోపల జొరబడాలి. ఇది ఇపుడుచెప్పడం కష్టం. అక్కడికి వెళ్లాక, అప్పటి పరిస్థితిని బట్టి వీలునుబట్టి ఏదో ఒకటి చెయ్యాలి. మొత్తానికి ఎప్పుడు ఏం చేసినా, చేసేదేదో రాత్రికి రాత్రి జరిగిపోవాలి. తెల్లవారితే, ఆమెను చితి దగ్గరకు తీసుకొని పోతారు. అప్పుడు దేవుడు దిగొస్తే ఏమో తప్ప, ఆమెను కాపాడడం నర మానవుడివల్ల అయేపని గాదు.

మెల్లిగా పొద్దు వాటారింది. నీడలు అడివి అంతా పరుచుకుని చిక్కబడి చీకటిగా మారుతున్నాయి. పొద్దుతోపాటే గుడి దగ్గర సద్దు మణిగింది. జనం అంతా నెమ్మదిగా భోజనాలు కానిచ్చి గంజాయి, భంగు సేవిస్తున్నారు. మత్తు ఎక్కినకొద్దీ ఒక్కొక్కరే ఎక్కడికక్కడ మేనులు వాలుస్తున్నారు. నిద్రాదేవత ఒడిలో మత్తుగా కళ్ళు మూసుకుంటున్నారు. వాళ్ళ ఆ కార్యక్రమం పొంతం బారిన పడగానే, ఫాగ్ బృందం తమ కార్యక్రమం ఆచరణలో పెట్టడానికి బయలుదేరింది. పార్సీ ముందర దారి తీశాడు. చడీ చప్పుడూ లేకుండా నలుగురూ చెట్లచాటుగా మెల్లిగా పాకుతూ నడుస్తూ పది నిమిషాలు ముందుకు పోగి ఒక చిన్న నది ఒడ్డున ఆగి చుట్టూ పరకాయించి చూచారు. కొంచెం దూరంగా, కాగడాల మసక వెల్తురులో దహన పీఠం కనబడింది. ఆ ప్రక్కగానే కర్రలు పేర్చిఉన్నాయి. చితినిండా చాలా విలువైన మంచిగంధపు చెక్కలు పరచి ఉన్నాయి. పరిమళ ద్రవ్యాలతో వాటిని, మునగా తడిపి ఉంచారు. దానిపైన రాజాగారి మృతకాయం ఉంది. ఆ శవం పక్కనే ఈ జీవాన్ని పెట్టి కాల్చివేస్తారు.

చితికి నూరడుగుల దూరంలో కోవెల ఉంది. గుడిగోపురాలు చెట్లన్నిటినీ చీల్చుకొని పైకి తన్నుకు వచ్చినట్లుగా ఉద్ధతాలై, ఉద్ధృతాలై చీకటిలో నిలబడి ఉన్నాయి. "నిద్రా" ముద్రిత లోకాన్ని మౌనంగా పరికిస్తున్నాయి.

"రండి" అన్నాడు పార్సీ మెల్లిగా.

నలుగురూ కొంతదూరం ముందుకు వెళ్లారు. చెట్లు లేకుండా తెరిపిగా ఉన్న ఒకచోట ఆగారు. కాగడాలు కునుకుతున్నాయి. వాటి వెలుగు నీడలో, మత్తెక్కిన భక్తజనం చిక్కగా పడిఉన్నారు. కొంచెం అవతలగా 'పిలాజీ' ఆలయం ఉంది. ద్వారాలూ, స్తంభాలూ అవీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ద్వారాల దగ్గర గస్తీతిరుగుతున్న పహరాకాస్తున్న రాజ భటులు కూడా స్పష్టంగా కనిపిస్తున్నారు. ఒరలోంచి దీసిన విచ్చుకత్తులు వాళ్ల చేతులలో మిలమిల మెరుస్తున్నాయి.

'రాజమార్గం' తమ ఉద్యమానికి తగదని తేలిపోయింది. ఆ విషయం ఒకరి కొకరు చెప్పుకో నక్కరలేదు. ఇపుడేం చేయాలి అని నలుగురు గుసగుసలుగా మాట్లాడుకున్నారు.

"కాస్సేపు ఆగుదాం. ఇంకా ఎనిమిది గూడా కాలేదుగదా. కొంచెంసేపు అయితే ఈ పహరా వాళ్ళు నిద్రపోవచ్చు" అన్నాడు బ్రిగేడియర్ జనరల్ సర్ ఫ్రాన్సిస్.

"అవునవును. పడుకొంటారు" అన్నాడు పార్సీ.

ఫాగ్ బృందం అక్కడే చెట్టుకింద కూలబడి, పహరావాళ్లకేసి మెళకువగా చూస్తూ కాలక్షేపం చేశారు. కాలం గబగబా పరుగెత్తలేదు. నిమిషాలు, పావుగంటలూ, అరగంటలూ జరిగాయి. రాత్రి పన్నెండు వరకూ చూశారు. పహరా వాళ్ల వాలకం చూడగా వాళ్ళు పడుకునేటట్లు తోచలేదు. వీళ్ల నిద్రని నమ్ముకు కూర్చుంటే తెల్లారిపోతుంది.

మార్గాంతరంగురించి చర్చ జరిగింది. పార్సీ కొత్త దారి తొక్కాడు. అది చాలా చుట్టు దారి. అరగంటసేపు నడిచి, పన్నెండున్నర ప్రాంతాల కోవెల వెనకవేపు గోడ దగ్గరకు చేరుకొన్నారు. ఈ వేపు కాపలా లేదు. అలాగని బద్దలు కొట్టి జొరబడడానికి ద్వారాలు లేవు. కిటికీలు గూడా లేవు. గోడ దగ్గర కూర్చొని తపస్సు చేసి లాభం లేదు. వ్యవధి చాలదు.

లోపలికి వెళ్లాలంటే ఒకటే దారి — గోడకి కన్నం వెయ్యడం. ఫాగ్ బృందంలో ఎవరి దగ్గరా అందుకు తగ్గ సాధన సంపత్తి లేదు. కరాలే తప్ప పరికరాలు లేవు. తాళాల గుత్తుల్లో ఉండే చిన్న చిన్న చాకులు మటుకు ఉన్నాయి. అవి పనికొస్తాయా ? ఏమో పనికిరావచ్చు. వీళ్ల అదృష్టం బాగుంది. ఆ కోవెల రాతితో కట్టింది కాదు. ఇటుకల గోడలూ, కర్ర దూలాలూ స్తంభాలూను. అందువల్ల చిన్న కంత పెట్టవచ్చు కష్టపడి ఒక్క ఇటుకరాయి గనక కదిపి లాగిత్తే, మిగతావి సులభంగానే వచ్చేస్తాయి.

ఫిలియాస్ ఫాగ్ 80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమే నని 20 వేల పౌండ్లు పందెం కాసి, ఆ రోజు రాత్రే తన సేవకుడు పాస్పార్టూను వెంట తీసుకొని బయలుదేరుతాడు. ఏడవరోజున సూయజ్ నుంచిడిటెక్టివ్ ఫిక్స్ బ్యాంకు దొంగ ఫాగ్ దొరికాడనీ, అతనిని అరెస్టు చేయడానికి వెంటనే బొంబాయికి ఒక వారంటు పంపమనీ లండన్‌కు టెలిగ్రాం ఇస్తాడు. ఫాగ్ బొంబాయి చేరుకుంటాడు. వెంటవచ్చిన ఫిక్స్ పోలీసు కమీషనర్ కార్యాలయానికి వెళ్ళి వారెంటు వచ్చిందేమో విచారిస్తాడు. రాలేదని అక్కడివారు చెప్పారు. ఆరాత్రే ఫాగ్ బొంబాయి నుంచి కలకత్తాకు రైలులో ప్రయాణమవుతాడు.

రైలు కోల్భాల్ వద్ద ఆగి పోతుంది. అక్కడ నుంచి గత్యంతరం లేక ఫాగ్ రెండువేల పౌనులకు ఒక ఏనుగు కొని అలహాబాదుకు బయలుదేరుతాడు. దారిలో ఒక ఊరేగింపు ఎదురు అవుతుంది. భర్తతో సహగమనానికి పోతూ ఉన్న స్త్రీ కనుపిస్తుంది.

నలుగురూ అందుకు ఉపక్రమించారు. అట్టే గొడవ కాకుండా, నెమ్మదిగా బెజ్జాలు పొడిచింది రెండడుగుల కన్నం వెయ్యడానికి తవ్వసాగారు పార్సీ, పాస్పార్టూ కలసి. పని బాగా సాగుతోంది. ఇదేదో 'దారి' చూపే దారిలాగే ఉంది. కాని అంతలో దురదృష్టం ఇటుతిరిగి ఒక చూపు చూసింది. ఉపద్రవం వచ్చిపడింది — పహరావాళ్ళు కొందరు హఠాత్తుగా గుడి వెనకవేపుకు వచ్చి అక్కడ తిష్ఠ వేసుకు కూర్చున్నారు.

ఫాగ్ బృందానికి ప్రాణం ఉసూరుమంది. పని ఆపేశారు. కర్తవ్యం తోచలేదు.

"ఇంక మనం వెనుదిరిగి పోక తప్పదులా ఉంది" అన్నాడు జనరల్ సర్ ఫ్రాన్సిస్.

"అదొక్కటే మార్గం" అన్నాడు పార్సీ.

"ఆగండి" అన్నాడు ఫాగ్ హఠాత్తుగా. ఒక్క క్షణం ఆగి, "నేను అలహాబాద్‌కు రేపు మధ్యాహ్నం పన్నెండు లోపుగా చేరినా ఫరవాలేదు" అన్నాడు.

"ఏం లాభం. ఇంకా ఆశేముంది. ఇంకాస్సేపటిలో తెల్లవారిపోతుందిగదా" అన్నాడు సర్ ఫ్రాన్సిస్ నిరాశగా.

"ఏమో ఇప్పుడు తప్పిపోయిన అవకాశం చివరి క్షణంలో తిరిగిదొరకకూడదా" అన్నాడుఫిలియాస్‌ఫాగ్.

ఆ క్షణంలో ఫిలియాస్ ఫాగ్ ముఖాన్ని, అతని కళ్లనూ ఒక్కసారి చూడా లనిపించింది సర్ ఫ్రాన్సిస్‌కు. ఏ ధీమా, ఏ ఆత్మ విశ్వాసం ఏ మొండి ధైర్యం అతని కళ్లలో మెరుస్తున్నాయో చూడా లని తహతహ లాడింది సర్ ఫ్రాన్సిస్ మనస్సు.

చివరిక్షణంలో ఏం చేదామని, ఏం చేయగలనని ఇతని ధీమాహో ? వాళ్ళు ఆ పిల్లని చితి ఎక్కిస్తూ ఉండగా, ఇతగాడు తెగించి వాళ్ల మధ్యకి ఉరికి, వాళ్లతో పోట్లాడి ఆమెను విడిపించుకు వద్దా మనుకుంటున్నాడా ?

అంతకన్న తెలివితక్కువతనం మరోటి ఉండదు. ఎవడూ అలాటి పిచ్చిపని చెయ్యడు. ఫాగ్ లాటివాడు అసలు చెయ్యడు. మరి ఏం చెయ్యా లనుకుంటున్నట్టు ?

ఆగి చూదా మనుకున్నాడు సర్ ఫ్రాన్సిస్. ఈ భీకర సన్నివేశం ఎలా పర్యవసిస్తుందో — ఈ కథ ఎలా ముగుస్తుందో చూచితీరా లనిపించింది. అయితే యిది మరీ ఇంత దగ్గరనించే చూడాలని లేదు ఇక్కడే కూర్చోడం మంచిది కాదు. అందుకని పార్సీ, వాళ్ళని వ దారినే తీసుకుని వెళ్లి ఇందాక బయలుదేరిన చోటుకు చేర్చాడు. అక్కడ చెట్ల చాటున దాగి కూర్చున్నారు. నిద్రపోతున్నవాళ్ళు యధాప్రకారం ఆ కార్యక్రమం సాగిస్తున్నారు. పహరావాళ్ళు తమ పనిని తాము చేస్తున్నారు.

పాస్పార్టూ, ఒక చెట్టు దిగువ కొమ్మమీద కుదురుగా కూర్చున్నాడు. అతని మనసు మాత్రం కుదురుగా లేదు. హఠాత్తుగా ఒక ఆలోచన మెరిసింది. ఒక ఉపాయం లాంటిది తట్టింది.

(62-వ పేజీ చూడండి)

# అంతేనా?

'హావిస్'



నలుగురితోనూ నలుగుతూన్న వ్యక్తి తనను గురించిన రహస్యాలు వారితో పంచుకోకపోతే ఆ నలుగురికీ కోపం రావడం సహజం. అతనికి తాము చేసిన సహాయాల్ని గుర్తుకు తెచ్చి తద్వారా తమ హక్కుల్ని ప్రకటించేవారు కొందరు. "నన్ను ముట్టుకోకు నా మాల కాకి" అని ఉండదల్చుకుంటే ఏ అడవులకో పోయి ఉండక పోయాడా అనే వారు కొందరు. ఏ మయినా పోటీవాడి రహస్యాల్ని అలాగే ఉంచగల జనం ఈ సమాజంలో చాలా అరుదు.

అందులోనూ ఆ వ్యక్తి సారథిలాంటివా డయితే మరీని.

విజయసారథి ఆ కాలేజీకి రెండేళ్ల క్రితం వచ్చాడు. డిగ్రీ కోర్సులో చేరాడు. మొదట కొంత కాలం అతని ఉనికిని గురించి ఎవరూ పట్టించుకో లేదు. నలుగురితోపాటు అతనూ ఉండేవాడు. చదువులో గాని, ఆట పాటలలోగాని అతనికి ప్రముఖపాత్ర ఏమీ లేదు.

కాని రెండవ సంవత్సరం వచ్చేసరికి అతనిలో ఆశ్చర్యకరమైన మార్పు వచ్చింది. కాలేజీ విద్యార్థి సంఘానికి అతను సెక్రటరీ అయ్యాడు. ఆ ఏడే వచ్చిన కళాశాల రజతోత్సవాన్ని నలుగురూ సెభాష్ అనేలా నిర్వహించాడు. కార్యశూరతకు, దీక్షకు విజయసారథి వనిపించుకున్నాడు.

మనిషైపుట్టాక ప్రతివారికీ కొన్ని నియమాలు కట్టుబాట్లు ఉంటాయి. ఉండాలి. వాటిని తప్పి అధోగతికి పోతూ ఉంటే—ఆ వ్యక్తి కన్న తండ్రే కావచ్చు—వారించడం, దారికి రాకపోతే ఎదిరించడం తోడివారికీ, అందులోనూ కుమారునికి విధ్యుక్త ధర్మమే కాదా?

ఆలాంటి జ్ఞానం ఉన్న వ్యక్తి అత్యంత గౌరవనీయుడు.

అయితే ఏం? బరితెగించి బట్టలు కుట్టుకుని బతుకుతున్నవాడు. అతని కులమేమిటో గోత్రమేమిటో తెలియదు. అలాంటి వాడితో కూతురు స్వేచ్ఛగా తిరుగుతూ ఉండంటే శాస్త్రి ఎలా సహించగలడు?

కాదంటే మాలతి సహించగలదా? ఒకసారి దెబ్బ తిని ఉన్న సారథి తట్టుకోగలడా?

ఇంతకూ ఈ సారథి ఎవరు?

ఆ సమయంలోనే మాలతితో స్నేహం సంపాదించుకున్నాడు. ఆమెకు అప్తుడయ్యాడు.

అయితే తమాషా ఏమిటంటే అతన్ని గురించి అంతకు మించి మరొక్క మాట కూడా తెలియకపోవటం. అతని నివాసం కూడా ఎక్కడో ఎవరికీ తెలియదంటే అతను ఎంత గుట్టుగా ఉండేవాడో గ్రహించుకోవచ్చు.

అతని జీవిత విశేషాలు సేకరించవలసిన అవసరం పాటి విద్యార్థులలో చాలా మందికి లేక పోవొచ్చు. కాని రాఘవరావుకు ఆ అవసరం కన బడింది. అతను (సారథి) మాలతికి సన్నిహితుడవటమూ, ఆ అమ్మాయి తనకు వరసయిన దూరపు చుట్టం అవడమూ (అన్నింటికీ మించి మాలతి బంగారపు బొమ్మ అవటమూ) అందుకు హేతుభూతా లయినాయి. ఈ సారథి పూర్తిజీవితాన్ని తెలుసుకుంటే, అందులోని గర్హనీయమైన (?) అంశాలను మాలతి తండ్రి చెవిన వేస్తే వారి స్నేహం అంతరిస్తుంది. ఆలోచనకన్నా ఆవేశం ఎక్కువయిన మాలతి తండ్రి ఆమెను చదువు మానిపించి తనకిచ్చి .......

అయితే రాఘవరావు చాలామందిలా పొచుకోలు 'విలన్' కాదు. అందుచేత అతను తన ఉద్యమం పబ్లిక్ పరీక్షలు అయిపోయిందాకా అమలు చెయ్యలేదు. ఆ మరునాడు హుటాహుటి కాలేజి ఆఫీసుకు వెళ్ళాడు. అక్కడ తనకున్న పలుకుబడి ఉపయోగించి సారథి వివరాలు కొన్ని సేకరించాడు.

సారథి తండ్రి రాజశేఖరరావు. అతను (సారథి) ఇంటర్ మీడియెట్ విశాఖపట్నంలో చదివాడు. ప్రస్తుతం (అంటే కాలేజీలో చేరిననాటికి) వయస్సు ఇరవై సంవత్సరాలు. ఇంటర్‌లో బ్రహ్మాండమయిన మార్కులు వచ్చాయి. తండ్రి బతికే ఉన్నాడు; భూస్వామి.

రాఘవరావు నుదుట పట్టిన చెమట తుడుచుకున్నాడు. అతనిలో కొత్త సందేహాలు కలిగినాయి. విశాఖపట్నంలో ఇంటర్ చదివినవాడు ఇంత దూరం వచ్చి బీకాం చదవడం ఎందుకు? అక్కడ లేదా? పైగా భూస్వామికొడుకయినవాడు, అంతబాగా మార్కులు తెచ్చుకున్నవాడు, ఆనర్సులో జేరలేకపోయినాడా? అదీగాక పద్దెనిమిదేళ్లకే ఇంటర్ పాసయినవాడు ఇరవయ్యో ఏట యిక్కడ జేరడ మేమిటి? ఈమధ్య రెండేళ్ళు ఏం చేశాడు?

కాబట్టి ఇందులో ఏదో ఉంది.

అదేమిటో మాలతికి తెలుసు ననేందుకు దాఖలా లేమీ లేవు. కనుక అతని విషయాలు తెలిసినవారు తన అధ్యాపకులు అయివుండవచ్చు. వారిలో భానుప్రకాశరావుగారు తనకు 'గురువు' గారు. రహస్యాల్ని రహస్యంగా తనతో చెప్పగలవాడు ఆయ నొక్కడే.

రాఘవరావు మరింక ఆలోచించలేదు. వెంటనే భానుప్రకాశరావుగారి దగ్గరకు పోయి తన సందేహాలు వెలిబుచ్చాడు.

ఆయన పూర్తి వివరాలు చెప్పాడు.

అవి వింటూంటే రాఘవరావులో కలిగిన భావాల్ని స్పష్టంగా వివరించటం కష్టం. అతనికి ఆనందం కలిగింది. ఆశ్చర్యం కలిగింది. కొంత విచారమూ, మరికొంతకోపమూ కలిగినాయి.

ఈ వివరాలన్నీ మాలతి తండ్రికి తెలిస్తే, ఆమెకూ, సారథికీ ఇకమీద స్నేహం ఉండదు. గనుక తాను ఇప్పుడే వెళ్లి ఆ విషయాలన్నీ ఆయనతో చెప్పాలి.

రాఘవరావు గడియారం చూసుకున్నాడు. సాయంత్రం అయిదు కావస్తోంది. శాస్త్రిగారు ఇంకో గంట వరకూ ఇంట్లోనే వుంటాడు.

రాఘవరావు వాళ్లింటికి జేరుకున్నాడు. అతను అనుకున్నట్లుగానే శాస్త్రిగారు ఇంట్లోనే ఉన్నాడు. అతన్ని చూడంగానే "ఏరోయ్ ప్రెసిడెంటూ దారి తప్పి వచ్చావ్ ?" అన్నాడు.

"వెదుక్కుంటూనే వచ్చాను మామయ్యా. మాలతి ఇంట్లో లేదా ?" అన్నాడు రాఘవరావు.

"బయటికి వెళ్లినట్లుంది. ఏం మళ్లీ ఏదన్నా ఉత్సవమా ?" అన్నాడు శాస్త్రిగారు.

"వూరికేనే అడిగాను" అన్నాడు రాఘవరావు.

"పరీక్షలు బాగా రాశావా ?"

"ఆ."

"నాన్న ఏమంటున్నాడు ? యూనివర్సిటీకి పంపుతాడటనా ?"

"ఏమో మరి" అన్నాడు రాఘవరావు.

తాను చెప్పదల్చుకున్న విషయం ఎలా కదపాలో అర్థం కావటం లేదతనికి. శాస్త్రిగారు దుర్వాసుడు. తన మాటలో ఏమాత్రం తొట్రుపాటు వచ్చినా తనను నిర్దాక్షిణ్యంగా చెరిగేస్తాడు. పైగా ఆయనకు కూతురంటే వల్లమాలిన ఆపేక్ష, నమ్మకమూ. అందువల్ల ఆరంభం సరిగ్గా లేకపోతే .....

ముందే ఆలోచించుకురావలసింది అని తనమీద తానే విసుక్కున్నాడు రాఘవరావు.

"ఏమిట్రా ఆలోచిస్తున్నావ్ ?" అన్నాడు శాస్త్రిగారు.

"సారథి తెలుసా మావయ్యా ?" అన్నాడు రాఘవరావు అదిరిపడి.

"తెలీకేం ? నిన్ననో మొన్ననో మన ఇంటికి వచ్చాడు కూడా .... కుర్రాడు చాలా యోగ్యుడు."

రాఘవరావుకి చురుక్కుమంది. "తండ్రిని ఎదిరించి ఇల్లు విడిచి రావటం, గతిలేక ఎవరి పంచనో బట్టలు కుట్టుకుని బతకటం యోగ్యతకు లక్షణా లంటావా మామయ్యా ? అతని తండ్రి పెద్ద తీర్థులస్వామిట. ఆయనకు లేని వ్యసనం లేదుట. తెలుసా ?" అన్నా డతను ఆవేశంగా.

శాస్త్రిగారు నిర్ఘాంతపోయాడు. కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్న లక్ష్మీనారాయణగారు ఆయన మేనత్తకొడుకు. అతడు సారథిని గురించి ఎంతో ఇదిగా చెప్పేవాడు. అతని మాటల్నిబట్టి సారథితో మాలతి స్నేహంగా ఉంటోందని తెలిసినా అభ్యంతరపెట్టలేదు. ఇలాంటివాడని తెలిస్తే అది సాగనిచ్చేవాడు కాదు. ఈ ముళ్లకంప తన కెందుకు ?

"అతని గుణాలు కూడా ఏమంత మంచివి కావు మామయ్యా. పెద్దవాడివి. అర్థం చేసుకో" అన్నాడు రాఘవరావు చివరి మాటగా.

"నేను కనుక్కుంటానులే రాఘవా ! నువ్వెళ్లు" అన్నాడు శాస్త్రిగారు పాలిపోయిన మొహంతో.

రాఘవరావు సంతృప్తిగా లేచి ఇవతలి కొచ్చాడు.

* * *

వ ంయగాన రాఘవరావు నోటి వెంట శాస్త్రిగారు విన్న విషయాలను మాలతి సారధి నోటి వెంట విన్నది—కృష్ణాతీరాన ఇసుకలో కూర్చొని.

సంధ్య చల్లగా వస్తున్నది. సూర్యుడి తీక్షణతకు వేడెక్కిన ధరిత్రి ఆసాగలు వెళ్లగక్కుతూ తనను క్షాళితం చేసుకొంటోంది. ఆ తరువాత ఆమె హృదయం తేలికవుతుంది. నిశిలో విశ్రాంతి తీసుకుని తిరిగి మరునాడు నిద్ర లేస్తుంది.

ఆ ధరిత్రి భరిస్తున్న మానవులూ అంతేనేమో?

తన జీవితాన్ని విప్పి చెప్పుకునేందుకు నేస్తాలు సారధికి ఉన్నారు. ఆ నేస్తాలే తనకు ఇంతవరకూ సహాయం చేశారు. అయితేనేం ? మాలతితో చెబుతూంటే హృదయం తేలికయినట్టయి పిచ్చి ఆనందం కలుగుతోంది. ఆర్ద్రత నయనాల్ని కమ్ముకుంటోంది.

"ఇందులో నా తప్పేమయినా ఉందంటావా మాలతీ ?" అన్నా డతను చివరికి.

చెమ్మగిలిన కళ్లను చెంగుతో ఒత్తుకుంది మాలతి. ఏం సమాధానం యిస్తుంది తాను ? బాధ్యత లనేవి మనిషికి ముఖ్యమే. కాని ఆ పేరుతో తనవారి సర్వ నాశనాన్ని సహించి వూరుకోవటం గర్హనీయంకాదా ? మనిషయి పుట్టాక ప్రతివారికీ కొన్ని నియమాలు, కట్టుబాట్లు ఉంటాయి. ఉండాలి. అవి తప్పి అధోగతికి పోతూంటే — ఆ వ్యక్తి కన్నతండ్రే కావచ్చు — వారించటం, దారికి రాకపోతే ఎదిరించటం తోడివారికి — అందులోనూ కుమారుడికి — విధ్యుక్త ధర్మమే కదా ?

అంతటి స్పృహ ఉన్న వ్యక్తి అత్యంత గౌరవ పాత్రుడు. శ్లాఘనీయుడు.

"ఇంక ఏం చేద్దా మనుకుంటున్నారు ?" అన్న దామె.

"ఏం చేసే దేముంది ? పాసయితే ఏదయినా ఉద్యోగం చూసుకుంటాను. ఈలోగా వీలయితే మానేసిన సంగీతసాధన మళ్లీ మొదలుపెడదా మనుకుంటున్నాను."

"మీ రిదివరకు నేర్చుకున్నారా ?"

"ఒక ఏడాది పాటు సాధన చేశాను. వెంకటరమణమూర్తిగారే ఉచితంగా చెప్పారు."

"మరి — కనీసం మన కాలేజీ రజతోత్సవం నాడన్నా పాడలేదేం ?" అన్నది మాలతి.

సారధి చిన్నగా నవ్వాడు.

"స్టేజిఫియరా ?"

"అలాంటిదే ! మిడిమిడి జ్ఞానంతో పాడితే శాస్త్రానికి శ్రోతలకు కూడా ద్రోహం చేసినట్లవుతుందని నా భయం !"

"అయితే ఈ నేపథ్యగాయకులంతా సంగీత విధు లయినాకనే పాడుతున్నా రంటారా ?"

"ఎవరి అభిప్రాయాలు వారి కుంటాయి. అదీగాక సినీమాలో నేపథ్యగాయకుడు చేసేది కేవలం సంగీత దర్శకుడి బాణీని అనుకరించటమే. ఆ పని శ్రావ్యమయిన కంఠం ఉన్న ప్రతివారూ చేయవచ్చు"

"మీరూ ఎవరిచేత నయినా బాణీలు కట్టించుకు పాడవచ్చునుగా ?"

"అంత తీరిక ఉంటే మధ్యలో సాధన మానేద్దునా ?"

మాలతి గుండెల్లో కలుక్కుమంది. అతని పట్టుదల ఎంత చేస్తున్నది ?

"ఇంతకూ మీ సావిత్రిని ఎప్పుడు పరిచయం చేస్తారు ?" అన్న దామె సంభాషణ మారుస్తూ.

"నీ ఇష్టం !"

"ఇప్పుడు వెళ్దామా ?"

"అభ్యంతరం లేదు."

"పదండయితే."

ఇద్దరూ లేచి ఒడ్డెక్కి రోడ్డుమీది కొచ్చారు. జట్కా మాట్లాడుకుని అతని ఇంటికి బయల్దేరారు.

"ఒక్క మాటియ్యాలి" అన్నాడు సారధి దోవలో.

"చెప్పండి" అన్నది మాలతి నవ్వుతూ.

"సావిత్రి గడుగ్గాయి. దాని మాట లేమీ పట్టించుకో కూడదు."

"అలాగే."

జట్కా ఆగింది. మాలతి ముందు దిగింది. చుట్టూరా అన్నీ చిన్న పెంకుటిళ్ళు కనపడ్డాయి అక్కడ. జట్కా ఆగిన ప్రదేశానికి ఎదురుగా రోడ్డుకు పది గజాల దూరంలో చుట్టూ రకరకాల మొక్కలతో చిన్ని తోటా, ఆ మధ్యలో పరిశుభ్రంగా, ప్రశాంతంగా కనపడుతున్న కుటీరమూ ఉన్నాయి.

"పద మాలతీ" అన్నాడు సారధి అటు దారి తీస్తూ.

మాలతి మౌనంగా ఆ ఇంటిని పరికిస్తూ అతని వెనకాలే వెళ్లింది. కర్రలతో తయారయిన గేటును దాటి ఇంట్లోకి ప్రవేశించారు ఇద్దరూ.

"కూర్చో ఇప్పుడే వస్తాను" అన్నాడు సారధి చాపవేసి లోపలికి వెళ్లుతూ. మాలతి చుట్టూ పరిశీలిస్తూ కూర్చుంది.

ఆ ఇంటిలో మొత్తం నాలుగు భాగాలున్నాయి. ఎడమవైపున భాగం తాళం వేసి ఉంది. గుమ్మాని కున్న తోరణాలూ అవీ బట్టి అందులో పూజలూ అవీ జరుగుతా యనుకుంది మాలతి. దాన్ని ఆనుకుని మరో గది ఉంది. అందులో దీపం వెలుగుతోంది. అది బహుశా వంటగది కావచ్చు. కుడిప్రక్క వసారాలాంటిదేదో వుంది. తాను కూర్చున్న గదిలో రెండు కాంపు కాట్లూ, శుభ్రమయిన గుడ్డ పరచివున్న ఒక బల్లా, దాని ముందు ఒక కుర్చీ ఉన్నాయి. గోడలకు నాలు గయిదు కాలెండ ర్లున్నాయి. గోడలన్నీ మట్టిగోడలు. అయినా శుభ్రంగా ఉన్నాయి.

"ఆశ్రమం —" గొణుక్కుంది మాలతి.

అరక్షణం తరువాత 'వంటిల్లు' లోంచి గెంతుకుంటూ ఏడెనిమిదేళ్ళ పిల్ల బయటికొచ్చింది. మాలతిని చూసి ఆగి ఆమె వంక తీక్షణంగా చూడటం మొదలుపెట్టింది.

మాలతి నవ్వి "ఇలారా !" అన్నది.

ఆ అమ్మాయి చాప చివర కూచుని దృష్టి మరల్చకుండా "నీ పేరు మాలతా ?" అన్నది.

"వూ ! ఏం ?" అన్నది మాలతి.

# అంతేనా ?

"మామయ్య క్లాసా ?"

మాలతికి నవ్వు వచ్చింది. "కాదు అంతకన్నా ఓ క్లాసు తక్కువ" అన్నది.

"నేను అయిదో క్లాసు" అన్నది కబడ్దార్ అన్నట్లు ఆ అమ్మాయి.

మాలతి మనస్సులో ఇందాకటినించీ ఉన్న అనుమానాన్ని తీర్చుకోదలిచి "మీ అక్కయ్య ఇంట్లో లేదా ?"

"మా అక్కయ్యెవరు ?" అన్నదా అమ్మాయి భ్రుకుటి ముడిచి.

"సావిత్రి."

"నేనే సావిత్రిని" అన్న దా అమ్మాయి కుండ బద్దలు కొట్టినట్లు.

అప్రయత్నంగా, హఠాత్తుగా మాలతి మొహంలో వెలుగు ద్యోతకమయింది. సావిత్రి అంటే ఈ ఏడేళ్ల పిల్లా ?

సారధి తిరిగి వచ్చాడు. సావిత్రిని చూసి "అమ్మ పిలుస్తోంది వెళ్లవే" అన్నాడు.

ఆ అమ్మాయి మాలతి వంక చూసి "అత్తయ్య ఉత్త తెలివితక్కువది" అంటూ లోపలికి పరుగెత్తింది.

సారధి మాలతి మొహమొహాలు చూసుకున్నారు. 'అత్తయ్య' అన్న మాట ఇద్దరిలోనూ రివ్వు రివ్వు మని రొద చెయ్యసాగింది. అనిర్వచనీయమైన మధురానుభూతి — ఉక్కిరిబిక్కిరి చేసే ఇబ్బందితనం తనువుల్నీ, మనసుల్నీ సుడిగాలిలా వ్యాపసాగాయి.

సారధే ముందు మాట్లాడాడు. "ఉత్త గడుగ్గాయి పిల్ల" అన్నాడు వెలిసిపోయిన నవ్వు నవ్వుతూ. మాలతి కూడా నవ్వు తెప్పించుకుంది.

మరుక్షణాన ఆర్ద్రతతో బరువెక్కిన వారి హృదయాలు ఫక్కున నవ్వాయి. కళ్ళ నీళ్లు తిరిగాయి. "అంతా నవ్వెయ్యకండి. దాచుకోండి కాస్త" అంటూ సావిత్రి వచ్చింది. "ఏడిశావులే అల్లరిపిల్లా !" అంటూ సారధి ఆమె చేతిలోని పాల గ్లాసులు అందుకుని మాలతి కొకటి ఇచ్చాడు.

ఇద్దరూ పాలు తాగుతూంటే చూస్తూ కూర్చుంది సావిత్రి. సారధి గ్లాసు క్రింద పెడుతూ "ఏమిటే బుల్ టెరియర్ ?" అన్నాడు ఆ అమ్మాయిని చూసి నవ్వుతూ.

"నువ్వున్నావులే మహ బాగా" అన్నది ఆ అమ్మాయి.

మాలతి కూడా పాలు తాగెయ్యటంతో "లోపల పెట్టిరా కడిగి" అని రెండు గ్లాసులూ యిచ్చాడు సావిత్రికి సారధి. ఆమె అవి తీసుకుని వెళ్లిపోయాక "ఎలాఉంది మా ఇల్లు ?" అన్నాడు.

మాలతి చిన్నగా నవ్వుతూ "బాగానే ఉంది" అన్నది.

సారధి ఏదో అనబోతుండగా సావిత్రి తిరిగొచ్చి "అమ్మ నిన్నెందుకో రమ్మంటోంది" అన్నది.

సారధి లేచి లోపలికి వెళ్లాడు.

"మామయ్య వేసిన బొమ్మలు చూశావా ?" అన్నది సావిత్రి సారథి వెళ్ళాక.

"మీ మామయ్య బొమ్మలు కూడా వేస్తారా"? అన్నది మాలతి సగం ఆశ్చర్యం సగం నవ్వుతో.

"బ్రహ్మాండంగా వేస్తాడు" అని లేచి డ్రాయర్లోంచి ఒక కట్ట డ్రాయింగ్ పేపర్లు తీసింది సావిత్రి. "చూడు" అన్న దవి ఆమె ముందు పడ పడేస్తూ.

మాలతి ఒక్కొక్కటి తీసి చూడసాగింది. అందులో ఎక్కువ భాగం ప్రకృతిచిత్రాలు. ఒకటో, రెండో పల్లె పడుచుల బొమ్మలున్నాయి. చిట్టచివరి బొమ్మను చూడగానే ఆమెకు షాక్ తగిలినట్లయింది.

అందులో ఒక పద్దెనిమిదేళ్ల అందమయిన అమ్మాయి నదీతీరాన కూర్చొని దూరాన మబ్బుల వైపు చూస్తోంది. కోలమొహమూ చారెడేసి కళ్ళూ వెనుక పాములా మెలికలు తిరిగిన నల్లటి వేణీభరమూ అన్నీ కొట్టవచ్చినట్టు కనపడ్డాయి.

అన్నీ తన ....

సందేహంలేదు. అది తన బొమ్మే.

"అయితే ఆ కాలేజీ అమ్మాయి నువ్వేనన్న మాట ?" అన్నది సావిత్రి.

మాలతి ఉలిక్కిపడి కాయితాలు అన్నీ కట్టేసి "లోపల పెట్టు" అన్నది కంగారుగా.

సావిత్రి పగలబడి నవ్వసాగింది. ఆపిల్లకు మాలతి తరహా 'ఎంజాయబుల్' గా కనపడింది. ఇంత పిరికిదేం ? అన్నట్టుగా చూసింది ఆమె వైపు.

సారథి తిరిగి బయటకు వచ్చాడు. "ఏవిటే ఆ నవ్వులు పిచ్చిదానిలా ? అమ్మ పిలుస్తోంది లోపలికి పో" అన్నాడు సావిత్రిని చూసి.

ఆ పిల్ల నవ్వుతూనే లోపలికి పోయింది.

"ఏవిటి నవ్వుతోంది ?" అన్నాడు సారథి.

ఏం చెబుతుంది ?

పళ్లెం చేత్తో పట్టుకుని సావిత్రి, ఒక నడి వయస్సు స్త్రీతో అక్కడికి తిరిగి వచ్చింది. ఆ పళ్లెంలో ఒక రవికెల గుడ్డా, అరటిపళ్ళూ పసుపూ కుంకం పొట్లాలూ వున్నాయి.

"బొట్టు పెట్టి అవి ఇయ్యమ్మా" అన్న దామె సావిత్రితో.

"ఎందుకండీ ఇవన్నీ" అన్నది మాలతి.

"అయినింటి ఆడపడుచువు. ఆదరించడం మా ధర్మం. తీసుకో" అన్నదామె ఆప్యాయంగా.

సావిత్రి బొట్టు పెట్టి పళ్లెం చేతి కిచ్చింది. "పళ్లెం మాకే" అన్నది పకపకమంటూ.

"అల్లరిపిల్లా !" అన్నాడు సారథి కుహనా కోపంతో.

"అన్నదమ్ములూ అప్పచెల్లెళ్ళూ ఉన్నారామ్మా?' అన్నది పెద్దావిడ.

"మా శారదక్కయ్యకు ఫ్యామిలీ ప్లానింగు ఇష్టంలేదు మాలతీ! పదిమంది పిల్లలు లేని ఇల్లూ ఇల్లేనా అంటుంది" అన్నాడు సారథి నవ్వుతూ.

"అవునమ్మా. చేసుకోగల ఓపికా, స్తోమతూ ఉంటే పిల్లలుండటంకన్నా ఆనందం ఏముంది ?" అన్నది శారదాంబ.

"ఒక్క అన్నయ్య ఉన్నాడు. కాకినాడలో ఇంజనీరింగు చదువుతున్నాడు" అన్నది మాలతి.

"పెళ్లయిందా ?"

"ఇంకా లేదు."

"నీ పెళ్లి అయినాక చేస్తారేమోలే !" అన్నది శారదాంబ.

మాలతి సిగ్గుతో తల వంచుకుంది.

కొన్ని క్షణాల మౌనం తరువాత "చీకటి పడుతున్నది. వెళ్లొస్తానండి" అన్నది మాలతి.

శారదాంబ మళ్లీ రమ్మని చెబుతూ వాకిలి దాకా వచ్చింది. సావిత్రి మాత్రం "ఎవరికోసం వస్తుందిలే" అన్నది. ఆమె నెత్తిమీద చిన్న దెబ్బ వేసి రవికల గుడ్డా, పసుపు, కుంకం కట్టిన పొట్లమూ, అరటిపళ్ళూ పట్టుకుని మాలతితో రోడ్డుమీదికి వచ్చాడు సారథి.

శారదాంబ ఉంటానని చెప్పి సావిత్రితో లోపలికి వెళ్లిపోయింది.

చీకటి దాదాపు మూసుకుంది. రోడ్డుమీద జన సంచారం పల్చబడుతోంది. వెన్నెలా పూల పరిమళమూ మందమందంగా ప్రసరిస్తున్నాయి.

రిక్షా పిలిచాడు సారథి.

"రేపు మా ఇంటి కోసారి వస్తారా ?" అన్నది మాలతి నేలవంక చూసి కాలి బొటనవ్రేలితో స్లిప్పర్సు రాస్తూ.

"బదులు తీరుద్దామనా ?" అన్నాడు సారథి నవ్వుతూ.

"వూరికేనే."

"వీలుండదేమో ! లక్ష్మీనారాయణగా రెందుకో రేపు రమ్మన్నారు. ఆ పని లేకపోతే వస్తాను" అన్నాడు సారథి.

మాలతి రిక్షా కదిలింది. జరిగిందంతా ఆమెకు మనోహరంగా గుర్తు రాసాగింది. సందేహాలన్నీ తీరిపోయాయి. నాన్న తన మాట కాదనరు. కాని చెప్పగలగాలి. అంతే !

రిక్షా మలుపు తిరిగాక సారథి ఇంటివేపు మరలాడు. అనుబంధాలు ఎంత చిత్రంగా ఏర్పడతాయి ? ఈ వూరు రాకముందు శారదాంబ ఎవరో తనకు తెలీదు. ఆమె తనకు అక్కగారయింది. తన సాధనలో మార్గదర్శి అయింది. మాతృప్రేమను చూపించింది.

ఇప్పుడు మాలతి.....

అతనికి నిట్టూర్పు వచ్చింది. తగని ఆశలు దుఃఖహేతువులు. ఆమెతో తనకు కలిగిన స్నేహమే చాలు. అంతకన్నా ఎక్కువ కోరితే ఈ మధురిమ అంధకారంగా, ఆవేదనగా మారిపోవచ్చు.

అది తాను భరించలేడు.

* * *

గడియారం ఎనిమిది కొడుతూండగా "ఎక్కడికి పోయిందో ఏమన్నా తెలుసుటే ?" అన్నాడు శాస్త్రిగారు నాలుగోసారి వంటింట్లో ఉన్న భార్య నుద్దేశించి.

"తెలీదండీ" అన్న దామె సగం విసుగుగా.

కుర్చీలోంచి లేచి వరండాలోకి వచ్చా డాయన. సాయంకాలమే రాఘవరావు చెప్పిపోయిన విషయాలు ఆయనలో క్షణక్షణానికీ తిరగతోడ బడు

# అంతేనా?

తున్నాయి. చదువుకుంటుందనీ సరదాలు తీరుతాయనీ (ఎవరివి ?) కాలేజీలో జేర్పించాడు తాను కూతుర్ని. కాని పరిణామం ఇలాగ తయారయి గుండెలు మండుతా యనుకోలేదు. మొగపిల్లలతో మాట్లాడడం అనర్థం కాకపోవచ్చు. కాని వయసొచ్చిన పిల్ల ఇలా షికార్లు చేస్తూంటే తన పరువూ ప్రతిష్ఠ ఏంకాను ?

అస లింతకీ తప్పు తనదే నేమో ?

వయస్సే మనిషిలో అన్ని మార్పులూ తీసుకొస్తుంది. మాలతి యౌవనంలో అడుగు బెడుతోంది. లోకం మహాసౌందర్యవంతంగా ఆకర్షకంగా కనబడే వయస్సది. పూర్వపు మనుషుల సంగతేమో గాని — నైతికస్థాయీ మానసిక శారీరక స్థాయీ దిగజారిపోయిన ఈ రోజుల్లో చెల్లించటం అసాధ్యమూ, అబ్బురమూ కాదు. సారధితో ఆమె స్నేహం ముదిరితే ....

శాస్త్రిగారు ఆలోచనల్లోనుంచి బయటపడి వీధి గుమ్మంవేపు చూశాడు. మాలతి రిక్షా దిగి వస్తోంది.

"ఇంతసేపూ ఎక్కడున్నావే ?" అన్నా డాయన ఆమె చేతిలో పొట్లాన్ని గమనిస్తూ.

"విజయసారధిగా రింటికి వెళ్లాను" అన్నది మాలతి మామూలుగా.

గుండుపెట్టి కొట్టినట్లయింది శాస్త్రిగారికి. మాలతి వెనక సావిట్లోకి వచ్చి "చదువు చెప్పిస్తున్నందుకు నువ్వు చేస్తున్న ఘనకార్యం ఇదన్న మాట ?" అన్నా డాయన కోపంగా.

తండ్రిలో మార్పు చకితురాన్ని చేసింది మాలతిని. "ఇల్లు చూద్దుగానివి రమ్మంటే వెళ్లాను" అన్న దామె నేల చూపులు చూస్తూ.

"ఏం అవసరం వచ్చింది ?"

"ఆయన రమ్మన్నారుగదాని ...."

పెరుగుతూన్న కోపాన్ని దిగమింగాడు శాస్త్రిగారు. తప్పంతా తనదేమో నన్న శంక ఆయన గుండెలో రొదచెయ్యసాగింది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు హద్దు లుంటాయనే జ్ఞానం తన కూతురికి లేకుండా చేసింది కూడా తానే. ఇంత చదువూ చదివి గెజిటెడ్ ఆఫీసరుగా రిటైరయిన తన అనుభవమూ, జ్ఞానమూ ఇలాగయి పోయాయా ?

అయినా ఇంకా పరిస్థితులు చెయ్యిజారి పోలేదేమో ? అనవసరంగా తాను బయటపడితే అవాంఛనీయమైన పరిణామాలు కలుగవచ్చు.

" ఆ చేతిలో పొట్లాం ఏమిటి ?" అన్నా డాయన చివరికి.

"అతని అక్కగారు పసుపు కుంకం, రవికల గుడ్డా ఇచ్చారు" అన్నది మాలతి.

"ఇహ నెప్పుడూ నాతో చెప్పకుండా అతని ఇంటికి వెళ్లకు. అలాంటి లోఫరుతో నువ్వు తిరగకూడదు."

శరాఘాతంలా తగిలాయామాటలు మాలతికి. తండ్రిలోని ఈ భాగం ఆమె కింతవరకూ అనుభవం కాలేదు. అతను లోఫరా ? అతని వినయాన్ని, మంచితనాన్ని మెచ్చుకున్న తన తండ్రేనా ఆమాట అనేది ?

"ఆ పాట్లాం రేప్పొద్దున అతనికి పంపించెయ్యి" అన్నాడు శాస్త్రిగారు తిరిగి.

"ఆయన నొచ్చుకుంటారేమో ?" అన్నది భయపడుతూ భయపడుతూ మాలతి.

అంతదాకా అణగిఉన్న కోపం శాస్త్రిగారిలో ప్రజ్వరిల్లింది. ఆవేశంలో ఆయన సారథిని నానా రకాలుగా దూషించాడు. మాలతిని ఛీదరించుకున్నాడు. చివరికి "నీలాంటిదానికి కాలేజీ చదువు లెందుకు ? మానెయ్యి. ఎవడ్నో ఒహడ్ని కట్టుకుని కాపరం చేద్దువుగాని" అన్నాడు.

మాలతి కన్నులు అశ్రుసిక్త లయినాయి. గుండె లవిసిపోసాగాయి. కూర్చుకున్న ఆశలన్నీ కూలిపోతుంటే, శోకమూర్తిలా తన గదిలోకి పోయి మంచంమీద పడిపోయిం దామె.

మరునాడు ఉదయం శాస్త్రిగారు లక్ష్మీనారాయణగా రింటికి వెళ్ళాడు. ఆయనలో సారథి మీద కోపమూ, అసహ్యమూ గూడు కట్టుకు పోయాయి. పయోముఖవిషకుంభం అనుకున్నాడు.

జరిగిందంతా బావమరిదితో చెప్పాడు.

లక్ష్మీనారాయణగారు మౌనంగా విన్నాడు. ఇటువంటిదేదో జరుగుతుందని ముందుగానే వూహించా డతను. కాని ఇంత తొందర్లో ననుకో లేదు.

"సారథి సంగతి నీకు తెలుసు కదా బావా ?" అన్నాడు.

"అలా అనుకునే ఇంతదాకా తెచ్చుకున్నాను. ఇహ వాడి సంగతి నా దగ్గర ఎత్తకు. నా పొరపాటులో నీకూ భాగం ఉంది. గనుక యీ బాధ్యత నీమీద వేస్తున్నాను. అతనూ మాలతీ ఇకమీద కలుసుకోవటానికి వీలులేదు. అతన్ని పిలిపించో అతని ఇంటికి వెళ్ళో ఈ విషయం స్పష్టంగా చెప్పు" అన్నాడు శాస్త్రిగారు.

"అతనేమన్నా నా పోషితుడా ? వినకపోతే .... ?"

శాస్త్రిగారు అనుమానంగా "నీకూ ఇందులో ప్రమేయం ఉందా ?" అన్నాడు

"ఇంతవరకూ లేదు .... నాకు తెలీకడుగుతాను బావా ! సారథి తప్పేమిటి ? ఈ రోజుల్లో చాలా మంది యువకుల్లో లేని గుణాలు అతనిలో ఉన్నాయి. అంతటి సన్నిహితమనుష్యుణ్ణి కేవలం రాఘవరావు మాటలమీద ఆధారపడి నిందించటం అనుచితం అంటాను. రాఘవరావు ఎవరో నీకు తెలుసు. అతని నిర్ణయాలు నీబోటి విజ్ఞుడికి శిరోధార్యాలు కావటం శోచనీయం."

"ఏమయినా నాకు ఇష్టం లేదురా ! బరి తెగించి బట్టలు కుట్టుకుని బతుకుతున్నవాడు. పైగా అతని కుల మేమిటో గోత్ర మేమిటో తెలీదు. ఆ తండ్రి తిర్మలకరుడని, శ్రీకృష్ణుడనీ చెబుతున్నారు ...... అసలయినా ఈ ముళ్లకంప తప్ప మరో సంబంధం దొరకదా మనకు ?"

" మాలతి ఇష్టాఇష్టాలతో పనిలేదా ?"




చిత్రకారుడు—పి. నాగాంజనేయులు (మద్రాసు)

శాస్త్రిగారు అసహనంగా "ఈ వాదాలన్నీ అనవసరం లక్ష్మీ ! వాడికీ దీనికీ పెళ్లి కావటానికి వీల్లేదు. ఇందుకు నువ్వు పూనుకోకా తీరదు....నా దృష్టిలో ఇప్పటికే ఒక సంబంధం ఉంది. సాధ్యమైనంత తొందర్లో ఆ పెళ్లి కాస్తా చేసేస్తాను. అంతే" అన్నాడు.

ఆయన దృష్టిలో ఉన్న సంబంధం ఏదో లక్ష్మీనారాయణ గారికి తెలీకపోలేదు.

"ఇదే నీ ఆఖరి నిర్ణయమా ?"

"అంతే."

"సరే అయితే."

శాస్త్రిగారు ఇంటికి తిరిగి వచ్చాడు. అన్నపూర్ణమ్మగారు వచ్చి "మాలతి ఒళ్ళు పేలిపోతూ్ాందండీ ! జ్వరం విపరీతంగా ఉంది" అన్నది ఆందోళనగా.

"డాక్టరును తీసుకొస్తాను" అన్నా డాయన నిబ్బరాన్ని సాధించుకుంటూ.

ఆ జ్వరం అలాగే అయిదు రోజులు సాగింది. ఈ అయిదు రోజుల్లోనూ శాస్త్రిగారు కూతుర్ని అంటి పెట్టుకునే ఉన్నాడు. ఆయనకు ఆమె అంటే ప్రాణం. ఆమె భవిష్యత్తును గురించి ఎన్నో ఆశలూ, వూహలూ పెంచుకొన్నా డాయన. ఆడపిల్ల భవిష్యత్తు పెళ్లి అనే నమ్మకం ఉన్నవాడే అయినా ఆమెను విద్యావంతురాల్ని చేసి తన కుమార్తె శారదా భూషమనిపించుకోవాలని ఆయన తాపత్రయపడ్డాడు. కాని ఆశయసిద్ధి ఎవరికో గాని కలగదు. తాను ఓడిపోయాడు.

అందుకే వివాహమయినా ఘనంగా జరిపించి తన ఆశయాన్ని తీర్చుకోవాలి. దురదృష్టకరమయిన ఈ పరిణామం ఎంతోకాలం నిలిచేది కాదు. ఆమె అతన్ని త్వరలోనే మర్చిపోతుంది. అందుకు తోడుగా కాలేజీకి ఇప్పుడు వేసవి సెలవులు. తిరిగి కాలేజీ తెరిచేలోగా లక్ష్మీనారాయణను ఒప్పించి వివాహం చేసివేస్తే అన్ని సమస్యలూ పరిష్కారం అవుతాయి. అంతే ?

కాని అతను ఒప్పుకుంటాడా ?

అతని తల్లి తనకు మేనత్త. ఆమె తన కోరికను కాదనదు. ఆమె గీచిన గీటు దాటనివాడు లక్ష్మీనారాయణ. స్వగ్రామంలో ఉన్న ఆమెను పోయి కలుసుకుని మాట్లాడి రావాలి.

ఆరవ రోజున మాలతి జ్వరం తిరుగుముఖం పట్టింది. ఆమెకు పథ్యం పెట్టి ఆమె కాస్త కోలుకున్నాక వెళదామని నిర్ణయించుకున్నాడు శాస్త్రిగారు.

ఆ మర్నాడు ఉదయం ఎనిమిది గంటల వేళ బట్టలు వేసుకుని శాస్త్రిగారు బయటికి బయలుదేరబోతుండగా వాళ్ళు ముగ్గురూ బండి దిగారు. అందులో ఒక నడి వయసు మొగవాడూ, అంతకన్నా కొంచెం చిన్నదిగా కనబడే ఒక స్త్రీ మరొక పద్ధెనిమిది ఇరవయి ఏళ్ల అమ్మాయి ఉన్నారు. వాళ్ళను చూడంగానే శాస్త్రిగారి ముఖం విప్పారింది.

"ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు ? రండి రండి" అన్నా డాయన సాదరంగా.

వాళ్ళు ముగ్గురూ లోపలికి వచ్చారు.. శాస్త్రిగారు గబగబా లోపలికి వెళ్ళి భార్యతో "మా రాజా కుటుంబం వచ్చారు అన్నపూర్ణా ! ఆడవాళ్ళ కెం కావాలో కాస్త చూసి కాఫీ కలిపి పంపించు. నేను వాడితో మాట్లాడుతూంటాను" అని చెప్పాడు. ఆ తరువాత ఆవిడనూ, అమ్మాయినీ లోపలికి తీసుకెళ్ళి తిరిగి హాల్లోకి వచ్చాడు. 'రాజా' గారు పడక కుర్చీలో జారగిలబడి కూర్చున్నాడు.

"ఏమిట్రా ? విశేషాలు ?" అన్నాడు శాస్త్రిగారు.

"అన్నీ విశేషాలే. నా సంగతికన్నా ముందు నీ సంగతి చెప్పు. అమ్మాయికీ, అబ్బాయికీ పెళ్లి చేశావా ? పిల్లలా ?"

"లేదు. ఇప్పు డిప్పుడే సంబంధాలు గురించి ఆలోచిస్తున్నాను. మాలతి మూడేళ్ల కోర్సు మొదటి సంవత్సరం చదువుతోంది. రామకృష్ణుడు కాకినాడలో చదువుతున్నాడు."

"సెలవులు కాబోలు, రాలేదా ?"

"ఏదో ఎక్స్‌కర్షన్ వుందని వెళ్లాడు. రావాలి."

'రాజా' గారు సాలోచనగా "తమాషాగా ఉంటుంది

( 54వ పేజీ చూడండి)



రమణ వచ్చాడు—

చేసిన పాపం వెంటాడుతూ వస్తుందంటే ఏమిటో ఇవాళ రాధమ్మ కర్థమయింది. కాని నలభై ఏండ్లక్రితం ఎటువంటి సంఘటన జరిగిందో—అలాంటిదే ఇవాళా జరుగుతుందని కలలో కూడా అనుకోలేదు. ప్రతి క్షణ-క్షణమూ వణికి పోతూ వుంటే "భగవాన్ ! నన్ను అన్ని విధాల నాశనం చేయకు. ఇప్పుడు నేనున్న స్థితే నేనుచేసిన పాపానికి వేయిరెట్లు అనుభవిస్తున్నట్లుంది" అనుకొన్నది. కళ్ళనిండా నీళ్ళు నిలిచాయి. చేటలో వున్న బియ్యం కనబడటంలేదు. బాధ, దుఃఖంకలసీ పీకనులిమివేస్తున్నట్లుంది.

—నలభై ఏండ్లక్రితమంటే ఆ రోజుల్లో రాధమ్మ భర్త శేషాద్రి బాగానే గడించేవాడని చెప్పుకోవాలి. తండ్రి చనిపోయిన తరువాత పైకి వచ్చాడు. తమ్ముళ్ళిద్దర్నీ పై వూళ్లో తల్లి దగ్గరపెట్టి చదివిస్తున్నాడు. ఇది రాధమ్మకు గిట్టేదికాదు. అప్పటికే ఆవిడ కిద్దరాడపిల్లలు. మగపిల్లలులేరు గనుక తమ్ముళ్ళే తన కొడుకుల్లా చూసుకొనేవాడు శేషాద్రి. వాళ్ళూ, చిన్న కూతలేమీ కార్స. వెంకటాద్రికి ఇరవై దాటాయి. ఎప్పుడూ ఏదో తీక్షణంగా ఉండేవాడు. రెండోవాడు పదహారేండ్ల గోవిందరాజులు. ఒక్కో క్లాసులో నాలుగేళ్ళు తప్పక కూర్చునేవాడు.

వాళ్ళిద్దరికీ తానంటే గౌరవంలేదని రాధమ్మను కొనేది. శేషాద్రిరాధమ్మకు తెలిసీ తెలీకుండా డబ్బూ దస్కం పంపుతూండేవాడు. తెలిసినప్పుడు తన కూతుళ్ళకు అన్యాయంజరుగుతుందని వాపోయేది. శేషాద్రిపెద్దగా పట్టించుకొనేవాడుకాడు.

ఇవాళ రమణ వచ్చినట్లే ఒకరోజు అనుకోకుండా వెంకటాద్రివచ్చాడు. చేతితో చిన్న సంచిమాత్రముంది. రాధమ్మకేదోఅదటు కలిగింది. ఎప్పుడూ రానివాడు వెంకటాద్రి వచ్చాడు. అలా చూస్తూ వుండిపోయింది.వెంకటాద్రే మొదట—'ఏం వదినా! అందరూ బాగున్నారా?"—అనిపరామర్శించాడు. తెప్పరిల్లిందిరాధమ్మ "ఆఁ !బాగే—" అన్నది.

"పాపలు ఏరి !" అన్నాడు.

"ఆడుకోటానికి పోయుంటారు"— అన్నది రాధమ్మ.

"అన్నయ్య వూర్లో ఉన్నారా !"

కొద్దిసేపు రాధమ్మ మాట్లాడలేదు—ఎందుకొచ్చాడో వీడు—అన్నట్లుంది మనసులో. మెల్లగా

రమణ వచ్చాడు.

ఈ వేళ రమణ వచ్చినట్లే సరిగ్గా ఏండ్లక్రితం వెంకటాద్రి వచ్చాడు. వదినమాటలు విన్నాడు. ఇక అన్నకు బరువుగా ఉండనన్నాడు. వెళ్ళిపోయాడు. అదే ఆఖరిసారి వెంకటాద్రిని చూడడం.

కన్నకూతుళ్లు కడుపులో చిచ్చుపెట్టి పోయారు. "వెంకటాద్రికి చేసిన అన్యాయం, అత్తగారిని పెట్టినక్షోభ ఊరికే పోతుందా?"

ఇప్పుడు రమణ గతి ఏమిటి? భగవన్, ఈ పాపానికి నిష్కృతిలేదా! అదీ రాధమ్మ దుఃఖం. అంతా ధరణి చేతుల్లో ఉంది.

ధరణి మరదితో ఏమంటూంది?

"నువ్వు శ్రద్ధగా చదువుకొని వృద్ధిలోకి వస్తే మా పంటలు పండించావన్నమాట!"

రాధమ్మ కోడలిని చేతుల్లోకి తీసుకొని — "వాళ్లకు తల్లి నేను కానమ్మా. నువ్వు" అన్నది. భగవానుడు కరుణామయుడు!

''అలా పక్క వూరు వెళ్ళివస్తానని వెళ్ళారు''— అన్నది.

''మధ్యాహ్నం భోజనానికి వస్తారా'' అనడిగాడు.

''రాత్రికిగాని రారు''—అని వెంటనే ''ఏం'' అన్నది.

''అబ్బే ఏంలేదు—కొద్దిగా పైకమవసరం ఉండి వచ్చాను వదినా...'' అన్నాడు.

తాను అనుకొంటున్నదే అది. డబ్బుకోసంగాక ప్రేమతో వస్తాడా !—మనసు చిరచిరలాడింది. ఇక మరది ఎదురుగా ఉండలేకపోయింది. కూర్చో మన్నైనా అనలేదు. కొద్దిసేపుండి బయటకు వస్తే వెంకటాద్రి లేడు. పిల్లలిద్దరూ వెంకటాద్రి అక్కడ వదలి వెళ్ళిన సంచిలో పుస్తకాలు బయటకుతీసి బొమ్మలు చూస్తున్నారు. వాళ్ళ నడిగింది. 'బాబాయి ఎటు పోయాడే' అని.

మూడు గంటలు దాటిన తరువాత, వచ్చాడు వెంకటాద్రి. వసారాలో పడక కుర్చీలో కూర్చున్నాడు. రాధమ్మ గుమ్మమీవల కూర్చొంది.

''సాపాటుకు రాలేదేమిటి—నీ కోసం చాల సేపు చూశాను''— అన్నది.

చిన్ననాటి మిత్రుడొకడు కలసి బలవంతం చేస్తే వాళ్ళింట్లోనే పూర్తి చేశానన్నాడు. పట్నంలో అత్తగారెలా ఉన్నారని ప్రశించింది. వెంకటాద్రి ముక్తసరిగా — 'బాగానే ఉంది'—అన్నాడు.

# విమోచన

అక్కడనుండి కదలేసింది రాధమ్మ. కడుపులో ఉన్న అక్కసంతా కక్కివేసినట్టుగా మాట్లాడింది. ఆఖరుకు ఈ చదువులు ఎంత కాలమని—తనకూ ఇద్దరాడ పిల్లలున్నారు కాబట్టి వాళ్ళ పెళ్ళి పేరంటాలకు కొద్దిగా వెనుక వేసుకోవాలనీ—వస్తున్నదంతా దోచుకుపోతే వాళ్లేం కావాలనీ—అడిగేసింది.

వెంకటాద్రి మౌనంగా కూర్చున్నాడు. రాధమ్మ రెట్టించి రెట్టించి సమాధాన మడిగింది. వెంకటాద్రి వదిన వంక చూసి, ''ఇవాళవరకూ నేను మా అన్నకు బరువుగా ఉన్నాననుకోలేదు వదినా— అలాగే అన్నా అనుకొంటున్నాడనుకొన్నాను ఇంత కాలం. కాని ఇవాళ తెలిసింది. ఇంక మీకు భారంగా ఉండను''—అన్నాడు.

బయట ఏదో అలికిడయితే గుమ్మమావలికి తొంగిచూసింది. వెంకటాద్రి వెళ్ళిపోతున్నాడు. ఏ మాటాలేదు. గట్టిగా కేకవేసి పిలిచింది. కాని వినబడనట్లే వెంకటాద్రి వెళ్ళిపోయాడు. అదే వెంకటాద్రిని ఆఖరి సారిగా చూడటం.

వెంకటాద్రి అలా ఎక్కడికి వెళ్ళిందీ ఎవ్వరికీ తెలీదు. ఎక్కడా కనబడక పోయేప్పటివరకు రాధమ్మ శేషాద్రికి వెంకటాద్రి ఇలా వచ్చి వెళ్ళినట్లు చెప్పలేదు. తమ్ముడిని వెతకటానికి వూళ్ళమీదపోయి తిరిగి వచ్చిన రాత్రి రాధమ్మను పిలచి ''మా అమ్మ పడే బాధ ఎంతో నాకు తెలుసు. అటువంటి బాధ ఈ జన్మలో ఎప్పుడో ఒకసారి నువ్వూ అనుభవిస్తావు. ఆనాడు తెలుస్తుంది—అన్నా, తమ్ముడూ—తల్లీ, వదినా....అంటే ఏమిటో'' అన్నాడు.

వ్యధపడ్డ మనసులోంచి వచ్చిన ప్రతి మాటా శాపంలా తగులుతుందంటారు పెద్దలు—మరి ఇదెంత నిజమో కాని శేషాద్రి మాటలు మొదట రాధమ్మకేమీ అనిపించకపోయినా రెండేళ్ళు తిరక్కుండానే ఇద్దరు పిల్లలూ పోయేప్పటికి భర్త శాపమే ఇలా ఫలించిందని అనుకొన్నది. కాని శేషాద్రి ఎప్పుడూ భార్యతో ఆనాడు చేసిన పాపానికిది ఫలమనలేదు. 'పూర్వజన్మలో చేసిన పాపమేదో ఇలా చేసింది'—అనేవాడు. రాధమ్మకు భర్త నోటిమీదుగ ఆనాడు తను చేసిన పాప ఫలమని అది తీరిపోయిందనివింటే ఆ నాటితో తీరిపోతుందని అనుకొనేది. అందుకే ''వెంకటాద్రికి చేసిన అన్యాయం అత్తగారిని పెట్టిన క్షోభ వూరికే పోతుందా''— అనేది. శేషాద్రి మిన్నకుండేవాడు. రాధమ్మ 'ఈ పాపం ఇంకా ఇలా ఎంతకాలం నా వెంట వస్తుందో' అని ఏడ్చేది. శేషాద్రి ఓదార్పుగా 'భగవంతునికి దయ కలగాలి' అనేవాడు. అంతే—ఎంతకాలం వేచిఉన్నా శేషాద్రి శాపవిమోచనమయిందనలేదు. దానికోసం రోజు రోజు రాధమ్మ ఎదురు చూస్తూంది.

మరో అయిదేళ్ళు గడవగానే రాధమ్మకు కొడుకు పుట్టాడు. వెంకటాద్రి పేరు పెట్టుకుంది. అలాగైనా పాప విమోచన మవుతుందేమోనని. వెంకటాద్రి తరువాత పన్నెండేళ్లకు రమణ పుట్టాడు. ఆడపిల్ల కావాలని మొక్కుకుంది. మరో అయిదేళ్లకు పుడతాడులేవే అన్నాడు శేషాద్రి దయదలచి. అలాగే మరు సంవత్సరం ఆండాళ్ళు పుట్టింది.

ఆండాళ్ళు పుట్టిన నాలుగేళ్లకు శేషాద్రి తను చేసే వ్యవహారంలో దెబ్బ తిన్నాడు. ఆనాటినుండి కొడుకుమీద ఆధారపడాల్సి వచ్చింది. రమణను, ఆండాళ్లను తను పట్నంలో పెట్టుకొని చదివిస్తున్నాడు. వెంకటాద్రి నెల నెలా సాయం చేస్తున్నాడు. ఇది వెంకటాద్రికి పెళ్లిచేసేదాకా ననుకుంది రాధమ్మ. కాని కోడలు ధరణి వచ్చినా మార్పేమీ రాలేదు. తను కొడుకు కోడలుతో ఉంది. ఎప్పుడూ కోడలు పల్లెత్తు మాట అనలేదు. అయినా బాధగా ఉంది రాధమ్మకు. ఎంతయినా తాను కొడుకుమీద ఆధారపడి ఉండటం తను చేసిన పాపమనుభవించటమే అనుకొంటున్నది.

ఇవాళ రమణ వచ్చాడు —

''కాలేజీలో అరవై రూపాయలు కట్టాలి. రేపు ఆఖరి తేదీ—నాన్న ఎక్కడ ప్రయత్నించినా దొరకలేదు. అన్నను అడగటానికి వచ్చాను''— అన్నాడు.

రాధమ్మకు కాళ్లూ—చేతులూ ఆడలేదు. ఆమె కేదో కంగారుగా ఉంది. 'అరవై—ఎక్కడ్నుంచి వస్తాయి. వెంకటాద్రి ఇస్తాడా ! ధరణి ఇవ్వనిస్తుందా !'—అనుకొన్నది. తల్లి అధైర్యం

కళ్లలో ఉండగానే పసిగట్టాడు రమణ.

"అదేమమ్మా! అన్నయ్య దగ్గర లేవా? ఎలాగైనా ఇప్పించుకు రమ్మన్నాడు నాన్న" -- అన్నాడు.

రాధమ్మకు ఏంతోచలేదు. స్నానాల గదిలో ఉన్న కోడలు వింటుందేమోనని మెల్లగా "నాయనా! ఆఫీసులో మీ అన్న దగ్గరకుపో—ఏమన్నా ఇస్తే పుచ్చుకొని వెళ్లు" అన్నది.

"వదిన ఏదీ"—అనడిగాడు.

"నువ్వు ముందు అక్కడికి వెళ్లు"— అన్నది.

రమణ వెళ్లాడు. వెళ్లిన తర్వాత జ్ఞాపకం వచ్చింది. వెంకటాద్రి క్యాంపుకు వెళ్లాడు. రేపో రాత్రికోగాని తిరిగిరాడు—'రమణ తిరిగి వస్తాడు కోడలు ఎందుకొచ్చావనడుగుతుంది. చెబుతాడు. ధరణి ఏదన్నా అంటుందేమో....! అనే స్వభావం కాదు. తనకేది ఇష్టంకాదో దాన్ని గూర్చి మాట్లాడదు. అయినా ఇది దాని మగడి ఆర్జితం. ఎందుకూరుకొంటుంది. ఏదో ఒకటి అంటుంది. అసలే రమణ మెత్తని మనసువాడు. ఇదెలా పరిణమిస్తుందో—భగవాన్' మనసులో అల్లాడి పోయింది రాధమ్మ—

"ఏం అత్తయ్యా! ఇంకా బియ్యమేరుతున్నారా" అని ధరణి వచ్చేవరకు స్పృహలోలేదు. కళ్లొత్తుకొంటూ చేట కోడల కందించింది. చేట తీసుకొని—"మళ్లీ కండ్ల నీళ్లు కారుతున్నాయికదూ! ఈ సారైనా ఆ ఆయుర్వేదంవానివేసి గవర్నమెంటు డాక్టరు దగ్గర పరీక్ష చేయించుకోండి" అని అటు తిరిగింది. గుమ్మంలో రమణ. నివ్వెర బోయింది.

"అరె ఉత్తరం పత్తరం లేకుండా అమాంతంగా ఆకాశంనుంచి వూడిపడ్డట్టు వచ్చావ్!" అన్నది ఆశ్చర్యంగా.

"ఏం లేదు వదినా!—ఏదో తొందర పనుండి." అని ఏదో చెప్పబోయాడు.

"పోనీలే దేవుడి దయవల్ల ఏదైనా ఉండి వచ్చావు ఆపాటి దయవుంచి...." అన్నది వెక్కిరింతగా.

రమణ మాట్లాడలేదు.

"మొన్న సెలవుల్లో రమ్మని వ్రాస్తే రాలేదేం!"—అనడిగింది.

"స్నేహితుడు బలవంతంచేస్తే వాళ్ల వూరు వెళ్లాను వదినా—"

"అవును నాయనా!—నీకు స్నేహితులు ఎక్కువ. పోనీ నువ్వు రాకపోతే మానె ఆండాళ్లను, మామగారిని ఇక్కడికి పంపలేకపోయావా" అన్నది.

రమణ తలవంచుకుని స్తబ్దుగా ఉన్నాడు. రాధమ్మ కిదేమీ అంతుబట్టలేదు. అలా వాళ్ళిద్దరినీ చూస్తూ ఉండిపోయింది.

"కూర్చో—" అన్నది ధరణి.

రమణ దగ్గరున్న కుర్చీలో కూర్చున్నాడు.

"మామగారు, ఆండాళ్ళు బాగున్నారా" అనడిగింది.

"ఆ—"

"ఎప్పుడు బయలుదేరావు?" అనడిగింది.

"ప్రొద్దుట ఎనిమిదింటికి"—అన్నాడు.

"మరి ఇంత ఆలస్యమయిందేం?"

"ఇందాకే వచ్చాను—" అని తలఎత్తి వదిన వంక చూశాడు. వెనుక తల్లి కించిత్కంపిత ముఖంతో వద్దన్నట్లు తల కదిపి కదపనట్లు కదపటం చూశాడు. వెంటనే—"అలా అటునుంచి ఆఫీసుకు వెళ్ళి వచ్చాను" అన్నాడు. రాధమ్మ కుదుట పడింది.

ధరణి నవ్వుతూ "అయితే మొదట భ్రాతృ దర్శనార్థం వెళ్లావన్నమాట"—అన్నది.

"ప్రొద్దుట ఏమన్నా తినొచ్చావా నాయనా"— అనడిగింది రాధమ్మ.

"చెల్లెమ్మ ఏదో చేస్తే తినొచ్చానమ్మా."

"రమణా! కాఫీ పట్రానా!" అనడిగింది ధరణి.

"నేను కాఫీ త్రాగను వదినా" అన్నాడు.

"ఇంత పల్లెటూరి అలవాటు లేమయ్యా మరీను పట్నంలో ఉంటూ కూడ. మజ్జిగ తెస్తాను"— అంటూ వంటింట్లోకి వెళ్లింది.

రాధమ్మ వంట విషయంలో ఏమీ కల్పించుకోలేదు. మరిదికేమి ఇష్టమో ధరణికి తెలుసు. అరటికాయ వడలు, వంకాయ అల్లం కూరిన కూర, మైసూరు చారు—అంటూ పేర్లు చెబుతున్నంత వేగంగా చేసింది. రాధమ్మ అలా మంత్రముగ్ధలా చూస్తూ ఉండిపోయింది. ఏమిటీ ఆదరణో అర్థం కాలేదామెకు — 'ఇవన్నీ ఎందుకే. పెద్దబ్బాయి కూడా లేడు'—అంటే—'అదేమిటి అత్తయ్యా! ఆయన కెప్పుడూ చేసి పెట్టేవేగా....రమణ రాకరాక వచ్చాడాయను'— అన్నది ధరణి. వడ్డించేప్పుడు కూడ మరిదిని కొప్పడి బ్రతిమాలివేసి తినపెట్టింది.

రాధమ్మ ఆలోచిస్తూ, 'ఇదంతా నిజంగా రమణమీద ప్రేమ—అభిమానాలేనా...' అనుకున్నది. ఏదో మనసులో కించిత్ సంకోచం—'వాడెందుకొచ్చాడో ఈ విడకు తెలీదు. రమణ పనుండి వచ్చానన్నాడు. ధరణి ఆ పనేమిటో అడగలేదు. ఒకవేళ తెలిస్తే ఈ ఆదరాభిమానాలు పుటుక్కున తెగిపోతాయి.... ఇంతగా చూపిన ఆదరణ విషంగా మారితే రమణ భరించలేడు....—' ఆవిడ కంటినిండా నీరు నిలచింది.

భోజనాలన్నీ అయిన తరువాత రమణ—ధరణి చదరంగం ఆడుతూ కూర్చున్నారు. రాధమ్మ ప్రక్కనే కూర్చుంది. ఆట జోరుగా సాగుతూంది. ధరణి మొదటి ఆటలో ఓడిపోయినా ఈ ఆటలో తనదే పై చేయిగా ఉంది. రాధమ్మ కొడుకును పలకరించింది.

"ఏంరా రమణా! మీ నాన్నగారు ఆండాళ్ళ పెళ్లి విషయం ఏమన్నా చూస్తున్నారా" అనడిగింది.

"ఎక్కడిదమ్మా—" అన్నాడు ఆటపైనుండి దృష్టి మరల్చకుండా—.

"అది కాదురా—ఆ ఇంజనీ రాఫీసులో ఎవరో అబ్బాయని అప్పుడన్నారు...." అంటున్న తల్లిని పూర్తి కానీయకుండా—

"ఆ—అది కుదరదమ్మా—వాడు చేసేది గుమస్తా గిరయినా మూడువేలు కావాలట" అన్నాడు.

రాధమ్మ క్షణం ఉండి—"నిజమే. మనమేం తూగుతాం....కాసులేనివాళ్లం—మనకు సాయం ఎవరు చేస్తారు....కట్నాలు కానుకలు లేకుండా ఎవరు దొరుకుతారు....పోనీ—ఏదైనా రెండో సంబంధం వాళ్ళు దొరికినా—కట్నం లేకుండానైతే...." రుద్ధమైన కంఠంలోనుండి మాట రాక ఆగింది.

ఇప్పటివరకు ఆటను తీక్షణమైన దృష్టితో ఆడుతున్న ధరణి పావులన్నింటిని కలిపివేసి ధరణి

లోకి తీసివేసింది. గభాలున ఆట అంతా చెదర గొట్టి పావులెత్తి వేస్తున్న వదినవంక నివ్వెర బోతూ చూశాడు రమణ. చదరంగం బల్లతీసి వేస్తూ—'నాకు నిద్ర వస్తూంది రమణా—అత్తయ్యతో మాట్లాడుతూ ఉండు. నిద్ర పోవాలను కొంటే ఆ గదిలో మీ అన్నయ్యగారి మంచంమీద పడుకో....'' అని రివ్వున వెళ్లిపోయింది.

రాధమ్మ కళ్లు మెరిసి మిలమిలలాడాయి. 'ఆండాళ్లు పెళ్లి దీనిని చెయ్యమంటాననుకొంది కాబోల్సు—డబ్బు పేరు చెబితే ఎవరికి భయం వేయదు' అనుకొంటూ రమణ వంక చూసింది.

రమణ కిదేమీ అర్థం కాలేదు. ఇప్పటివరకు ఏ నిద్రా చిహ్నాలు లేకుండా ఆడిన వదిన ఒక్కసారి విసుగ్గా నిద్రనెపంమీద వెళ్లిపోవటం—ఆశ్చర్యమేసింది. తల్లివంక చూశాడు.

రాధమ్మ విజయగర్వంతోకాకపోయినా, తానను కొన్నది నిజమయిందనే నిశ్చలమైన స్వరంతో— మెల్లగా ధరణికి వినబడకుండా "అంతే నాయనా— ఎవరైనా డబ్బు సాయంచేయమంటే....తన సొమ్ము పోతుందనుకొంటే ఎవరు సహిస్తారు...." అన్నది. ఇది మరీ అర్థం కాలేదు రమణకు. లేచి అన్న గదిలోకి వెళ్ళాడు.

సాయంత్రం వెంకటాద్రివచ్చి తమ్ముడిని చూసి ఆశ్చర్యపోయాడు. "ఎప్పుడొచ్చావురా !" అనడిగాడు.

"ప్రొద్దుటన్నయ్యా" అన్నాడు రమణ.

"నాన్నగారు, ఆండాళ్ళు కులాసా ?"

"ఆ !"

కొడుకు లిద్దరి మాటలూ విని రాధమ్మ గదిలోకి వచ్చింది.

వెంకటాద్రి—"సెలవులట్రా"—అనడిగాడు.

రమణ తల్లి ముఖం వంకచూసి అన్నతో "కాదు" అని కొద్దిగా సంశయిస్తూ—"కాలేజీలో డబ్బు కట్టాలి. రేపు ఆఖరి తేదీ...." అన్నాడు.

వెంకటాద్రి మాట్లాడకుండా కోటు విప్పి గోడకు తగిలిస్తున్నాడు. వూ—ఆ—అనని కొడకు నుద్దేశిస్తూ—"మీ నాన్నగారు అక్కడెక్కడన్నా దొరుకుతుందేమోనని ప్రయత్నించారట. ఇవాళ వరకు...." అని చెప్పబోతూ ధరణి రాగానే ఆపి వేసింది.

"నీకు పిచ్చిగాని అక్కడెక్కడ దొరుకుతుందత్తయ్యా ?"—అన్నది ధరణి. రాధమ్మ మాట్లాడలేదు. ఇక్కడితో ఆ విషయం తెగినట్లనిపించింది వెంకటాద్రి భార్యను టీ తెమ్మన్నాడు: ధరణి వెళ్ళగానే తల్లి చూపునందుకొని రమణ తిరిగి ప్రస్తావించినట్లు—రేపు ఆఖరి తేదీ అన్నయ్యా అన్నాడు.

"మంచిది—ఎంత కట్టాలి" అనడిగాడు.

"అరవై—" అన్నాడు రమణ.

"సరే—రేపు వెళ్దువుగాని" అన్నాడు వెంకటాద్రి కుర్చీలో కూర్చొంటూ.

"రేపు ఆఖరి తేదీగా—ఇప్పుడే పోతేనే నయం కదు నాయనా...." అన్నది రాధమ్మ.

"రేపు ప్రొద్దుట పదింటికి బస్సు ఎక్కితే పన్నెండింటికి చేరుతాడు. సాయంత్రం నాల్గింటి లోపున కట్టవచ్చు—ఏంరా !" అన్నాడు వెంకటాద్రి.

'అవును'—అని తలూపాడు రమణ. రాధమ్మ ఎందుకో నిస్పృహ చెందినట్లుగా ముఖం పెట్టింది.

రాత్రి భోజనాల దగ్గర "ఒక్క ముఖ్య విషయం" అన్నాడు వెంకటాద్రి. వడ్డిస్తున్న ధరణి ఆగిపోయింది అన్న ముఖం వైపు ప్రశ్నార్థకంగా చూస్తూ ఉన్నాడు రమణ. రాధమ్మ ఏమిటా అది అని కొడుకువంక చూస్తూంది—

"మన ఆండాళ్ళను చూడటానికి వచ్చే ఆదివారం ఒకళ్ళు వస్తున్నారు"—అన్నాడు. అందరూ ఆశ్చర్యపోయారు. ఎవరా అన్నట్లు చూశారు.

"మనకేం దగ్గర వాళ్ళు కారు. మంచి కుటుంబం. అబ్బాయి ఓవర్సీరు. బాగుంటాడు. నేను చూశాను. చక్కగా వినయంగా మాట్లాడాడు. వాళ్ల ఆఫీసరు కూడా చాల మంచివాడని చెప్పాడు. ఇవాళ ఆఫీసు పనితో చేసి వచ్చిన పని ఇది—" అన్నాడు.

ఆశ్చర్యంలోనుండి తేరుకున్న ధరణి—"అబ్బ ! ఇంత చక్కని విషయం వచ్చిన దగ్గరనుండి చెప్పకుండా ఎలా ఆగారండీ—మనసులో ఎంత గుట్టయినా దాచుకోగలదొంగలు మీరు" అన్నది నవ్వుతూ.

వెంకటాద్రి ధరణికి సమాధానం చెప్పే లోపున రాధమ్మ—"కట్నం విషయం ఏమన్నా చూచాయగా అడిగారా—?" అనడిగింది.

"ఆ—నాల్గు వేలని ఒక రన్నారు. మనం ఎంత లేదన్నా మూడు వేలు పలకాలి" అన్నాడు తల్లి వంక చూస్తూ.

"మూడు వేలు...."రాధమ్మ మాటలో నిస్పృహ ధ్వనించింది. "ఎక్కడినుండి వస్తాయి....అంత అదృష్టం ఆండాళ్ళకుందా...." అని పైకి గొణుక్కుంది.

వడ్డిస్తున్న ధరణి అత్తగారి వంక చూసి "ఏం ! ఆండాళ్లను మీ రెప్పుడూ ఏదో దురదృష్టవంతురాలిగా ఎందుకనుకుంటారు. పైగా ఎందుకా బెంగ. కళ్యాణ మొచ్చినా కక్కొచ్చినా ఆగుతుందా ! ఎప్పుడు ఎక్కడ ఏది జరగాలో అది జరుగుతుంది—" అన్నది కొద్దిగా వి సుగ్గా. ఇక ఎవరూ మాట్లాడలేదు.

రాత్రి రాధమ్మలాగే రమణకు నిద్ర పట్టలేదు. వసారాలో పడుకొని బయట చీకటిని చీల్చుకు చూస్తున్నాడు. మీద చల్లని చెయ్యి పడగానే ఉలిక్కిపడిలేచి కూర్చున్నాడు. రాధమ్మ మంచం ప్రక్కగా కూర్చుంది.

"ఏమమ్మా ! నిద్ర పోలేదూ...." అన్నాడు.

"నిద్ర ఎలా పడుతుంది నాయనా ! ఎప్పుడూ ఈ జీవితం ఇకపై ఎలా గడుస్తుందానే ఆలోచన."

"అదేమిటమ్మా !" అన్నాడు.

"నీ చదువు—ఆండాళ్ళ పెళ్లి పూర్తి కావాలి నాయనా—అప్పుడు నాకు శాంతి" అన్నది మెల్లగా బరువుగా.

"ఇప్పుడు నా చదువుకే మొచ్చిందమ్మా—మరో ఏడు ఉంటే బి. ఏ. పూర్తవుతుంది. తరువాత ఎక్కడన్నా ఉద్యోగం తప్పక దొరుకుతుంది."

"అవును నిజమే నాయినా—కాని దాని కెప్పుడు ఏ ఆటంకం కలుగుతుందోనని కొట్టుకులాడిపోతున్నాను" అన్నది రాధమ్మ.

"అదేమిటీ...." అన్నాడు రమణ.

"ఎప్పుడు ఎలా తిరిగి ఏ మొస్తుందో—ఇప్పటి వరకు—మీ అన్న దేవుడి దయవల్ల మనకు సాయం చేస్తున్నాడు. మీ వదినా ఏమీ అనటం లేదు. ఎప్పుడో ఒకసారి మన గ్రహచారం బాగుండక ధరణి ఈ సాయం ఆపుతే మన గతేంకాను..." చివరి మాటలంటూ ఆమె కంఠం రుద్ధమైంది.

"ఛ—వదిన అలాంటిది కాదమ్మా. నేనన్నా.... ఆండాళ్ళన్నా చాల ప్రేమ...." అన్నాడు రమణ నిండు స్వరంతో.

"కాని నీకు తెలీదు. మనిషికి డబ్బు పోతుందనిపించాలేగా మీ అన్నను—ఏదో తను రాక పూర్వం

నుండి సాయం చేస్తున్నాడు గనుక మీ వదిన వూరుకుంది. పోనీ నువ్వు చూడు ఆండాళ్ళ పెళ్లి విషయమెత్తితే జరిగేది జరుగుతుందంటుంది. మన కంత ఎక్కడిది—అడిగినంత కట్నం పారవేసి అల్లుణ్ణి తెచ్చుకోటానికి. మీ అన్నే ఎక్కడన్నా తెచ్చి చెయ్యాలి. అలా మీ అన్న తెస్తానన్నా మీ

## విమోచన

వదిన వూరుకొంటుందా—ఏం ?" అన్నది నిర్ధారణగా బొంగురుపోయిన కంఠంతో.

రమణకు అర్థమై అర్థం కానట్లుంది—అవును, నిజమే ఎప్పుడైతే పెండ్లి చేసుకున్నారో వారి సంసారం వేరయినట్లేగా. వదిన ఎంత మంచిదైనా నలుగురు పిల్లలు కల్గేప్పటికి దాచుకోవా లని ఎందుకుండదు అనుకున్నాడు. పైకి "నిజమే" అన్నాడు.

కొడుకు తనను అర్థం చేసుకున్నాడనుకొనే

'ఎన్నో ఎదురుగాలుల్ని ఎదుర్కున్నాను — ఓడి పోయాను. దారిద్ర్యం, దుఃఖం—రోగాలు—నిరుద్యోగం అన్నీ నామీద దండెత్తి సహనాన్ని, శక్తిని పరీక్షించాయి. నిలదొక్కుకున్నా. ఆత్మబలంకంటె గొప్పదిలేదు. ఒక్కసంగతి జ్ఞాపకం ఉంచుకుంటే నువ్వు దేన్నిగురించీ బాధపడవు. ఈ బతుకు కల కాలం నిలిచేదికాదు. నానాటికీ ముసలితనం దగ్గరవుతోంది. చివరకు చచ్చిపోతాం. అలాంటప్పుడు ఎందు కీజ్ఞాపకాలు, అనుభవాలు ? ఉన్నంతకాలం గతాన్ని మర్చిపోయి హాయిగా బతకటం నేర్చుకోవాలి....ఇంతకూ, నీకు అభ్యంతరం లేకపోతే నీ అనుభవాల్ని కొంచెం వివరించు. నేను సరైన మందు వేస్తాను. ఆ చాకచక్యం నాకుంది.'

'మీతో చెప్పుకుంటే కొంత మనశ్శాంతి కలుగుతుందనుకోండి....మీ అమ్మాయిగారు ఏం తోచటం లేదని అసలే విసుక్కుంటున్నారు. నేను మరీ విసిగించి తలనొప్పితెప్పిస్తాను .... అనాసిన్, ఆస్ప్రో లాంటి మందులు నా దగ్గరలేవు.'

'ఈయనకు చమత్కారంగా మాట్లాడటం కూడా చాతనవునన్నమాట !' అని నవ్వుకుంది సుందరి.

'ఫరవాలేదు. పుస్తకంలో కథ చదివినట్టుంటుంది....'

సుందరి చెవులు నిక్క బొడుచుకుని కూర్చుంది. హరి రెండునిమిషాలు ఏదో ఆలోచిస్తూ, గడిపేశాడు.

'ఈ కథ మీకెలా చెప్పేదని సందేహిస్తున్నాను... ఇది నాకు సంబంధించిన ప్రేమ కథ—' అన్నాడు సిగ్గుపడుతూ. సుందరి కూడా అనుకోకుండా సిగ్గుపడింది. తనలాంటి పడుచుపిల్ల ఎదురుగా లేకపోతే అనర్గళంగా కథాకాలక్షేపం చేసేవాడేమో !

'నేను ముందే ఊహించాను. నీలాంటి యువకుణ్ణి వంగదీసే శక్తి దానికిమాత్రమే ఉంది. మరెలాంటి ఆపద వచ్చినా ధైర్యంతో ఎదుర్కోగలడు. ఆకాశం విరిగిపడ్డా ఆనుకోగలడు. ఆడదాని వలపులోపడితే మాత్రం శక్తి సామర్థ్యాలు పరాధీనమవుతాయి. ప్రేమనేది నిషిద్ధవస్తువు కాదు. జీవితంలో అంతర్భాగం.'

నాన్న ఇంత భావగర్భితంగా మాట్లాడటం సుందరి ఎన్నడూ వినలేదు.

'నా వేషభాషలు చూస్తే శ్రీమంతుడిలాలేను?... అవును—నేను డబ్బుతో పుట్టి పెరిగాను. మా నాన్నకు వెయ్యెకరాల పొలం. రెండు పెద్ద డాబాలు—బాంకులో లక్షలు. ఇచ్చిపుచ్చుకోడాలు బోలెడు.

'బి. ఏ. పూర్తిచేసుకుని ఇంట్లో కూర్చున్నా. ఇంగ్లండువెళ్ళి లిటరేచర్ చదవాలని అభిలాష. అప్పుడే అమ్మకూడా పోయింది. ఆ దుఃఖంలో నాన్న చదువుసంగతి మర్చిపోయారు. పై చదువులు చదివి ఉద్యోగం చేయవలసిన అవసరం లేదని, ఉన్నదాంతో పదితరాలు హాయిగా బతకవచ్చని వాదించారు. మొదట్లో ఎదిరించినా ఆయన ఆరోగ్యం దిగజారటంవలన ఒప్పుకున్నాను. విశ్రాంతి అనేది అవసరమే. కాని అవధిదాటితే ప్రమాదకరం. పనీ, పాటా లేని కారణంచేత ఊరమ్మట తిరుగుతూ, స్నేహితులతో కులాసాగా కబుర్లు చెబుతూ, కాలక్షేపం చేసేవాణ్ణి. నాన్నగారు మొదట్లో నా విషయం అంతగా పట్టించుకునేవారు కారు. అందు కాయనకు తీరిక కూడా వుండేదికాదు. తరువాత, తరువాత ఒకటి రెండుసార్లు మందలించారు. విలాసజీవితానికి అలవాటుపడితే విజ్ఞానం వుండదుగా మరి! యౌవనం—అవకాశం—అనురాగం—ఇవి అభివృద్ధికి ఆటంకాలు. నిజం తెలుసుకున్నాక చివరి నాలుగు రోజులూ 'ఆనాడు అలాచేయకపోతినే' అని పశ్చాత్తాపపడటం జరుగుతుంది. ఏం తోచిందో ఏమో నాన్న చదువుకోమన్నారు. ఆధ్యాస ఏనాడో అంతమైంది. ఆయన వ్యాపారంలో సగం నాకప్పగించారు. అశ్రద్ధతో నష్టంలో ముంచేశాను. ఇలా ఎంతోకాలం జరగదని నాకు తెలుసు. ఆదర్శానికి, నిజానికి మధ్య సంఘర్షణ జరిగి ఆద్యంతాలులేని ఈ మానసికబాధలకు ముగింపు కనపడుతుంది. ఆరోజుకోసం ఎదురు చూస్తూ కూర్చున్నా.

'ఉన్నట్టుండి ఓనాడు నాన్నగారి విరోధులు ఆయన్ను పొలందగ్గర అటకాయించి కర్రలతో మోది చంపేశారు. వెయ్యి ఏనుగుల్ని ఒక్కసారిగా ఎదుర్కొనే మనస్థైర్యం వుట్టిపడేముఖంతో, పొట్టిగా, లావుగావుండే నాన్న అసహాయుడై, 'నా' అనేవారు లేకుండా రక్తప్రవాహంలో తేలుతూ కనిపించేసరికి నాలో దాగివున్న పితృప్రేమ పొంగుకొచ్చింది. ఆయనదుర్మరణానికి నేనుకూడా కొంత కారకుణ్ణి. అనురాగాన్ని అర్థంచేసుకోక మనసు కష్టపెట్టాను. అండగా ఉండేందుకుబదులు అహంకారంతో, నిర్లక్ష్యంతో ప్రవర్తించాను. దుఃఖం ఆగిందికాదు. తరువాతి ఏడాదివరకూ కేసులూ—సాక్ష్యాలు—విచారణలు—అంతానరకం—ఎవర్నో పట్టుకుని దండించారు. కొందరికి యావజ్జీవ కారాగార శిక్షన్నారు. కొందరికి అయిదు సంవత్సరాలు, కొందరు అసలు దోషులే కాదన్నారు — న్యాయశాస్త్రంలోఉండే సెక్షన్లన్నీ చదివారు. 'అలాకాదు ఇలా— ఇలాకాదు అలా' అని ప్లీడర్లు గొంతుచించుకుని వాదించారు. ఫలితంగా జయం నాకు కలిగింది. 'దండింపబడినవారు నిజంగా దోషులౌనా ? కాదా ?' అన్నది నాసమస్య కాదు. ఎవరిమీదో కసితీర్చుకోవాలి—పగ చల్లారాలి—నాన్నగారిఆత్మ శాంతించాలి—ఇరవై వేల రూపాయల దాకా ఖర్చయింది. అంతటితో ఓ అధ్యాయం ముగిసింది.'

బండి ఒక్క కుదుపుతో ఆగింది.

'ఆ !....ఆంధ్రపత్రిక—ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ, డిటెక్టివ్‌నవలలు, పుస్తకాలు' అంటూ ఎవరో దండకం చదువుతూ కిటికీదగ్గరికి వచ్చేసరికి సుందరి కోపంతో చెవులు మూసుకుంది. ఇంటి దగ్గర్నుంచి పుస్తకాలేవీ తెచ్చుకోలేదని విసుక్కున్న సుందరి ఒక్క పుస్తకమూ కొనకపోయేసరికి అమ్మ, నాన్న ఆశ్చర్యపోయారు. మరొకప్పుడైతే ఆమె డజనుపుస్తకాలు కొనేది. ఎదురుగావున్న హిగిన్ బాదమ్సులోని రకరకాల—రంగు రంగుల పుస్తకాలు ఆమెదృష్టిని ఆకర్షించలేక వెలవెలపోయాయి.

'మీ జీవితంలో వచ్చిన ఆ మార్పు ?....' అని వినయంగా కథ మొదలుపెట్టమని సుందరి ప్రార్థించింది.

"ఈ స్టేషనులో బండి ఎంత సేపు ఆగుతుంది?" అనడిగాడు హరి.

# మిథ్యాసుందరి

'అర నిమిషం' అందామనుకుంది సుందరి.

'అరగంట—' అన్నారు సీతాపతి.

'ఉండండి—అలా తిరిగి ఏదైనా తినివస్తాను. ఆకలిగావుంది—' అంటూ రెండే అంగల్లో బయటికిపోయి జన సముద్రంలో కలిసిపోయాడు.

'ఒకవేళ అతను తిరిగి రాడేమో !' అనుకుని సుందరి పైకిచూసింది. చిన్న సూట్‌కేస్, బెడ్డింగ్ ఉన్నాయి. వాటి కోసమేనా తిరిగివస్తాడని తృప్తి పడింది. నిమిషాలు లెక్కిస్తూ కూర్చుంది బండి బయలుదేరేగంట కొట్టేశారు—గార్డు నిజిలు ఆసందడిలో గుండులా దూసుకుపోయింది పచ్చ జెండా కనిపించగానే బండి కదిలింది. సుందరి గుండెలు గబగబ కొట్టుకున్నాయి. అతను తిరిగి రాలేదు

'నాన్నా !....' అంది.

'అవునమ్మా !....నేనూ అదే ఆలోచిస్తున్నా. ఒకవేళ అతని ప్రవర్తన—మాటలు అన్నీ కల్పితాలా—నటనా—అనుకుంటాను—'

'అది కాదండి ! ఆ సామానుకోసమైనా రావాలి కదా ? ఒకవేళ రైలు తప్పిపోయిందేమో !' అంది అమ్మ.

'ఆ !....అది నేను ఒప్పుకోను. చదువుకున్న వాడికి ఆమాత్రం తెలివి ఏడవదేమిటి ?....కొంప తీసి ఎవరినైనా ఖూనీచేసి ఆ సూట్‌కేస్‌లోఉంచి చల్లగా జారుకున్నాడేమో ! ఇలాంటివి పేపర్లో అప్పుడప్పుడు కనిపిస్తున్నాయి' అన్నారు సీతాపతి. సుందరి పరుగెడుతున్న రైల్లోంచి ప్లాటుఫారం మీదెక్కడైనా అతను కనిపిస్తాడేమోనని ఆశగా చూసి తల లోపలికి లాక్కుంది.

మరో అరగంట పరుగెత్తి రైలు ఆగింది. హరినిగురించి ఏ నిర్ణయానికీ రాలేక సుందరి సతమతమవుతూంది. ఆ పెట్టె తెరచిచూస్తే నాన్న ఊహ ఎంతవరకు సరైందో తెలుసుకోవచ్చు. కాని అందుకు ధైర్యం చాలదు—

తలుపు తెరచుకుని హరి లోపలికొచ్చాడు. ముగ్గురూ అతనివంక ఆశ్చర్యంగా, ప్రశ్నార్థకంగా చూశారు.

'సగం కాఫీ తాగుతుంటే బండి కదిలిందండి. పూర్తిగా తాగి దొరికిన పెట్టెలో ఎక్కేశాను—' అంటూ నవ్వాడు.

'బాగుందయ్యా ! గ్లాసెడు కాఫీ తాగటానికి అరగంట చాలదన్నమాట ! మరి కథ నడిపించు—నీకోసంఎదురు చూస్తున్నాం' అన్నారు సీతాపతి.

'ఈ బిస్కట్లు తినండి. ఇవిగో కాలక్షేపానికి పుస్తకాలు....' అంటూ సుందరి కందించాడు. సుందరి వాటివంకైనా చూడలేదు. హరి చెప్పుకుపోయాడు:

'మనసంతా అల్లకల్లోలమై శాంతి లేకపోవటం మూలాన జీవితక్రమం పూర్తిగా మారింది. ఉదయం తొమ్మిదింటికి లేవటం, ఏమిటో పిచ్చిగా తిరగటం, ఏ ఒంటిగంటకో అన్నం తినటం, ఎప్పుడు తలిస్తే అప్పుడు నిద్ర—ఆహారం—

(60-వ పేజీ చూడండి)

# హరి వంశము

## సాందీపని పర్వము—2

గర్గాది భూసురోత్తమ
వర్గముచే నుపనయనము వసుదేవుడు స
న్మార్గంబున జేయించెను
నిర్గర్వ చరిత్రలకును నిజపుత్రులకున్.

— భాగవతము.

"తండ్రి! రామ! తండ్రి! కృష్ణ! మీకు ఇప్పుడు ఉపనయనం తల పెట్టినానయ్యా! గర్గాది భూసురోత్తమప్రకరంతోను, ఉగ్రసేనాది యదు వృద్ధులతోను మాట్లాడి ముహూర్తాలు నిర్ణయింపజేస్తాను. తండ్రి! ఇది మీకు సమ్మతమా! రోహిణి! ఇట్లా చేయమంటావా! ఓయి! నంద! తల్లి! యశోద! మీరు తండ్రుల ఈ ఉపనయనం అయ్యేడిదాకా ఇందే ఉండవలెను సుమా! అంతా బాగావుంటే ఎప్పుడో జరుగవలసిన సంస్కారం ఇది. అట్లా జరగలేదు. దైవం వేరు విధంగా తలచి, ఇంత దాకా శిశువులు ద్విజసంస్కారాదికాలు లేక అడవులలో అజ్ఞాతవాసం చేయ వలసివచ్చింది. రోహిణి! ఆ బాధలన్నీ నీవు పడ్డావు నందుడును, యశోదయు పడ్డారు త్రేతలో రామచంద్రమూర్తి ఒక్క అరణ్యవాసమే చేసినాడు కాని, నా బిడ్డలు అరణ్యవాసముతోపాటు, అజ్ఞాతవాసమును గూడ చేసినారు. సరే! ఇప్పు డెందుకు అవి అన్నీ. ఆ కష్టము లన్నీ తీరినవి. ఇప్పుడు ఈ ఉపనయనం తలపెట్టినాను. మీరు ఏమి అంటారు. ?

వసుదేవుని ఈ మాటలు వినగా రోహిణికి నవ్వు వచ్చింది శ్రీ కృష్ణ దేవుడునూ, బలరాముడును మెల్లన హసించినారు. రోహిణి అన్నది :

"స్వామీ! మీరు ఇంతగా చెప్పవలయునా! అంతయు మీ తలంపు ప్రకారమే జరగవలెను అని అంతా అనుకుంటున్నారు. మహర్షి గర్గులను పిలి పించండి. యదువృద్ధులతో సంప్రదించండి. ముహూర్తములు నిర్ణయిం చండి. అప్పుడు యీ వటుమూర్తులను చూచి సర్వ యదులోకము సంతో షిస్తుంది."

"సాధు! రోహిణి! సాధు! నీ మాట ప్రకారమే జరిపిస్తాను."

తిరిగి వసుదేవుడు బయలుదేరినాడు ఆయన రథము సర్వ యదు వృష్ణ్యంధకాదిక్షత్రప్రవరుల ఇండ్లకును పోయి వచ్చినది. ఆయన యీ విషయమును గూర్చి అందరితోడను మాట్లాడినాడు. వసుదేవునకు దేవ భాగుడు, దేవశ్రవుడు, అనాదృష్టి అనువారు తమ్ములు. వారిలో దేవభాగు డన్న వసుదేవునకు ప్రేమయు, గౌరవమును. ఆయన దేవభాగునితో అన్నాడు. దేవభాగ! ఇంతవరకు ఉద్ధవునకు ఉపనయనమును జరుపక నా బిడ్డల కోసముగా ఆపినావు ఇప్పుడు వానికి గూడ ఉపనయనము జరిపించు. బిడ్డ లందరకు ఒక్క ముహూర్తముననే ఉపనయనములు జరిపిద్దాము. నేను సత్యకునితో గూడా ఇదే మాట చెప్పినాను. సాత్యకికి గూడా ఉప నయనము చేయమన్నాను. సత్యకుడు. వాడు ఇంకను పసివాడు—అన్నాడు. నేను—అయితే యేమి! ఉపనయనమునకు వయస్సు అడ్డమా!— అన్నాను. సత్యకుడు—సరియే నన్నాడు. రేపు యదుసంసత్తులో అన్ని విషయములు మాట్లాడుకొనవచ్చును. గర్గులకు గూడ కబురు పెట్టినాను."

ఆ మరునాడు యదుసంసత్తులో వసుదేవుడు తిరిగి యదుకుమారుల ఉపనయవృత్తాంతమును గూర్చి మాట్లాడినాడు : యదుప్రవరులు నా యీ మాట వినాలి. నా బిడ్డలు జననం మొదలుగా ఆలలో పెరిగి సంస్కా రము, ఆచారము, ఘనవిద్యాగ్రహణము లేక అడవిని కారెక్కు చందంగా విహరించగా కాలం గడిచిపోయింది. సమ్యగ్గురూపాసనంవల్ల ఆ సర్వాన్ని గ్రహించాలి అంటే, అంధుకు ముందు ఉపనయన సంస్కారం జరపవలసి ఉన్నది. పిల్లలేమో ఇప్పుడు యౌవనస్థులు. అట్టి యెడల ధర్మం ఏమి అంటున్నది ? గర్గులను అడిగి చూచినాను. ఆయన వెంటనే ఉపనయనం జరపడం శాస్త్రసమ్మతము అన్నారు. ఆయన మహర్షి. సర్వ యదు లోకానికి పురోహితులు. మాకు గురువులు. వారి మాటను మేము పాటి స్తున్నాము. మహారాజ! ఉగ్రసేన! మనుమలను ఇప్పుడు మీరు అనుగ్ర హించాలి. యాదవ వృద్ధు లందరు ఇందుకు సమ్మతిస్తారనే అనుకుంటాను."

వసుదేవుడు ఆగినాడు. సర్వ యదులోకవృద్ధులను — కన్నులతో వ్యక్తిని వ్యక్తినిగా తిలకించినాడు. ఎవ్వరూ ఇక్కడ ధర్మవ్యత్యయం జరిగి నట్లు భావించడం లేదు. ఆ భావమును వారి ముఖములలోనే వసుదేవుడు చూడగలిగినాడు. అయినా వారిని సంబోధించి యిట్లా అన్నాడు :

"సభవారు ఏమి అంటారు ?"

సభలో ఎవ్వరు ఏమీ అనలేదు. అంధకుడు నవ్వుతూ లేచి, ఆ అందరి వాక్కును పోలి ఇట్లా అన్నాడు. తాత! వసుదేవ! నీవు ఇంతగా చెప్ప వలయునా ? నీ శిశువులు అందరి శిశువుల వంటివారు కారు. వారి యెడల ఏది ధర్మము ? ఏది అధర్మము ? అని నిర్ణయం చేయగల శక్తి గూడ ఈ సంసత్తుకు లేదు. నీవు తెలియని వాడవా! నీవు సంప్రదాయజ్ఞుడవు. ధర్మజ్ఞుడవు, ఆచారజ్ఞుడవు కనుక యిట్లా ఆడినావు. సంసత్తు నీ అభిప్రాయ మును సంభావనం చేస్తున్నది."

అంధకుడు ఆ మాట అనినంతలో వసుదేవునిలో విచిత్రమైన కద లిక ఏదో కల్గినది ఆయన ముఖము దీప్తిమంత మైనది. ఆయన తిరిగి ఇట్లా అన్నాడు· అంధక! అంధక! తాత! తాత! ఈ బిడ్డలు నా బిడ్డలా! నేను వారికి తండ్రినా! వారు సర్వలోకములకు తండ్రులు, సర్వలోకములకు బిడ్డలు ఆర్తులయిన జనులను రక్షించడానికి ఆర్తితో అవతారం ఎత్తినవాళ్ళు. దేవతలకు మిమ్మల్ని రక్షిస్తాము లని వరం ఇచ్చి ఆ వరాన్ని పాలించుకొనడానికి వచ్చిన కారణజన్ములు. నన్ను ఈ సంసారం లోంచి ఉద్ధరించడానికి నాకు పుత్రులయి ఉదయించారు నాకు పుత్రు లుగా పుట్టగలమని మాట ఇచ్చి, ఇట్లా నాకు పుత్రులై కృతావిష్కారు లైనారు. నిజమునకు నాకు వారు పుత్రులు ఏమిటి ? వారు సర్వభూాత మయులు, సర్వభూతాంతస్థితులు. యదువుయొక్క శాపంవలన నా కులం అభిభూతం అయిపోయింది. ఆ కులాన్ని యిప్పుడు పవిత్రం చేయడం కోసం ఇట్లా వచ్చారు. యజ్ఞమువారు, ఇజ్యము వారు వారు సర్వదేవమయులు. యజ్ఞములు, యష్టలువారు యజ్వలకు పరమేశ్వరులు

హరిత శివానంద

వారు. లోకంలో దుర్వృత్తులను నిధనం చెందించడం కోసం నా యింటిలో పుట్టినారు. ఈ పుట్టడం పరమహాస్యంగా లేదా! నేను ఎవడను? వారు ఎవ్వరు? ఇది యేదో అంతా మహా అపహ్నవం పోలికగా ఉంటుంది. దేవకికి సంతానం కలిమివలన ప్రీతి కల్గించడంకోసం ఇట్లా పుట్టారా? ఇది గూడా అత్యంతము విడంబనమే. సర్వభూతములకు కర్తలు, సర్వ భూతములకు భర్తలు, సర్వభూతములకు హర్తలు, ఆదిమధ్యాంతములు లేనివారు—ఈ పుట్టుక యేమిటి? ఇట్టి వారిని ఏ జిహ్వతో నేను పుత్రులు అంటాను. వారు ఎట్లా మనుష్యదేహధారులై పుట్టారు? తాత! అంధక! ఇదీ అవతారమయ్యా! నాకు పుత్రులై ఇట్లా వారు అంశావతారకరణులైనారు. నేను మాయావిమోహితుడనై, వారిని నా పుత్రకులు అనుకుంటున్నాను. కంసునకు భయపడి వారిని గోకులంలో వదిలిపెట్టాను. అక్కడ వారు వృద్ధిపొందారు. నాలో యీ మమత పోలేదు. సాక్షాత్తు పరమేశ్వరమూర్తులె నా యింట్లో శిశువులని తెలిసి గూడా నేను మోహితుణ్ణి అవుతున్నాను. ఎంత భగవంతుడైనా, మానవ జన్మ ఎత్తగా, అవధిభూతు డవుతున్నాడు. మనుష్యుడే అవుతున్నాడు. కులం, గోత్రం, వర్ణం, అన్నీ ఏర్పడు తున్నాయి. అందుకే ఉపనయనాదిక సంస్కారాలు అవసర మవుతున్నాయి. ఇది ధర్మం. ఎప్పుడో నేను ఈ ధర్మాన్ని పాలించి ఉండవలసింది. కంసుని భయంవలన పాలించలేక పోయినాను.

నా పుత్రులు వారు అని చెప్పుకోలేక పోయినాను. ఇక్కడ ధర్మ వ్యతిక్రమం జరగలేదంటారా ? అందుకే మీ అనుజ్ఞ కోరుతున్నాను. గర్గాది భూసురవర్గం అనుగ్రహాన్ని కోరుతున్నాను. నేను ఇట్లా భావించడం మాయలో పడిన జీవుణ్ణికావడం అంటారు. ఈ శరీరాన్ని ధరిస్తున్నంత వరకు అది తప్పదు. ఇక్కడ ఎరుకతో సంబంధం లేదు. లోక వృత్తం అట్టిది. దానిని కాదనడం నా పద్ధతి కాదు. లోకవృత్తం ధర్మానుసంధితమై వుంది. ఆ ధర్మాన్ని నేను కోరుతున్నాను. ఆ ధర్మమునందు తండ్రిగా, నేను వ్యభిచారభావుడనైనాను. అందుకు మీ యందరి అనుజ్ఞతో ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాను."

సభ అంతా నిస్తబ్ధమై ఆయన మాటలను ఆలకించింది. ఆయన మాటలను అవును, కాదు, అనలేకపోయింది. అప్పుడు గర్గుడు అన్నాడు. తాత ! వసుదేవ ! సభ నీ ప్రార్థనాన్ని విన్నది. నీకు అనుజ్ఞ ఇస్తున్నది." సభలో అందరు ఆయన తీర్పును అవును అన్నట్లు శిరఃకంపన మాత్రంగా అంగీకారాలను తెలియజేసినారు. ఆ వెంటనే శ్రీ కృష్ణ బలరామ ఉపనయన సంస్కారప్రయత్నములు ప్రారంభమైనవి. ఉగ్రసేనుడు సర్వ సామంతులను, సర్వులయిన బంధువులను తోడితేరగా దూతలను శుభలేఖలతో పుచ్చినాడు. వసుదేవుడు స్వయముగా పోయి తన బావ మరుదులను దేవవంతసుదేవులను, ఉపదేవదేవరక్షితులను పిలిచినాడు. వీరు దేవకికి సోదరులు ఉగ్రసేనుని అన్నగారు దేవకుని పుత్రులు. కంసుని ఆడగములు పడలేక ఇతరప్రాంతములకు పోయి అక్కడ రాజ్యములను ఏర్పరచు కున్నారు. వారును వసుదేవునితోనే బయలుదేరి వచ్చినారు. బాహ్లికుని పిలిచి వచ్చుటకు వసుదేవుడు దేవభాగుని పంపించినాడు. మరియు ఇతరులను పంపి తన చెలియండ్రను, వారి భర్తలను పిలిపించినాడు. పృథను ఒక్కర్తెను పిలుచుట పడలేదు. పాండురాజు వానప్రస్థుడై ఎచ్చటనో హిమవత్పర్వతారణ్యములలో గడుపుచున్నాడు. మరి వారు రారు. అదియే వసుదేవునకు విచార మైనది. ఆయనకు తన చెలియండ్రలో పృథ యన్న ప్రేమ. ఆమెను తన తండ్రి శూరసేనుడు, ఆయనకు కూర్చు మిత్రము, పోరాని చుట్టము అయిన కుంతిభోజునకు పెంపు ఇచ్చినాడు. ఆమె కుంతి యైనది. ఆమెను కురువీరుడు పాండురాజు పెండ్లి యైనాడు. పాండురాజు ఏమి పాండురాజు ! సర్వ వసుధను జయించి అంధుడైన అన్నకు ఇచ్చివేసినాడు. ఆ తర్వాత వానప్రస్థుడైనాడు. కుంతి గూడా ఆయనతో అడవులకు పోయినది. ఆమెకు యిప్పుడు ముగ్గురు బిడ్డలని మాత్రము తెలిసినది. ఆమె ఆ బిడ్డలతో ఈ శుభకార్యమునకు వచ్చిన ఎంత బాగుండును !

కుంతిరాదు. శ్రుతదేవ వచ్చినది. ఆమెతో కేకయేశ్వరుడు గూడ వచ్చినాడు. ఈ దంపతుల చరిత్ర తనకు దయనీయం అనిపించింది. వారికి లేకలేక ఒక్క పుత్రుడు పుట్టినాడు. వాడు లేచిపోయినాడు. నిషాదులలో కలిసి ఏకలవ్యుడై వారికి రాజుగా ఉంటున్నాడు. అది గూడా ఒక నయమే. కాని శ్రుతశ్రవస సంతానం అట్లా కాదు. మరి ఆమె భర్త దమఘోషుడు విగతరోషుడు. చేదికి అధీశుడు. వానికి ఉదగ్ర అరిభటాభీలుడు, అమిత రోషుడు, శిశుపాలుడు జన్మించాడు. ఇప్పుడు వారు వానితో గూడ మధురకు వచ్చినారు. శృతకీర్తి వచ్చింది. ఆమెను తన తండ్రి కరూశాధిపతి యైన వృద్ధశర్మకు ఇచ్చినాడు. వారికి దంతవక్త్రుడు పుట్టినాడు. వసుదేవునకు ఆ శిశుపాల దంతవక్త్రులను చూడగా, అది యేదో భావం కల్గింది. పైకి అనలేదు గాని, వీరు రావణ కుంభకర్ణులా ! హిరణ్యాక్ష హిరణ్యకశిపులా ! అని మనస్సులో అనుకున్నాడు. రాజాధిదేవి తన చెలియండ్రలో చిన్నది. ఆమెను అవంతిరాజునకు ఇచ్చినారు. ఇప్పుడు ఆమెకు ఇద్దరు బిడ్డలు. విందుడు, అనువిందుడు, వారి పేర్లు. వారు ఇంకను శిశువులు.

శ్రుతశ్రవ వచ్చిన దగ్గరినుండియు శ్రీకృష్ణుణ్ణి గురించి అదో విధంగా చూస్తున్నది. అదోవిధంగా ప్రవర్తిస్తున్నది. అది భయమో ?! భక్తియో ?! ఎప్పుడును తన పిల్లవానిని శిశుపాలుని అతనివున్న యెడకు పోనీయవద్దని తన భర్తను బ్రతిమలాడుకొన్నది. అది ఎందుకో దమఘోషునకు అర్థము కాలేదు. కాని శిశుపాలుడు వట్టి మనిషికాడు. వానికి ఎందుకో శ్రీ కృష్ణ బలరాములను చూడగా అసహ్యమైనది. దంతవక్త్రునితో వానికి చెలిమి అయినది. రామ కృష్ణులు వారిని పట్టించుకొనలేదు. శిశుపాల దంతవక్త్రులు వారిని పట్టించుకొనక వదలలేదు. దమఘోషునకు ఇది అర్థము కాలేదు.

ఆ అర్థమైనది రోహిణి. శ్రుతదేవకు శిశుపాలుడు పుట్టగా, దమఘోషుడు



చిత్రకారుడు—ఎమ్. సుందరరావు (విజయనగరం)

అతనిని మగధకు రాజైన జరాసంధునకు కొడుకుగా ఇచ్చినాడు. శ్రీ కృష్ణుడు ఆ జరాసంధుని అల్లుని కంసుని చంపినాడు. శ్రీ కృష్ణునియందు శిశుపాలుని వైరమునకు ఇది కారణం అనుకొన్నది రోహిణి. రోహిణి శ్రుత దేవతో రహస్యముగా నన్నది : ఏమి ! ఆడుపడుచ ! మీ శిశుపాలునకు నీ చాలికలేదు. దమఘోషునితో పోలికలేదు. పెంపుడు పోయినాడు గదా ! జరాసంధుని గుణములు అబ్బినట్లున్నవి. పరమ ఉద్ధతుడుగా వున్నాడు. "శ్రుతదేవ భయపడినది. "వదినె ! మా సునీథుడు ఏమి చేసినాడు ?" అన్నది. "సునీథుడెవరే ?" అన్నది రోహిణి. "శిశుపాలుడే." నేను వానికి ఆపేరు పెట్టుకున్నాను. తండ్రియేమో వానిని "శిశుపాలుడన్నారు" అన్నది శ్రుతదేవ. ఆ కుర్రవానిని గూర్చిన ఏదో వేదన శ్రుతదేవలో వున్నది. "శ్రుతదేవ ! నీవు వీనినిగూర్చి ఏదో దుఃఖమును పెట్టుకున్నావు ! నేను అడగవచ్చునా ! పెద్ద దానను" అన్నది రోహిణి. శ్రుతదేవకు అప్పుడు ఏడుపువచ్చినది. "వదినె ! ఏమి చెప్పను. నాకును, దాదికిని తప్ప మరి యొకరికి తెలియని సంగతి ఇది. శిశుపాలుడు పుట్టినప్పుడు వికృతియై పుట్టినాడు. ఎక్కువ చేతుల్లు, ఎక్కువ కన్ను, నుదుటను కొమ్ము. ఇది ఏమి సంతానము అని నేను వలవల ఏడ్చినాను. దాది తప్ప నాతో అప్పుడు ఎవ్వరునులేరు. అప్పుడు వదిన దేవకి తండ్రినికన్న రోజులు. కంసుని దురితములను గూర్చి మీ తమ్ముడు నాతో చెబుతూ వుండేవారు. ఒక్క రోజున వారు అన్నారు గదా : శ్రుతదేవ ! మన దేవకి భగవంతుణ్ణి ప్రసవించినదే. మీ అన్న కడు అసాధ్యుడు. శిశు పరివర్తనం జరిపించినాడట. నందుని ఎరుగుదువుగదా ! అతని భార్య యశోద శిశువును తెచ్చి దేవకి ఒడిలోపెట్టి, దేవకిబిడ్డను యశోద ప్రక్కలోపెట్టి వచ్చినాడట. ఇది ఏమో దేవరహస్యము. నారదులు నాకు చెప్పినారు. నీకు చెప్పమన్నారు. కష్టం కల్గినప్పుడు ఆ శిశువును తలుచుకో. తలచుకుంటే శుభం జరుగుతుందన్నారు నారదులు. అప్పుడు నేను ఆ కష్టంలో దేవకి శిశువును తలచుకున్నాను. అది అంతా నాకు ఇప్పటికీ విచిత్రం అనిపిస్తుంది. వదిన ! నేను అప్పుడు మనస్సులో ఇట్లా అనుకున్నాను. దేవకీనందన ! నేను కష్టంలో వున్నాను. నాకు ఈ విచిత్రపు శిశువు కల్గింది. నన్ను రక్షించు. దేవకీనందనుడు నన్ను రక్షించినాడు. ఆ శిశువు వికారము అప్పుడు పోయినది. వానిని నేను సునీథుడు అన్నాను. మరి ఈ వేదన ఎందుకంటావు ? వదిన ! వీడు, ఈ శిశుపాలుడు నాకు బిడ్డయే. కాని రాక్షసుడు. వాడు పుట్టగా నాకు ఆభావమే కల్గినది. తర్వాత ఒకసారి నారదులు గూడ నాతో అమాటే అన్నారు. శిశుపాలుని జన్మ వికారములను అగోచరం చేసినవాడే, వానిని కాలగోచరుణ్ణి గూడా చేస్తాడు అన్నారు. వదిన !......

శ్రుతదేవ వలవలా ఏడ్చినది. రోహిణికి ఆమె అనిన జాలి కల్గినది.



[redacted]



ఇతరేతర ప్రాణులకు, మానవకోటికి ఉన్న భేదమల్లా మాట్లాడడం ఒక్కటే. మాట్లాడడం సహజం. మాట్లాడకుండా ఉండడం అసహజం. అయితే మాట్లాడడంలో పరమార్థం ఏమిటి? తద్వారా మానవుడు సాధించగోరే ప్రయోజనం ఏమిటి? అన్న ప్రశ్నలు ఉత్పన్నం అవుతాయి. అతి సర్వత్ర వర్జయేత్ అన్ననానుడి ననుసరించి అసలు మాట్లాడకుండా ఉండడమూ మంచిది కాదుకదా? మాట్లాడక పోవడంకన్న మాట్లాడడమే మేలేమో! మగవారు అయినా, మగువలే అయినా వైయక్తికమైన అనుభవదృష్ట్యా నిర్ణయించుకోవలసిన అంశమిది.

మాట్లాడటం మానవ లక్షణం అయితే, అతిగా మాట్లాడటం అతివ లక్షణం. కాదు, కూడదని సమర్థించుకోవాలని చూసినా కటకటా సెగటం కష్టం!

ఇంటర్‌లో ఒక వ్యాసం చదివాను. 'మౌనం మానవుడికి అసహజం' అంటూ ప్రారంభించాడాయన. కొన్వర్సును అవలోకిస్తూ 'మౌనం ఆడవాళ్ళకు సహజమనేగా ఆయన వుద్దేశం! పెద్దవాళ్ళెపుడూ చెడ్డవాళ్ళు కాదంటారు ఇందుకే మాశావా? మన మంచితనాన్ని గుర్తించినవాళ్ళు ఒకరైనా వున్నారు కదా?' అంటూ వ్యంగ్యంగా ఛలోక్తి విసిరింది సోదరి. 'సైలెన్స ఈజ్ గోల్డెన్' అనే ఇంగ్లీష్ సామెత తెలియని వాళ్ళుండరు కదా?

సామెత మాటకేంగాని, మాటలాడకుండా మనకు క్షణం గడవదు. మానవస్వభావమే అంత. కాకపోతే మనం మరో మెట్టు పైకి! ఆ మాటకొస్తే మాటలంటే మక్కువ లేనిది ఎవరికి? పుట్టినవెంటనే 'కేరు' మని శబ్దం చెయ్యందే తోచదు. మరోలోకం నుంచి వచ్చిన ప్రాణికికూడా మౌనంగా వుండటానికి మనస్కరించదు. మానవులదాకా ఎందుకు?

మందరపు లలిత

మాటలురాని పశుపక్ష్యాదులు సహితం నోరు మూసుకు కూర్చోవు కదా? ఆవు 'అంబా' అనకపోతేనేం, పక్షులు కిలకిలారవాలు చేయకపోతేనేం? గలగలమనిపారే సెలయేరులో అందం ఎందులో వుంది? 'కుహూ, కుహూ' మనే కోయిల మౌనం దాలిస్తే మరేమన్నా వుందా?

మౌనంలో భయం వేసే ఏదో గాంభీర్యత! రాత్రివేళ చీమ చిటుక్కుమన్నా వులిక్కిపడతాం. మౌనం ముసుగు వేసుకుని వచ్చి చక్కా జడిపించిపోతుంది. అపరరాత్రి వేళ నిశ్శబ్దం మరింత భయంకరంగానూ, ప్రాణాంతకంగానూ వుంటుంది.

'మౌనం అర్ధాంగీకారం' అన్నారు పెద్దలు. లెక్కలు ఇటు కళకూ, అటు శాస్త్రానికి ఎలా చెందుతుందో అలానే మౌనం గబ్బిలంలా అంగీకారం, అనంగీకారం రెండూ తెలుపుతుంది. ఈసైడు అంగీకారం, ప్లేటు తరగేస్తే అనంగీకారం! వహ్వా! ఏం జాణతనం!

అలాగని ఏకాంతంలోని ప్రశాంతతను ఆరాధించని వాళ్లు ఎవరూ వుండరు. మనసులోని గాయాలను మటుమాయం చేసే మందు ఏకాంతత ప్రసాదించదూ? మౌనంలో ఏదో అనిర్వచనీయానందం, సంతృప్తి వెల్లి విరుస్తుంది. దేవాలయాలలోని రణగొణధ్వని కన్నా, చర్చిలోని నిశ్శబ్ద వాతావరణం దైవ సాన్నిధ్యాన్ని మరింత సన్నిహితం చేస్తుంది.

కొన్ని సందర్భాలలో మాటలకంటే మౌనమే మనభావాలను ఘాటుగా వ్యక్తపరుస్తుంది. తిరస్కారాన్ని, నిర్లక్ష్యాన్ని వెల్లడిచేయటంలో మౌనానికున్న మహత్తరశక్తి మాటలకు ఏది? సిగ్గునూ, గౌరవాన్ని, ఒకటేమిటి సమస్తాన్ని మౌనంలో దాచుకోవచ్చు. మరోమాటలో చెప్పాలంటే మౌనం వజ్రాయుధం లాంటిది. గోడమీది పిల్లివాటంగా, రాజకీయవేత్తలా వ్యవహరించటం మౌనానికితప్ప మరిదేనికిసాధ్యం? లౌకికంగా తప్పుకోడానికి ఇంతకన్నా చక్కని మార్గం మరేముంది?

ఒక రాజుగారిదగ్గరకు, గొప్ప పండితుడని ఒక తెలివికలవాడిని పట్టుకొచ్చారు. వీరైతే వారు ఎలాంటి సందేహానికైనా మౌనంగానే సమాధానం ఇస్తారు, తప్పమాట్లాడరని శిష్యులు




ఇంట్రడ్యూస్ చేశారట. ఆ రాజుగారికి ఎన్నాళ్లనుంచో ఒక సందేహం పీడిస్తున్నది. అందుకని చేత్తో గుండ్రంగా చూపించి, ముందు ఒక్క వేలు, తర్వాత రెండు వేళ్ళు చూపించి మౌనంగా ప్రశ్న వేశాడు. దానికి జవాబుగా అతను తకీమని ఒక్క వేలే చూపించేసరికి రాజుగారు సంతోషంతో వుక్కిరిబిక్కిరయి అమాంతం కౌగలించుకుని ధనకనక వస్తు వాహనాలతో సత్కరించి పంపేరట. తీరా చూస్తే రాజుగారి ప్రశ్న ఒకటి, జవాబు మరొకటి! 'ప్రపంచాన్ని పాలించే దేవుడు ఒకడా, ఇద్దరా' అని రాజుగారి సందేహం అయితే, రాజుగారు తన గానుగెద్దులగురించి అడిగారనుకుని 'నాకు వున్నది ఒకటే ఐతే రెండని ఎలా చెప్పను?' అని నిబ్బరంగా ఒక్క వేలే చూపించాడా గురువు. అదే మాటల్లో చెప్పితే ఏమయ్యేదో ఆలోచించండి! సన్మానం మాట దేవుడెఱుగు, స్మశానం చూసుకోవాల్సివచ్చేదేమో కదా!

మౌనాన్ని విధిగా పాటించాల్సిన అవసరాలుకూడా కొన్ని వున్నాయి. సభలలో, వుపన్యాసకుడి ధోరణి వుపన్యాసకుడిది. మన ధోరణి మనది అయితే ఎలా చెప్పండి? పందిళ్ళలో పదిన్నర డాన్సుకు ఆనక సీటు దొరకదని అడ్వాన్సు బుకింగ్ చేసుకోవడానికి విధి లేక పాటకచేరి (లేక ప్రసంగం)లో కూలబడిన ముత్తయిదువలు వింటే విన్నారు లేకపోతే లేదు కాని తలో కబురూ చెప్పుకుపోతూ కూర్చుంటే వినేవాళ్ళకి ఎంత ఇబ్బంది! 'కాస్త విననీయండమ్మా' అని మొఱ పెట్టుకున్నా 'వుండవమ్మా మధ్య నీగోలేంటి? ఎన్నాళ్ళకో ఇప్పటికి తీరిక చిక్కిందికదాని మేమో సరదాగా కూర్చుంటే మాట్లాడుకో నియ్యవేంటి?' అని కసురుకునేవాళ్ళు లేకపోలేదు. కొన్ని ఆశ్రమాలలో భోజనాలగదిలో విధిగా మౌనాన్ని పాటించాలి. మీరు కావల్సి వచ్చినా చేత్తోనే చూపించాలట. అది కొంచెం చిక్కే అయినా, అంతమంది 'ఇది కావాలి', 'అది కావాలి' అని గోలపెడుతుంటే కాకిగోలలా వుండదూ?

ఇంట్లోకూడా ఇరవైనాలుగు గంటలూ ఏదో గొడవచేస్తూనే వుంటే మాత్రం ఏం బాగుంటుంది? సెలవు లొచ్చాయంటే పిల్లలున్న ఇంట్లో దడదడే ననుకోండి! ఇల్లుపీకి పందిరేస్తూనే వుంటారు. వాళ్ళను అదలించటానికి మరికొంతగోల! మాటలలో పాకం మనని మహా ఏడిపిస్తుంది, ఆ రోజు గడిచేదాకా. చనిపోయిన వారి ఆత్మశాంతికి మౌనంగా వుండటం అలవాటు. వారి ఆత్మశాంతి మాటకేంగాని మనకైనా ఒకక్షణం ఆత్మశాంతి చిక్కుతుంది. ఆ మాట అక్షరాలా నిజం!

ఇంటికొచ్చేవాళ్ళతో ముక్తసరిగా మూడే మాటలు మాట్లాడటంకూడా భావ్యంకాదు. ఈమధ్యనే ఇంతవరకు చూడని చుట్టాలింటికి వెళ్ళాను. వెళ్ళగానే పలకరించి, కాఫీ, టిఫిన్ ఇచ్చారు. ఆ తర్వాత నా చుట్టూ కూర్చున్నారు. మఱి అంతే! ఎవరినోటంటా

మాట పెగలదు. ఆ మౌనాన్ని భరించలేక నేనే ఏదో సంభాషణ కదిపాను. మూకీ చిత్రంలోని బొమ్మలా అటూ, ఇటూ తిరుగుతున్న అమ్మాయిని చూసి 'అమ్మాయిలెంత మంది?' అనడిగాను. 'ఇద్దరు' టక్కుమని సమాధానం వచ్చేసింది. మళ్ళా యథాప్రకారమే! సరే ఇంక లాభంలేదనుకుని 'అబ్బాయిలో?' అనడిగాను. 'ఇద్దరు' అంది ఆవిడ మరోసారి ముక్తసరిగా. ఇదీ తీరు! అబ్బాయిలేం చదువుతున్నారో, అమ్మాయిలేం చేస్తున్నారో, ఏవో కాసిని కబుర్లు కమ్మగా చెప్పకపోతే వచ్చిన వాళ్ళ పరిస్థితి ఎలా వుంటుందో ఆలోచించండి! నామటుకు నేను ముళ్ళమీద కూర్చున్నట్టు కాస్సేపు కూర్చుని బయటపడ్డాను. ఆ సమయంలో నిశ్శబ్దాన్ని మాత్రం నేను భరించలేకపోయానంటే నమ్మండి!

మౌనవ్రతాన్ని పాటిస్తే ఆయుస్సు పెరుగుతుందంటారు. ఆ మాట నిజమెలా అవుతుంది కాని, మన నిగ్రహశక్తిని చక్కగా పరీక్షించుకోవచ్చు. కొంతమంది బాబాలకు వారి మౌనవ్రతంద్వారానే బ్రహ్మాండమైన ప్రచారం లభిస్తుంది. పెద్దవాళ్ళంతా కూడా

## సైలెన్స్!

ఈ నియమాన్ని పాటిస్తూనే వుంటారు ముఖ్యంగా ఆశ్రమాలలో.

ఒక కాలేజి స్టూడెంటు ప్రతి శుక్రవారం ఎవరితోనూ మాట్లాడేది కాదు. ఆ రోజు ఏ లెక్చరర్ ప్రశ్నలు వేసినా బెల్లంకొట్టిన రాయిలా నించుంటుంది. ఆ అమ్మాయి కాలేజి చేరిన క్రొత్తలో, ఒకానొక లెక్చరర్ ఆ అమ్మాయిని ప్రశ్నించి ఎంతకీ సమాధానం రాబట్టలేక కోపంతో ప్రిన్సిపాల్ కు రిపోర్టు చేసిందని వినికిడి! ఆ తర్వాత అసలు విషయం బయటపడిం దనుకోండి! అందుకే ఏ సందర్భంలో మాట్లాడాలో, ఏ సందర్భంలో మౌనం వహించటం మంచిదో మెదడు వడగాలి. 'డ డ డా' పాటలోని 'లోకపుతీరు తెలియగా లౌకికజ్ఞానం ప్రధానమోయ్' అన్న సంగతి ముమ్మాటికీ నిజం! వీలూ చాలూ చూసుకోకుండా మౌనవ్రతం పడితే చిక్కే కాదూ మరి! సంజ్ఞలతో నలుగురినీ సతాయించకుండా మౌనంపాటించగలిగితే మంచిదే! ఆడవాళ్ళు మూగనోము పట్టుకుని ముచ్చట తీర్చుకుంటారు. అదో తమాషా!

ఆడవాళ్ళమీద అభాండం వేశారు కదా మరి మొగవాళ్ళుమాత్రం తక్కువేం తిని పోయారూ అని? వాళ్ళూ మనకు మాటల్లో పోటీ పడుతూనే వున్నారు. ఆరునెలలు సావాసంచేస్తే వారు వీరవుతారని సామెత. అలాంటిది ఆజన్మాంత సావాసంలో ఎక్కువ తక్కువలకు ఆస్కారంఏది? నిజం చెప్పాలంటే, మగవాళ్ళకి అన్నింటిలోనూ మనతో పంతే. ఇన్నాళ్ళూ మన జాకెట్టు గుడ్డలు వేఱు, వాళ్ళ షర్టు గుడ్డలు వేఱు. ఇప్పుడు ఏదీ ఆ తేడా? ఆ వారా బుష్ కోట్లంటూ మన వాటిమీద దండెత్తటంలేదూ? అయినా, నోరూ వాయీ లేని వాళ్ళం కాబట్టి అన్నదల్లా నోరెత్తకుండా అనుభవిస్తున్నాం. నోరెక్కువ అంటే ఇంకేం చెయ్యగలం చెప్పండి?

వచ్చినవాడు చచ్చినాపోదు కానీ మౌనం విలువ గుర్తించటంమాత్రం మానకండేం! ఏమంటారు? ఉష్! మాట్లాడకండి—సైలెన్స్!



## చీర అంచు బోర్డరు






జి. రామసూర్య భాస్కరం (ఇందుపల్లి)

# మొల్ల మొగ్గలతో జడపట్టీ




1. పూల జడ 2. జడపట్టి కడ్డి. కొడలు కత్తిరించినది. 8. తలపూల కడ్డీ 4. నాగరం చుట్టుపూల చక్రం వచ్చు ఆకారము. ౫. జడపట్టి.
(1. నీలం ముచ్చుశేకు. 2. పూల కడ్డీ. 8. ఆకుపచ్చ ముచ్చుశేకు. 4. పూల కడీ ౫. జడ పట్టి 6. కొంచెం కడ్డీ. పూలు) 6. జడగొంటాలు.

## జి. ఇందిరాధర్

తరుణలకు కురులే సిరులు, అలాగే కురులకు విరులే సిరులు కూడా అన్న విషయం అందరకూ తెలిసిందే. సోదరీమణులంతా కురులు ముడుచుకోవటమే చెబుతున్నారు గాని విరులు ముడుచుకోవటం చెప్పటంలేదు. ఇక ఈ నెలలో ఘుమ ఘుమమంటూ మల్లెలూ, మొల్లలూ జాజులూ వస్తాయి. ఈ విరులను ముచ్చటగా కూర్చి పేర్చి అమర్చుకుంటే ఎంత సొగసుగానో ఉంటాయి. ఎన్నో రకాల పూల జడలలో ఈ జడ పట్టీ ఒకటి. పూలజడ వేసుకోవాలి అంటే "అబ్బా! నడుములు నొప్పి" అనే అవసరం లేకుండా వేసుకోవచ్చు ఈ జడపట్టీ. కాకపోతే వెయ్యడమే కొంచెం కష్టం.

మొదట మనం జడపట్టీ కుట్టుకోవాలి. చాలా మంది ఒక సన్నని అట్టను మనకు కావలసినంత వెడల్పు, పొడుగు కత్తిరించుకొని దానికి తగినంత వెల్వెట్ బట్టయినా, ఏదన్నా ఒక కంటికి నదురైన బట్ట ఆ అట్ట మూసుకుపోయేటట్లు వెనక వైపు రెండు వరుసలు టాకాలు వేసి కుట్టాలి. ఇక దానిమీద రకరకాలు చమ్కీతోనో, నక్కీతోనో చమ్కీ బిళ్లలతోనో, పూసలతోనో, చిన్నచిన్న ప్లాస్టిక్ బొమ్మలతోనో మనకు ఏవి ఇష్టమైతే వాటితో కుట్టుకోవాలి. ఇప్పుడు జడపట్టీ తయారయిందన్నమాట.

# వెల్లవెఽగ్గలతో జడపట్టీ

ఇక జడపట్టీ కడ్డీలు వేసుకోవాలి. గట్టిగా ఉండే చీపురు పుల్లలు మనం కుట్టుకున్న జడ పట్టీ అంత పొడగు తీసుకొని చివరలు కూసుగా చెక్కాలి. అలాంటివి నాలుగు తయారుగా పెట్టుకోవాలి. ఇక తెచ్చిన జాజులైనా, మొల్లలైనా ఒక పళ్లెంలో నీళ్లు పోసి అందులో వేసుకుంటే బాగా తేలి తీసుకోటానికి వీలుగా ఉంటాయి. మళ్లెలతో గూడా వెయ్యవచ్చు గాని వాటంతట అవి విడి మొనలు తేలి నాజూకుగా ఉండదు. ఇప్పుడు కడ్డీ (చీపురు పుల్ల) తీసుకొని మొగ్గ కొంచెం కడుపులోకి గుచ్చాలి. ఇలాగే ఒక్కొ మొల్ల మొదటి మొగ్గ ఎత్తుకు సరిపోయేటట్లు వత్తి గుచ్చాలి. నాలిగింటికి పూర్తిగా పూలు గుచ్చాక నీళ్లల్లో వేస్తే వాడిపోకుండా తొందరగా పువ్వకుండా ఉంటాయి. ఇప్పుడు సూది సులభంగా దిగేదైనా దొరికితే ఎండిపోయిన అరటి దొన్నయినా జడపట్టీ సైజుది కత్తిరించుకోవాలి. దానికి సరిగ్గా అతికినట్లు ఒక నీలం ముచ్చు రేకు రెండు వైపులా టాకా వెయ్యాలి. ఇప్పుడు దీనిమీద జడపట్టీ కడ్డీలు రెండు తీసుకుని 2 వ బొమ్మలో మాదిరిగా కాడలు కత్తిరించి వాటిని కొంచెంగా ముచ్చు రేకు కనిపించేటట్లు రెండు ప్రక్కలా నిలువుగా పెట్టి మెల్లిగా మొగ్గల మీదుగా మధ్య నించి రెండు పూల కడ్డీలు రెండు పక్కలా టాకాలు వెయ్యాలి. ఇప్పుడు ఆకుపచ్చ ముచ్చుకు మొదటిదాని కన్నా వెడల్పు తక్కువ చేసుకొని, కత్తిరించుకొని పూల మొనలు కనిపించేటట్లు టాకాలు వెయ్యాలి. దానిమీద మళ్లీ కొంచెం ముచ్చురేకు కనిపించేటట్లు మిగతా రెండు పూల కడ్డీలనూ టాకా వేసి వాటి మధ్య జడ పట్టీ పెట్టి దానికి పైనా కిందా కనిపించకుండా టాకాలు వేసుకోవాలి. ఇప్పుడు జడపట్టీ తయారయింది చెప్పితే ఇంత గజిబిజిగా ఉంది గాని 3వ బొమ్మ చూస్తే సులభంగా అర్థం అవుతుంది. వోపిక లేనివాళ్లు ఇదే జడకు టాకాలు వేసి తలలో వత్తుగా గుచ్చిన చెండు తురుముకొని సరిజేసుకుంటారు.

నెత్తికి పూలు వెయ్యాలంటే ఇంకో రకం పూల కడ్డీలు వెయ్యాలి వాటికి ఆరంగుళాల చీపురుపుల్లలు మొనలు కత్తిరించి పెట్టుకోవాలి. వాటికి మొగ్గలు కొంచెం కడుపులోనుంచి కుడి వైపు కొకటి, ఎడమ వైపుకు ఒకటి మధ్యలోకి మళ్లా కుడివైపు కొకటి ఒత్తి గట్టివి విడిపోని మొగ్గ తీసుకొని గుచ్చాలి. 3 వ బొమ్మ చూస్తే బాగా అర్థంఅవుతుం దనుకొంటాను. ఇప్పుడు మనకు కావలసినన్ని కడ్డీలు వేసుకున్నాక నాగరం పెట్టి (రాగిడీ అయినా సరే) పెట్టి బిగుతుగా మన జడ పట్టీ సైజు కొల్చి వేసుకుని కుచ్చులు పెట్టుకోవాలి. నాగరం ఎత్తుగా బిగుతుగా నిలవటానికి ఒక చిన్న బట్ట తీసుకొని నాగరం కిందగా చుట్టూ చుట్టాలి. ఇప్పుడు సూదికి రెండు పోగులతో దార మెక్కించుకొని నెత్తి పూలకడ్డీ చీపురుపుల్ల మధ్యలోకి సూది గుచ్చి రెండోవైపు నోటితో గట్టిగా పట్టుకొని నోటివైపు చివర నున్నపూలను ముందర మెలకువతో తొయ్యాలి. ఇప్పుడు పూలు దారం మీదకు వచ్చేస్తవి. సూదిని తీసుకొని ఆ పూలను నాగరం చుట్టూ బిగుతుగా కట్టాలి. ఇప్పుడు రెండో వరుసకు కూడా అలాగే పూలు సరిపోయేటన్ని ఎక్కించుకొని ఒకదాని మొనలు ఒకదానికి అంటేటట్లు మొదటి వరుసమీద కట్టాలి. ఇలా మన కిష్ట మొచ్చినన్ని చుట్లు తలకు సరిపోయేటన్ని వేసుకోవాలి. ఇప్పుడు ఈ పూలు 4 వ బొమ్మలో ఉన్నట్లు వస్తాయి.

ఇక మిగిలినది జడగొండాలు. దీనికి నెత్తి పూలకడ్డీనే 6 వ బొమ్మలో మాదిరిగా మెలిక వేసి కట్టుకోవాలి. మెలిక దగ్గర కనిపించకుండా దారంతో కట్టాలి. మెలికకు అటూ ఇటూ వచ్చిన కన్నాలలో ఏవయినా ఎర్రటి పూలు పెట్టి జడలో జడ పట్టీమీద 1 వ బొమ్మలో మాదిరిగా అమర్చి టాకాలు వెయ్యాలి. ఇప్పుడు పూలజడ తయారయింది. అన్నట్లు మరిచాను, జడపట్టీ చివరకు సరిపోయేటన్ని పూలు కడ్డీమీదవి తీసుకుని కుట్టాలి. ఇప్పుడు ముచ్చటగా 1 వ బొమ్మలో లాగా చక్కటి జడపట్టీ తయారయింది. వేసి చూడండి, ఎంత బాగుంటుందో మీకే తెలుస్తుంది. రాత్రుళ్లు టాకాలు విప్పి పొడి బట్టలో చుట్టి మర్నాడు పొద్దున్నే పెట్టుకోటానికి కూడా వీలుగా ఉంటుంది. ఇది వేసుకోటానికి పాపలు ఎంతో ముచ్చట పడతారు. వేసి వాళ్ల ముచ్చట చూస్తారుగా ! రెండు రకాల కడ్డీలకూ కాడలు సగానికి కత్తిరించటం మర్చిపోకండి. ★



# వనితా వాణి

## వనితాలోకానికి మణిపూస

శ్రీమతి సరోజినీ రత్నస్వామిగారు వ్రాసిన 'ఆడపిల్లలు—పుట్టిళ్లు' అనే వ్యాసం వనితాలోకమున కొక మణిపూస వంటిది. రచయిత్రి వ్యక్తపరిచినట్లు 'ఎంత తను పుట్టి పెరిగిన గృహమైనా, పుట్టిల్లు స్త్రీకి ఎన్నటికీ స్వగృహము కాదు' అనే విషయం ప్రతి స్త్రీ గుర్తించాలి.

పద్మసుందరి (హైదరాబాద్)

* * *

## భర్తమీద ఆధారపడి ఉంది!

1-2-61 తేదీ పత్రికలో శ్రీమతి సరోజినిగారు "ఆడపిల్లలు—పుట్టిళ్లు" మీద వ్రాసిన వ్యాసం చదివిన తర్వాత నాకూ వ్రాయాలని తోచింది. వారు వ్రాసింది తప్పని నా అభిప్రాయం కాదు. వారు వ్రాసిన దాంట్లో సత్యం లేకపోలేదు.

పెళ్లికాక ముందు ఆడపిల్లలు ఇంట్లో ఎంత ముద్దు ముచ్చటలూ జరిగినా పెళ్లి అయిన తర్వాత తరుచు పుట్టింట్లో ఉంటే తల్లి, తండ్రి ఆదరించినా ఇరుగు పొరుగులూ, బంధువుల పోకడలూ భరించడం కష్టం.

స్త్రీకి పెళ్లయిన తర్వాత అత్తవారింటి పరిస్థితులకు అలవాటు పడటం చాల కష్టమే. అయినా అలవాట్లకు లోనుకావాలి. ఎప్పటికయినా తప్పదు. కాని స్త్రీకి పెళ్లయిన తర్వాత భర్త అనురాగం కలవాడు, భార్యను అర్థం చేసుకున్నవాడూ అయితే స్త్రీ పుట్టింటికి రావలసిన అవసరం ఉండదు. ఎంత కష్టం అయినా భర్త అనురాగంవల్ల మరిచిపోతుంది. కాని భర్త అనురాగం లేనప్పుడు ఎన్ని సుఖాలున్నా జీవితం కష్టంగానే వుంటుంది.

నా సలహా ఏమంటే ప్రతి భర్త భార్యను అర్థం చేసుకొని ఆమెకు ఆ యింట్లో స్థానం ఉందని గ్రహించి ఇంటికి దీపం ఇల్లాలే అని గుర్తించి ఆమెకు ఆనందం చేకూర్చాలి. అలా లేనప్పుడే స్త్రీ అనింట్లో జీవించలేక పుట్టింట్లో ఉండలేక ఆఖరికి ఆత్మహత్యకు కూడా ప్రయత్నిస్తుంది. నా ఉద్దేశం ప్రకారం అన్ని సౌఖ్యాలుండి అనురాగము కల భర్త ఉన్నప్పుడే స్త్రీకి జీవితంమీద ఆశ కలుగుతుంది అది లేనప్పుడు స్త్రీ జీవితం నిరర్థక మంటాను.

ఎన్. లక్ష్మీ నిరాజా (గుంటూరుజిల్లా)

## వచ్చేపోయే బంధువులు, ప్రాణాలు

25—1—61 వ తేదీ పత్రికలో కుమారి సరోజా గారు వ్రాసిన "వచ్చే పోయే బంధువులు—ప్రాణాలు"అన్న వ్యాసం చదివాక వారికి నా హృదయపూర్వక అభివందనలు అందజేయలేకుండా ఉండలేకపోయాను. "వనితాలోకం" శీర్షిక ప్రతి వారం చదువుతున్నప్పటికీ నాకు ఎందుచేతనో నా అభిప్రాయం రాయాలనిపించేదికాదు. కానీ సరోజగారి వ్యాసం చదివాక ఎప్పు డెప్పుడు నా అభివందనలు పత్రిక ద్వారా వారికి అందజేస్తానా అనిపించింది. ఆ వ్యాసం చదువుతున్నంతసేపూ అందులోని ప్రతి వాక్యము ప్రతి పదము అచ్చంగా మా కుటుంబాన్నిగురించే వ్రాశారేమో అనిపించింది. ఇట్లాంటి పరిస్థితులు ఒక్క మా కుటుంబానికేనేమో అనుకున్న నాకు ఈ వ్యాసం చదివాక మాలాంటివారు ఇంకా కొంతమంది ఉన్నారా! అనిపించింది.

అంగర హరిహరబాయమ్మ (హైదరాబాద్)

* * *

## హాస్యాస్పదం

25—1—61 వ తేదీ పత్రిక వనితా లోకంలో ప్రచురింపబడిన "వచ్చేపోయే బంధువులు, ప్రాణాలు" అను వ్యాసం చదువుటకు చాలా హాస్యాస్పదముగా ఉన్నది. కుమారి సరోజగారు చదువుకొని ఉద్యోగము చేస్తూ కూడా ఇటువంటి వ్యాసములు వ్రాయుటఏమంత సమంజసముగా లేదు. ఇటువంటి వ్యాసాలు వ్రాసి బంధువులను న్యూనతపరచవద్దని ప్రార్థన.

శ్రీమతి విజయవరలక్ష్మి (గుడ్లవల్లేరు)

* * *

## గులాబ్ జామ్

25—1—61 వ తేదీ పత్రికలో శ్రీమతి రాజ్యలక్ష్మి జనార్దనంగారు తెలిపినట్టుగా గులాబ్ జామ్ చేసి చూశాము. హోటల్లో మాదిరిగానే కుదిరాయి. కాని, 2, 3 గంటలకు పాకం కొంచెం గట్టిపడి పోయింది. కావున పాకం తయారు చేసేటప్పుడు కొంచెం పటిక వేస్తే గట్టి పడిపోదని తలుస్తాను.

మంగ (కరీంనగరము)

## కేకులు

1—2—61 వ తేదీ పత్రికలో శ్రీమతి విమలా భాస్కర్ గారు వివరించిన విధముగా కేకులు, ఫ్రూట్ కేకులు తయారు చేసినాము. చాలా బాగా కుదిరినది. చాలా రుచిగా అచ్చము హోటల్లోకి మల్లే ఉన్నవి. మా వారు కూడా చాలా మెచ్చుకొని, ప్రతి వారము ఒక పత్రిక తెచ్చి ఇస్తూ ఈ వారపు వంటలు రుచి చూపుతావా అంటారు. కావున ఎవరికైనా పండ్లతో జెల్లీ తయారు చేయుటయు వచ్చిన యెడల వనితావాణి ద్వారా తెలుప కోరుచున్నాము.

ఎస్. పద్మావతి లలేందర్ (బోయిగూడ—సికింద్రాబాద్)

## ఉలెన్ హాండ్ బాగ్

11—1—61 వ తేదీ పత్రికలో కుమారి జి. పద్మావతిగారు వ్రాసిన ఉలెన్ హాండ్ బాగ్ చదివాను. అది నేనూ కుట్టాను. చాలా చక్కగా కుదిరింది. కాని పద్మావతిగారు వ్రాసినట్లు ఒక్క రంగు వూలు కాక రెండు రంగులు కలిపి అల్లిన చక్కగా ఉండును. మన యిష్టము వచ్చిన రంగు వాడవచ్చును. రెండు రంగులు కలిపి కుచ్చుకుచ్చుగా చక్కగా ఉండును. ఒకటి లేతరంగు, మరియొకటి ముదురు రంగు వాడ వచ్చును. నేను తెలుపు, ముక్కుపొడి రంగు వూలు కలిపి కుట్టాను. చాలా చక్కగా కుదిరింది.

కుమారి దోర్నాదుల రాజేశ్వరి (నెల్లూరు)

## విజ్ఞప్తి

నేను క్రొత్తగా ఆంధ్ర సచిత్ర వార పత్రికలను మూడు మాసములనుండి తెప్పించుకొని అన్నింటిని చదువుచున్నాను. ముఖ్యంగా వనితాలోకంయందలి, నా సోదరీమణులు తెల్పుచున్న పిండివంటలు, అల్లికములు, డిజైన్లు మున్నగు వానిని నేనెంతో ఆప్యాయంగా తెలిసికొని ఆచరించుచున్నాను. నాకీ క్రింది వానిని వనితావాణి ద్వారా తెల్పగోరుచున్నాను.

1. ఏవైనా పిండివంటలు మధ్యాహ్నం టిఫెన్ కొరకు పనికివచ్చేవిగా—కనీసం వారం రోజులు నిల్వ ఉండేట్లుగా ఉండాలి.
2. ప్లాస్టిక్ దారాలతో అందమైన వస్తువులను అందంగా అల్లే విధానాలు, డిజైన్లు.

ఆర్. సామ్రాజ్యమ్మ (పెనువాక)

## బంధువులంటే భూతాలకిన్ని భయం

25—1—61 తేదీ పత్రికలో కుమారి సరోజా గారు వ్రాసిన వ్యాసము ("వచ్చేపోయే బంధువులు—ప్రాణాలు") చదివితిని. చాల అనుభవముతో వ్రాసినట్లు తెలుస్తూనే ఉన్నది. నిజముగా ఈ బంధువులతో భరించుట ఈ దినములలో ఎంత కష్టముగా ఉండునో స్వయముగా అనుభవించినవాళ్లకే తెలియును. అటువంటిని ఆ ఏడుకొండలవాడికే తెలియును. భూతాలను చూసి భయపడని మానవులు బంధువులను చూసినంత మాత్రాన మండే ఆగిపోయినంత బాధపడవలసివస్తూ ఉన్నది.

ఎ. ఉమామహేశ్వరి, (భద్రల్, ఒరిస్సా)




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

15-2-61 బుధవారం మొదలు

21-2-61 మంగళవారం వరకు.

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మనోధైర్యం బాగుంటుంది. చిక్కు వ్యవహారాలలో నుంచి బయటపడ గలుగుతారు. మీమాటలలో తప్పులు వెతికేవా రుంటారు. ధన సంబంధమైన ఆదుర్దా క్రమంగా తగ్గుతుంది. బుద్ధిబలంతో కుటుంబ నిర్వహణ కొనసాగించ గలుగుతారు. శుభ కార్యాలనిమిత్తం ఖర్చులు పెరుగుతవి. ఒక పెద్ద మనుష్యునితో చెప్పిన మాటను శ్రమపడి చెల్లించుకోవలసివస్తుంది. అయినవారితో అభిప్రాయ భేదాలు రావటంవల్ల మీరు ప్రస్తుతం ఆరంభించదలచుకున్న పనులకు అంతరాయం వస్తుంది. దుబారా ఖర్చులను తగ్గించుకొనటం అవసరం. బంధుమిత్రులకు రాసే ఉత్తరాలలో పొరబాట్లు రాకుండా చూచుకొనండి. 19, 20 లలో శుభవార్తలు, వస్త్రలాభం.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

తలవనితలంపుగా అంతస్తు పెరుగుతుంది. కార్యభారం అధికంగా ఉన్నా నిరుత్సాహం తోచదు. ప్రయాణాలు చేయవలసి వస్తుంది. మీ ఆరోగ్యాన్నిగురించి జాగ్రత్తగా ఉండవలసిన సమయం. వృత్తిఉద్యోగాలలో తోటివారి ఆదరము, సహాయము లభిస్తవి. మాటలసందర్భంలో కలహాలు రాగల సూచన ఉన్నవి. ఇతరులతో పోటీ పడవలసిన సందర్భాలలో యుక్తితో తప్పించుకోగలుగుతారు. విలువగల వస్తువులు కొంటారు. ధర్మకార్యాలయందు ఆసక్తి కలుగుతుంది. కాని సులభంగా జరుగవు. వ్యవహారవిషయాలలో రాజీ మార్గాన్ని అనుసరించటం అవసరం. 17, 18 లలో ధన ప్రాప్తి. బంధువుల రాక, గౌరవం.

**మిధునం :**

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

పని, పనివల్ల ఉపయోగము సామాన్యంగా ఉన్నా మొదట్లో హడావుడి, శ్రమ మాత్రం విశేషంగా ఉంటవి. అప్పటి కప్పుడు చిక్కులు వచ్చేటట్లు కనిపిస్తుంది. కాని దైవబలంవల్ల తప్పుకో గలుగుతారు. ఖర్చులు బాగా పెరుగుతవి. పిల్లల మూలంగా సుఖసంతోషాలు లభిస్తవి. ఇతరులతో

> **గ్రహస్థితి**
>
> మిధునంలో అంగారకుడు, సింహంలో రాహువు, మకరంలో గురు, శనులు, కుంభంలో సూర్య, బుధ, కేతువులు, మీనంలో శుక్రుడు మకర, కుంభ, మీన, మేషాలలో చంద్రుడు—

కలిసి చేయుపనులు సులభంగా ముందుకు సాగవు. అధికారులవల్ల అనుకూలత ఉంటుంది. ధనసంబంధమైన లావాదేవీలలో తగాదాలు వచ్చి చివరకు అనుకూలంగా సర్దుబాటు చేసుకోగలుగుతారు. కార్యభారం విశేషంగా ఉన్నా తగినంత ఫలితం పొందలేక పోతారు. 15, 16 లలో కుటుంబ కలహాలు, ధనవ్యయం.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

పెద్దపెద్ద ఆలోచనలు చేస్తూఉంటారు. కార్యరంగంలో ప్రవేశించే సమయంలో ఆటంకాలు వస్తూవుంటవి. కుటుంబంలోనివారితో కలహాలు వస్తూఉండటంవల్ల మనశ్శాంతి తగ్గుతుంది. వృత్తిలో ఇంతకుముందు కనిపిస్తున్న చిక్కులు క్రమంగా తొలగిపోతవి. అనుకోకుండా ఖర్చులు పెరగగల అవకాశా లున్నవి. బంధువులు, స్నేహితులు మీ సుఖ సంతోషాల నిమిత్తం అన్ని విధాలా సహాయం చేస్తారు. స్థిరాస్తులు కొనటం, పెద్ద పెద్ద వ్యాపారాలలో ప్రవేశించటం వంటి పనులు సులభంగా జరిగే సూచనలు లేవు. అకస్మాత్తుగా మిత్రులతో వివాదాలు వస్తవి. 17, 18 తేదులలో వినోద కార్యక్రమాలు, గౌరవ ప్రాప్తి, ధన లాభం.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ప్రతివిషయంలోను మీ చుట్టు ఉండేవారిని సంతృప్తిపరుచుకుంటూ ముందుకు పోవాలిసివస్తుంది. అయితే ప్రయోజనం సాధించ గలుగుతారు. పట్టుదలలు వచ్చి వృధాగా కొంత ఖర్చు, కార్యభారము పైన వేసుకొంటారు. పిల్లల ఆరోగ్యం సరిగా ఉండదు. ప్రయాణాలు సుఖంగా జరుగుతవి. దక్షిణ దిక్కునుంచి లాభకరమైన వార్తలు వస్తవి. అధికారులతో పేచీలు వచ్చినా ముఖ్యకార్యక్రమాలు సకాలంలో జరుగుతవి. మొత్తంమీద మనస్సుకు విశ్రాంతి కనుపించదు. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి. 19, 20 తేదులలో హోదా నిమిత్తం ఖర్చులు, వృత్తిలో పాటివారితో పోటీ, శ్రమ.

* * *

**కన్య :**

గ్రహబలం బాగున్నది. వ్యవహారరంగంలో అనుకూలత కనిపిస్తుంది. ధనాదాయం బాగా పెరిగి మీ ప్రయత్నాలకు మార్గం సులభ మవుతుంది. సంఘంలో మీ పేరు ప్రతిష్ఠలు, బాధ్యతలు పెరగగల సమయం. వృత్తి ఉద్యోగాలలో మిమ్ములను వ్యతిరేకిస్తున్నవారు తమ స్వభావాన్ని మార్చుకుని మిమ్ములను అనుసరిస్తారు. వారం రెండవ భాగంలో మీ ఆరోగ్యం చెడే అవకాశాలున్నవి. ముఖ్యంగా పైత్యప్రకోపంవల్ల నిద్రాభంగము, రకరకాల ఆలోచనలు, నరములలో బాధ కనుపించవచ్చు. నౌకరులమీద కార్యభారం విడచి అశ్రద్ధగా ఉండవద్దు. విలాస వినోదాలకై ఖర్చులు పెరుగుతవి. 17, 18 లలో గొప్పవారితో స్నేహము, అధికారులవల్ల అనుకూలత, ఇష్టవస్తు ప్రాప్తి.

* * *

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఒకప్రక్క విరోధాలు వచ్చేటట్లు కనిపిస్తున్నా ధైర్యంతో మీ ప్రయత్నాలను సాగించుకో గలుగుతారు. పదిమందిలో మీ మాటను చలామణీ చేసుకుంటారు. ఆదాయం పెరిగినా ఖర్చులు కూడా విపరీతంగా పెరగటంవల్ల ఎప్పటికప్పుడు డబ్బుకోసం ఎదురుచూడవలసి వస్తూఉంటుంది. మీ ఆరోగ్యం ఇంతకుముందుకన్నా మేలుగా ఉంటుంది. ప్రయాణాలు అనుకున్న ప్రకారం జరుగకపోవచ్చు. ఇతరులకు అప్పులు యిచ్చి విరో

ధాలు తెచ్చుకోవలసి వస్తుంది. జాగ్రత్తగా ఉండండి. మిమ్మలను చూచి ఓర్వలేని మిత్రులు మీ ఆదాయానికి భంగం కలిగించటానికి చూస్తారు దైవబలంవల్ల మీ కేవిధంగాను అపకారం జరుగదు. 19, 20 లలో మిత్ర లాభం. శుభవార్తలు.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ప్రత్యక్షంగా యిబ్బందులు కనిపించకపోయినా మనస్సులో ఆందోళన మాత్రం తప్పదు. శుభ కార్యముల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. వృత్తిలో చిన్నచిన్న ప్రతిబంధకాలు వస్తున్నా మీ అంతస్తుకు భంగం రాదు. అయితే శ్రమ మాత్రం అధికంగా ఉంటుంది. క్రొత్తవారితో స్నేహం లభిస్తుంది. అధికారులతో ప్రవర్తించటంలో పొరపాట్లు రాకుండా చూసుకోండి. ఈ సమయంలో మిత్రులసలహా, సహాయము ఉపయోగించవు. కుటుంబంలోని వారి ఆరోగ్యం సరిగా ఉండదు. ముఖస్తుతి మాటలను నమ్మి మీకు తెలియని పనులలో ప్రవేశించవద్దు. వారాంతంలో కలహాలు వస్తవి. 17, 18 లలో సంఘంలో గౌరవం, ఇష్ట వస్తుప్రాప్తి.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

అన్ని రంగాలలోను మీ మాట చెలామణి అవుతుంది. దేహసౌఖ్యం లభిస్తుంది. విశేషంగా డబ్బు పెట్టుబడిపెట్టి చేయదగిన కార్యాలు సకాలంలో జరిగి అనుకూలిస్తవి. అయితే నీచ స్వభావం కల మిత్రులుమంచితనంగా మిమ్మలను యిబ్బంది పెట్టటానికి చూస్తారు. అకస్మాత్తుగా కలహాలు వస్తవి. కాని, అందువల్ల మీకు ఏవిధంగాను చిక్కులు ఉండవు. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. విలువగల వస్తువులు కొంటారు. వారాంతంలో అత్యవసరమైన వస్తువులు సమయంలో లభించక చికాకు కలుగుతుంది. పుణ్యకార్యాలు జరుగుతవి. 15, 16 లలో విశేష శ్రమ, ప్రయోజనములేని పనులయందు ఆసక్తి.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

వృత్తి వ్యాపారాదులలో ఇంతకుముందుకన్నా మెరుగుగానే ఉంటుంది. అయితే మధ్య మధ్య ధైర్యం తగ్గుతూ ఉంటుంది. ఇతరులమాటను నమ్ముకుని ముందుగా ఏ వ్యవహారంలో ప్రవేశించటానికి అవకాశం ఉండదు. ఎదురు చూస్తున్న వార్తలు సకాలంలో అందుతవి. బంధువుల వద్దనుంచి ఉత్సాహము, ధైర్యము కలిగించే వార్తలు వస్తవి. ఖర్చులు పెరిగినా, దైవికంగా ఆదాయం పెరగటంవల్ల ఆందోళన చెందవలసిన అవసరం ఉండదు. ప్రయాణ సూచన లున్నవి. తలవని తలంపుగా ఇతరుల వ్యవహారాలలో జోక్యం కలుగజేసుకోవలసి వస్తుంది. చాలావరకు డబ్బు యిబ్బంది తొలగిపోతుంది. 16, 17 లలో త్రిప్పట కష్టవార్తలు.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ముందు నిర్ణయించుకున్న ప్రకారము మీ కార్యక్రమాలను సాగించుకొన గలుగుతారు. అయితే ఆయినవారితో పేచీలు రావటం మనస్సుకు కష్టంగానే ఉంటుంది. సంఘంలో గౌరవం పొందగలుగుతారు. నౌకరులవల్ల వస్తునష్టం కలుగగల అవకాశా లున్నవి. అధికారులవల్ల కార్యం సాధించుకో గలుగుతారు. మీ మాట తొందరవల్ల ఇతరుల మనస్సుకు బాధ కలగటం, అందువల్ల అశాంతి కలుగకుండా చూచుకోండి. దైవ కార్యాలు నిరాటంకంగా జరుగుతవి. కుటుంబంలోని వారి ఆరోగ్యం సరిగా ఉండదు. సంఘ కార్యాలలో పాల్గొంటారు. కోర్టు కచేరీలలో అనుకూలమైన సమయం. 18, 19 లలో ధన లాభం, ఇష్ట వస్తు ప్రాప్తి, పండితులతో స్నేహం.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ఒక సమస్యనుంచి తప్పుకొనక ముందే మరొక చిక్కు ఎదురు వస్తూఉంటుంది. కాని ధైర్యంతో అన్ని పనులు సాధించుకో గలుగుతారు. డబ్బు యిబ్బంది తొలగుతుంది. కాని పనులలో నిదానము, ఆటంకాలు కనుపిస్తవి. మిత్రుల సహాయం లభిస్తుంది. వ్యవహారవిషయాలలో పట్టుదలలు తగ్గించుకుని కార్యసాధనకు ప్రయత్నించటం అవసరం. దేహసౌఖ్యం లోపించగల అవకాశా లున్నవి. కొన్ని సమయాలలో నీచ కార్యములయందు ఆసక్తి కలుగవచ్చు. నిగ్రహించుకొనటం అవసరం. ఇతరుల మెప్పుదల కోసం భారం పైన పెట్టుకోవద్దు. వారాంతంలో శుభ వార్తలు వస్తవి. 15, 16 లలో వృధా శ్రమ, అధైర్యం, ఖర్చులు. ★

### ఈ వారము ధరలు

బంగారు ధర కొద్దిగా పెరిగి నిలకడగా ఉంటుంది. వెండి ధరలో తేజీ వచ్చి తగ్గుతుంది.

వనస్పతిధరలో మందీ రాగల అవకాశా లున్నవి. ప్రత్తిధర పెరుగుతుంది. నూలుధర మందీ వచ్చి వారాంతంలో పెరుగుతుంది.

నూవుల నూనె ధర స్తిమితంగా ఉంటుంది. వేరుశనగ పప్పు ధర మందీ, నూనె ధరలో మందీ వచ్చి, పెరుగుతుంది.

మినుములకు మందీ సూచన లున్నవి. శనగల ధర అధికంగా తగ్గి కొద్దిగా పెరుగుతుంది.




చిత్రకారుడు—రావాడ కృష్ణ (భువనేశ్వరం)



"పిల్లలూ! శ్రద్ధగా వినండి! ఇది కథ కాదు. నిజంగా జరిగింది. దీనిలో మంచినీతి వుంది. అదేమిటో మీరే చెప్పాలి..." అంటూ కథ చెప్పడం మొదలెట్టారు శివయ్య పంతులు గారు.

"అవి యింకా నా చిన్నతనపు రోజులు. వారాని కోసారి మా వూళ్లో సంత జరిగేది. ఒక సంత రోజున మా అమ్మ సంచీ, కొంత చిల్లర డబ్బు యిచ్చి, ఏవో కూరగాయలు తీసుకురమ్మని సంతకు పంపింది...రకరకాల బొమ్మలమ్మే వాళ్లు, మిఠాయిదుకాణాలు, షర్బత్ అంగళ్లు, గారడీవాళ్ల ప్రదర్శనలు, చిత్రవిచిత్రంగా వున్న భిక్షగాళ్ళు—ఎక్కడ చూసినా కదిలేందుకైనా సందులేకుండా గిజగిజలాడిపోతున్నారు జనం. పాకాలచెరువు మొరవ తెగినట్టు హోరు మంటోంది సంత. ఆ సమయంలో నా చూపుల్ని ఒక వింతమనిషి యిట్టే ఆకర్షించేశాడు.

అతడొక రౌతు! రూపంలో అతనికీ, అతని గుర్రానికీ ఏమాత్రం తేడా లేదు. మనిషి అంత పొడుగూ కాదు, పొట్టీ కాదు. ఎముకల గూటి పైన ఒట్టి చర్మాన్ని మాత్రమే కప్పివుంచినట్లుంది అతని శరీరం. మొహం చుంచులాగుంది. కళ్ళు లోతుగా వున్నాయి. చప్పిదవడలు, ముందరికి పొడుచుకొచ్చిన సూది మొనల్లాంటి మీసాలు, కొంగ మెడ—అతని రూపలావణ్యాలను చూస్తే ఎవడైనా ఫక్కుమని నవ్వేయగలడు.

గుర్రంపరుగెడుతోంటే అందరూ పక్కకు తప్పుకుంటున్నారు. గుర్రం చాలా బక్కచిక్కి వుంది. మోకాలి చిప్పలు, రొమ్మెముకలు అన్నీ పైకి తేలిపోయాయి. కుంటుతూ,

# సాంబయ్య గుఱ్ఱం

..... కలువకొలను సదానంద ........

వగర్చుతూ—ఏలాగో ఒకలాగా ఒక్క మనిషినైనా మోసుకు పోగలుగుతోందంటే-దాని ఓపికను మెచ్చుకోవల్సిందే!

గుర్రం కుదుపుకు అతని గిరజాల జుత్తు, చెవిలోని పోగులు ఎగిరెగిరి పడుతున్నాయి. ఎర్రధోవతి కట్టుకుని, పసుపు పచ్చని అంగీ తొడుక్కుని, నడుముకు ఆకుపచ్చని కండువా చుట్టుకున్నాడు. జమీందారుల పాదరక్షల పోలికతో వున్న చెప్పులు తొడుక్కున్నాడు. అవి ఒక అంగుళం మందమైనా వుంటాయి. అతని ఎడమ చేతిలో కళ్లెం, కుడి చేతిలో జాటీ వున్నాయి. అతని ముందర ఏవో వస్తువుల మూట వుంది. గుర్రానికి లాడాలు కొత్తవి కొట్టించాడేమో—గుర్రం నడుస్తూ వుంటే బలే చప్పుడవుతూంది. అతన్ని నేనెంతోసేపు చూడలేదు. ఒక్క అయిదు నిమిషాలు మాత్రమే. పట్టాలమీద ముక్కుతూ, మూలుగుతూ మిట్టెక్కే గూడ్సుబండిలా—సూటిగా వూరికి పెడముఖంగా వెళ్ళిపోయాడు. ఆకాశంలో కనిపించే విమానాన్ని సినిమాల్లో ఎగిరే పెంపుడు పావురాన్ని చూసినట్లు అందరూ అతడు కనుమరుగైపోయేంతవరకు తదేకదృష్టితో చూచి, తర్వాత 'గలగల'మని నవ్వుకున్నారు.

నాలుగైదు రోజులు గడిచాయి.

నాలుగు మైళ్ళ దూరంలోవున్న పల్లెలో సారంగధర నాటకం జరుగుతుందని ఎవరో అన్నారు. ధర్మరాజు జూదమంటే ఎలా చెవి కోసుకుంటాడో—ఆలాగే నాటకాలంటే నాకూ తగనిపిచ్చి. ఇంట్లోతలో, కేషో పావలానో అడిగి పుచ్చుకుని నలుగురైదుగురు స్నేహితులం కలిసి, యింకా ప్రొద్దుండగానే నాటకానికి బయలుదేరాం.

మూడుమైళ్ళు నడిచేసరికి ప్రొద్దు బాగా దిగజారిపోయింది. ఎండ చల్లబడిపోయింది. ఇంక ఒక్క మైలుకన్నా ఎక్కువ దూరం లేదు. గుక్కపట్టి గుక్క వదిలే లోపున వెళ్ళిపోవచ్చు.

బాట కిరువైపులా వున్న వరి పైరులు, చెరకుదోటలను చూస్తూ, పడుచుపిల్లల పల్లెపాటలు వింటూ, 'రామన్న రామ రామో' అంటూ మోటదోలుతూన్న రైతులను పరికిస్తూ సునాయాసంగానే నడిచి పోతున్నాం.

ఇంతలో ఒక మలుపు దగ్గర గుర్రపుడెక్కల చప్పుడు వినిపించింది. మలుపు తిరగ్గానే అల్లంత దూరంలో ఓ బక్క గుర్రం మీద మాకు అభిముఖంగా వస్తోన్న ఓ మనిషి కనిపించాడు.



అతడింకా మా సమీపానికైనా రాకుండా, దూరంలోనే ఆగిపోయి ఎవరో యింకో మనిషితో మాటలాడుతున్నాడు. తరువాత అక్కడి నుండి కదిలి—మేము దగ్గరపడగానే-ఎందుకో 'హేయ్, ఆగు!' అంటూ తన గుర్రాన్ని ఆపాడు.

ఉన్నట్లుండి—ఆ రోజున సంతలో కనిపించిన మాయమైన మనిషి జ్ఞాపకం వచ్చాడు నాకు. ఇతను మరెవరో కాదు. అతడే యితడు.

పొడిదగ్గు దగ్గి, లేని హుందాతనం తెచ్చిపెట్టుకుని, "ఏ వూరు అబ్బాయిలూ మీది?" అన్నాడు.

మావూరు ఫలానా అన్నాము.

"ఓహో! ఆలాగా! అయితే యిటు ఎక్కడికి?" అన్నాడు మళ్ళీ-

"నాటకానికి!"

"ఓహో! నాటకానికా! మా వూళ్లోనేలెండి ఆనాటకం!—అయితే పాపం...యింత దూరమూ నడిచే వస్తున్నారా?"

"మరి—నడవకుండా రావడానికి మాకేం గుర్రాలున్నాయిటండీ?" అన్నాను.

"ఓహో! అదీ నిజమే! అందరూ గుర్రాలు కొనగలరా? మహామహా జమీందారులే చచ్చినట్టు వూరుకుంటే!—అయినా నేను మాత్రం గుర్రం లేకుండా అడుగు కదపలేనంటే నమ్మండి. సరే...మీరు వెళ్ళండి యిక!—నాకు చాలా

తొందరపనులున్నాయి. ఈ వేపు మాపి పొలం పుట్టా దండిగా వున్నాయిగా! ఎలా వుందో చూసి రావాలి..." అనేసి, "హైయ్! పదవే పంచకల్యాణి!..." అంటూ తన గుర్రానికి ఒక చురక అంటించి ముందుకు సాగాడు.

గట్టిగా నవ్వుకుంటూ కొంత దూరం వెళ్ళి మళ్ళీ వెనక్కు తిరిగి చూశాము. దూరంగా మలుపుదగ్గర ఎవరితోనో మాట్లాడుతున్నాడు గుర్రం రౌతు.

కబుర్లు చెప్పుకుంటూ మరో పదిహేను నిమిషాలకల్లా ఆవూరు చేరుకున్నాం.

నాటకం జరిగే స్థలం చాలా పెద్దది. చుట్టూ తడికెలు కట్టారు. టిక్కెట్టు రెండణాలట. నాటకం ఎప్పుడు జరుగుతుందని కొందరిని వాకబుచేస్తే—యిప్పుడప్పుడే జరగదన్నారు. ఈలోగా అక్కడ కనిపించిన ఒక నేస్తం యింటికి వెళ్ళి అతని బలవంతం మీద భోజనంచేసి మళ్ళీ నాటకస్థలం దగ్గరికి వచ్చాము.

ఇంతలో గేటుదగ్గర పెత్తనం చెలాయిస్తూ కనిపించాడు ఆ గుర్రం ఆసామీ. స్నేహితుణ్ణి అడిగాను "ఎవడురా యీఅశ్వసేనుడు?" అని.

అతను తేలిగ్గా నవ్వి—"ఆయనొక పిచ్చిపుల్లాయిలే" అన్నాడు.

"అదే! నేనప్పుడే అనుకున్నా. అతను, అతని తీరు; ఆమాటలు. ఆయన పేరేమి?"

"తిక్క సాంబయ్య."

"చూస్తే మోతుబరి రైతులాగానే వున్నాడే?"

"ఆ! ఏదో కొద్దో గొప్పో పడిసిందిలే! అతని కుటుంబం కూడా కాస్త పెద్దదే....అయితే ఒక జమీనో, జాగీరో లేకపోవడమొక్కటే అతనికి కొరత!...ఏమి హోదా చూపిస్తాడు?... ఆజుత్తు చూడు ఎలా పెంచాడో;ఆమీసాలు చూడు ఎలాతిప్పాడో..."అన్నాడు నేస్తం.

"అతను—గుర్రం లేనిదే నడవలేడటనే?" అన్నాను.

"అదేమో నిజమేలే! గుర్రం కొన్నప్పటినుండి యింతవరకు కాలు కింద బెట్టలేదు. అమ్మో! గుర్రం

ఒకానొక గృహ యజమానికి స్థానిక మున్సిపాలిటీ ఆఫీస్ నుంచి రెండు నోటీసులు వచ్చాయి. వాటిలో ఇలా ఉన్నది:

1. మీ ఇంటి పన్ను ఇంకా 20 రూపాయలు పెంచబడినది.

2. మీ ఇల్లు నివాసయోగ్యము కానందున తొందరగా ఖాళీ చేయగలరు.

—టి. శ్రీనివాసరావు (వంగపల్లి)

కొనేంతవరకు ఒంటికాలిమీద గదా నిలబడ్డాడు! ఎవడో ముసలి సిపాయి దగ్గర చౌకగా కొన్నాడు. అప్పటినుండి ఎందుకులే యీాయన మిడిసిపాటు?... ఎప్పుడూ గుర్రంపైన్నే వూరేగుతుంటాడు. పొలాలదగ్గరికి కూడా నడిచి వెళ్ళడు. పాపం—దాని ప్రాణం తీసేస్తాడు. దారిలో ఎవడైనా ఎదురుపడ్డాడా — కావాలనే గుర్రాన్ని ఆపుతాడు, 'ఏవూరు? ఎక్కడికి?' అంటూ పరామర్శిస్తాడు. నిజానికి—వాళ్ళ గొడవ యితనికి అక్కరలేదు. తానొక గొప్పవాడు, తనకొక గుర్రముంది అని తెలియజేయాలన్నదే అందులోని అంతరార్థం..."

ఇంతలో సాంబయ్య నేస్తాన్ని పేరుబెట్టి పిలిచాడు. "ఒరేయ్ అబ్బడూ! మనింటి కెళ్లి గుర్రానికి గుగ్గిళ్లు పెట్టారో లేదో చూచి రామ్మా."

"పెట్టే వుంటారులే! కావలిస్తే నువ్వే వెళ్ళి యింకోసారి పెట్టిరాపో!" అన్నాడు అబ్బడు.

సాంబయ్య 'హుం' అని హుంకరించి తన చింపిరి మీసాలను పేనుకుంటూ అక్కడినుండి వెళ్ళిపోయాడు.

"పీడింతే—మంచీ, మర్యాదా లేకుండా, నలుగుర్లోనూ! జమీందారులా పీడొక్కడే బతకాలిగాబోలు. ఈ సారికూడా చెవుల్తూ, తోకా తెగకోయందే కుదరదు" అన్నాడు అబ్బడు విసుగ్గా.

వాడిమాటలు నాకు మహాద్భుతమనిపించాయి. "అదేమిట్రా? చెవులూ, తోకా కోస్తానంటున్నావు? అసలు-చెవులున్నాయనుకుందాం. తోక ఎక్కడిదిఆయనకు? మళ్ళీ తెగకోయాలంటున్నావు; ఇంతకుముందుకూడా ఓసారి కోశావేమిటీ?" అన్నాను.

వాడు గొల్లుమని నవ్వాడు. "తోకా చెవులూ సాంబయ్యవిగావు. గుర్రానివి. ఇంతకు ముందొకసారి వేరే గుర్రం పట్టుకొచ్చాడు. దానికి కట్టడీ లేదు, కట్టుతాడూ లేదు. అది ఎక్కడబడితే అక్కడే మేసేసేది—పులితోలు కప్పుకున్న గాడిదలా. కొందరు సాంబయ్యతో చెప్పిచూశారు. "నోరులేని జీవం-పాపం" అని పైకి అనేసి విన్నీవిననట్లు వూరుకున్నాడు సాంబయ్య. ఇక యిది పని గాదనుకొని—ఎవడో దాని

చెవులూ తోకా తెగకోసి శాస్త్ర పుణ్యం కట్టుకున్నాడు. ఆ గుర్రమే మైందోగాని—యిప్పుడు మళ్ళీ యీ గుర్రం తయారై కూర్చుంది."

నాలుగుమైళ్లు నడిచివచ్చినందుకు నాటకానికన్నా రసవత్తరమైన విశేషం వినగలిగాం.

రెణ్ణెల్ల తర్వాత ఒక సంతనాటి సాయంకాలం—ఐదు గంటలవేళ ఊరి బయట షికారుకెళ్లాను. ఒక మైలు దూరం వెళ్లాక—గుర్రంమీద నాకు ఎదురుగ్గా వస్తూ కనిపించాడు సాంబయ్య. చల్లటి సాయంత్రపు వేళ-సంతకు వెళ్ళేవారితో, తిరిగి వచ్చేవారితో కళకళలాడుతోంది మట్టిబాట. సాంబయ్య తనకెదురు పడ్డ ప్రతిమనిషిదగ్గర ఆగుతున్నాడు; మళ్ళీ అక్కడనుండి ముందుకు కదలుతున్నాడు. అతని సంగతి నాకింతకు ముందే తెలుసుగా? అందులో క్రొత్తేమీ కనిపించలేదు నాకు.

సాంబయ్య నన్ను సమీపించాడు.

అనుకున్నట్టుగానే గుర్రం ఆగింది. అతడు వేయబోయే ప్రశ్నలకు సమాధానాలు ఆలోచించుకుంటున్నాను.

కాని నా ఆశ్చర్యానికి అంతులేనట్లు—గుర్రం ఆగిందో లేదో—వెనువెంటనే—జాటీని ఛెళ్ళుమనిపించి—"హైయ్! హైయ్య! నీ కాళ్ళు నరికి పొయ్యిలో బెట్టా! నిలవకుండా నడిచిపోలేవూ? హైయ్!" అంటూ అదిలించి, గుర్రం కదిలిన తర్వాత "రాను రాను గానుగెద్దు యవ్వారంలాగుందే దీని కథ!" అని గొణుక్కున్నాడు.

నాకు తలాతోకా ఏమీ అర్థం కాలేదు. సాంబయ్య గుర్రాన్ని ఎందుకు ఆపాలి? ఆపినవాడు ఒక్క—మాటైనా మాట్లాడకుండా, గుర్రాన్ని తిట్టుకుంటూ మళ్ళీ ఎందుకు సాగిపోవాలి?

షికారు ముగించుకుని తిరిగి వస్తూంటే—సైకిలుమీద అబ్బడు ఎదురుపడ్డాడు. వాణ్ణిఆపి, "సాంబయ్య ఎందుకు ఆగాడు? ఆగినవాడు పలకరించకుండా—మళ్ళీ ఎందుకు ముందు కెళ్ళి పోయాడు? ఏమిటీ విచిత్రం?" అన్నాను—గబగబ.

అబ్బడు అన్నాడుగదా "అయ్యో పాపం! మంచి మిట్టమధ్యాహ్నం వేళ బయలుదేరి వుంటాడు. సంత కొచ్చేసరికి సాయంకాలమైంది. ఇక పల్లెకు వెళ్ళేసరికి తెల్లవారుతుంది."

"ఎందుకు?" అన్నాను.

"ఎందుకా? గానుగెద్దుకు బండి కట్టినందుకు. నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష అంటోంది యిప్పుడా గుర్రం. కనిపించిన మనిషిదగ్గరల్లా గుర్రాన్ని ఆపి, తన అంతస్థును గురించి డబ్బా వాయించుకునేవాడు. మనిషి కనిపించినప్పుడల్లా ఆగడం, ఆ తర్వాత కదలడం బాగా అలవాటయింది గుర్రానికి. అందుకు సాంబయ్య ఆగాడు, మళ్ళీ కదిలాడు. ఇలా నిలుస్తూ నడుస్తూ ప్రయాణం కొనసాగించినందుకే యింత జాగైంది. అంచేత యిప్పుడిప్పుడు-"నువ్వు యిదివరకు నేర్చుకున్న పాఠమంతా తప్పు" అని తన గుర్రానికి కొత్త చదువు చెబుతున్నాడు సాంబయ్య..."అని ముగించి సైకిలు పెడలును కాలితో ఒక్కసారి త్రొక్కి—పల్లెవైపుగా దూసుకుపోయాడు అబ్బడు...''

* * *

తరగతి గదిలో కొన్నిక్షణాల పాటు ఉత్కంఠను అణచుకోలేనంత నిశ్శబ్దం నెలకొన్నది.




చిత్రకారుడు: మందలప సిద్ధయ్యనాయుడు (పెదగోర్పాడు)

"తర్వాత?" అన్నారు కుర్రాళ్లు.

"అంతే! కథకంచికి గంటకొట్టిన తర్వాత మనం యింటికి. అంతలో పల...ఏదీ...ఎవరైనా యీ కథలో "నీతేమిటో చెప్పండి..." అన్నారు శివయ్య మాస్టారు.

"ఒకేరకమైన పనిని మాటి మాటికీ చేస్తూంటే—అదే అలవాటై పోతుంది." అంటూ ఠకీమని జవాబిచ్చాడు—అందర్లోకీ తెలివి మంతుడనిపించుకున్న అబ్బాయి.

"కనుక 'మంచి' అయితే ఫరవా లేదు. చెడ్డపని జోలికి మాత్రం వెళ్ళబోకండి. అదే అలవాటవుతుంది..." శివయ్యపంతులుగారిల్లా అంటూ వుండగానే జవాను గంట మ్రోగించేశాడు.

కుర్రాళ్లంతా త్వరగా బయటపడాలన్న ఆతురతతో ఒకరినొకరు గోలగా తోసుకోవడం ప్రారంభించారు. శివయ్య మాస్టారు తాండవశివుడిలా పైకిలేచి ... "ఇదిగో! ఇదే సాంబయ్య గుర్రం వ్యవహారమంటేను! గంట కొట్టగానే లైనులో వెళ్లాలని చెప్పానా?" అంటూ మేజామీది పేముబెత్తాన్ని చేతికి అందుకున్నారు. ★

# చాటు కథామంజరి

## వేములవాడ భీమకవి



బెజవాడ సదానందం

కవులను 'అవితథ వాక్కులు' అంటారు. అంటే వారిమాట పొల్లుపోదని అర్థం. పొల్లుమాటల పొంతన కానిదే కవిత్వం అవుతుంది. అందుకే కవులు అయినవారు ఋషులు అయితీరాలనే మాట కూడా వుంది.

'ఉగ్రకోపి నేను నోపుదు శపియింప
గ్రమ్మఱిఁ బ్రసాదశక్తి గలదు నాకు-
వట్టిమాన జిగురు బుట్టింప గిట్టింప-
బిరుదు వేములవాడ భీమకవిని.'

అని చెప్పగల గొప్పగల వేములవాడ భీమకవి కూడా మహాకవిగా, నిగ్రహానుగ్రహ శక్తిమంతుడుగా ప్రసిద్ధుడయినాడు.

వేములవాడ భీమకవి పన్నెండవ శతాబ్దివాడని కొందరు, అంతకు ముందువాడని మరికొందరు అంటారు. అలాగే ఆయన స్వగ్రామం ద్రాక్షారామమని కొందరు, కరీంనగర్ మండలంలోని వేములవాడ అని మరికొందరు వాదిస్తారు. ఇదమిత్థంగా కాలదేశాలు నిర్ణయంకాని ఈ మహాకవి ఉనికిమనికి తెలిపే ఆధారాలు ఏవీ లేవు. మరి ఆయన రచించిన గ్రంథాలు నృసింహపురాణం, కవిజనాశ్రయం, విషామృతం మన దురదృష్టాన్ని మరింత ప్రస్ఫుటంచేస్తూ అజ్ఞాతంగానే ఉన్నాయి. పాల్కురికి సోమనాథుని 'బసవపురాణం' భీమకవి కన్నడంలో రచించాడు. ఏది ఏమయినా భీమకవి అన్ని కాలాలవాడూ, అన్ని దేశాలవాడూను.

అందుకు సాక్ష్యమిచ్చే చాటుకథలు ఎన్నో ఉన్నాయి.

తెలుంగాధీశుని కొలువులో తననుగూర్చి తాను ఈ కవి ఇలా చెప్పుకున్నాడు—

ఘనుడన్ వేములవాడ వంశజుఁడ
దాక్షారామభీమేశనం
దనుడన్ దివ్యవిషామృత ప్రకట నానా
కావ్య ధుర్యుండ భీ
మన నాపేరు వినంగ జెప్పితి
తెలుంగాధీశ కస్తూరికా
ఘనసారాది సుగంధ వస్తువులవేగం
దెచ్చి లాలింపురా.

ఇక ఈ ప్రచండ భీముని వాక్సిద్ధికి నిదర్శనాలయిన చాటుకథలు కొల్లలు. చాళుక్యరాజగు చొక్కనరేంద్రుడు ఒకసారి మన భీమనశక్తిని పరీక్షించి ఆనందింపగోరి ఒక పందిరి స్తంభమును చిగురింపజేయుమని వేడెను. చొక్కని కోరిక విన్న భీమన వెంటనే...

ఆసీతాఖ్య పదాన శృంఖలకరాఖ్యాలంబిత
స్తంభమా!
నేనే వేములవాడ భీమకవినేనిన్
చిత్రకూటంబులో—
ఘనవ్యాపృత పల్లవోత్పలతికా పుష్పోప
గుచ్ఛంబులన్
నానాపుష్ప ఫలప్రదాయివగుమా నా కల్ప
వృక్షాకృతిన్ —

అని ఆశించినాడు, ఆమోడు వారిన స్తంభము కిసలయించి పుష్పించి అంతలోనే ఫలించెను. చొక్కనృపతి అమితానంద మందినాడు. పేరోలగమంతా ఆశ్చర్యంతో అనిమిషులయినారు. తిరిగి ఆ స్తంభమునకు భీమకవి తొలిరూపు కల్పించినాడు.

శంభువర పసాది కవిజాలవరేణ్యుడనైన
నావచో
గుంభన మాలకించి యనుకూలతనొంది
తనూనభావనన్
గుంభినికొక్క నామనృపకుంజరు పందిట
మల్లెసాలకున్
స్తంభమురీతి నీతనువుదాలిచి యెప్పటి
యట్లనుండుమా.

రాజకళింగగంగు ఆస్థానమునకు నానారాజ సందర్శనమును పురస్కరించుకొని భీమకవి వెళ్లినాడు. రాచ కార్యముల తలమునకలుగా నున్న కళింగగంగు ఇది సమయము కాదని భీమనకు దర్శనమిచ్చి ఆదరించలేదు. భీముని సామము సన్నగిల్లి కోపము ప్రకోపించినది. భీముడు ప్రచండ భీముడయినాడు. భీమన కోపము కళింగ గంగు పాలిటి శాపమైనది. ఇట్లని శపించినాడు.

వేములవాడ భీమకవి వేగమెచూచి కళింగ
గంగుతా
సామముమాని కోపమున సందడిదీరిన
రమ్ము పొమ్మనెన్
మోమునుజూడ దోసమిక ముప్పదిరెండు
దినమ్ములావలన్
జామున కర్థమందతని సంపద శత్రుల
పాలుగావుతన్.

ఆ 'ముప్పది రెండు దినమ్ములు, కళింగ గంగు అదృష్టరేఖను తుడిచి వేసినవి. రాజు గర్భదరిద్రుడై భిక్షుకుడైనాడు; ఒకనాటి కాళరాత్రి ఈ బ్రతికి చెడిన రాజు చీకటిలో నిలువు లోతు గోతిలో కూలి దుఃఖింప సాగినాడు. రాచమర్యాదలతో ఆ బాటనే పల్లకిమెక్కి హుటాహుటిని పోతున్న భీమకవి ఇదిచూచి జాలిపడి తిరిగి ఆతనిని రాజ్యలాభముతో దీవించెను.

వేయిగజంబు లుండ పదివేలు తురంగము
లుండ నాజిలో
రాయలగెల్చి సజ్జనగరంబున బట్టము
కట్టుకోవడిన్
రాయకళింగ గంగుకవిరాజ
భయంకరమూర్తి జూడగా
బోయెను మీనమాసమున బున్నమ
పోయిన షష్ఠినాటికిన్

తిరిగి రాజకళింగ గంగు లబ్ధరాజ్యుడయ్యెను. కోమటివారి వ్యాపార పారీణతకు నొచ్చుకున్నప్పుడు భీమకవి వారి నిట్లు వర్ణించి 'భళీ' అనిపించుకున్నాడు.

గొనకొని మర్త్యలోకమున కోమటిపుట్టగ
పుట్టె తోన బొం
కును గపటంబులాలనయు గుచ్చిత
బుద్ధియురిత్తభక్తియున్
ననువరి మాటలున్ బరధనంబును గ్రక్కున
మెక్కజూచుటల్
కొనుటలు నమ్ముటల్ మిగుల గొంటు
దనంబును మూర్ఖవాదమున్.
కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసము
లేదః యింటికిన్
సేమమెరింగి చిచ్చిడిన చెంపద పాపము
వానినెప్పుడే
నేమరుపాటున న్మరియునేమి యొనర్చిన
లేదదోసమా
భీమనిలింగమాన కవిభీముని
పల్కులు నమ్మియుండుడీ.

కృష్ణాతీరమున వేదాద్రిచేరువన గల గుడిమెట్ట రాజధానిగా ఆ ప్రాంతము నేలిన సాగి పోతరాజు భీమకవి గారి గుర్రమును తన అశ్వశాలలో బంధించి యాత్రను ఆటంకపరచినాడు. అసలే ఉగ్రకోపి ఆగలేక కఠోరమయిన శాపము విధించినాడు.

హయమదిసీత పోతవసుధాధిపు డారయ
రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుడ సహ్యజవారిధి
మారుడంజనా
ప్రియతనయుండు లచ్చన విభీషణుడా
గుడిమెట్టులంకనా
జయమును బోతరక్కసుని చావును
నేడవనాడు చూడుడీ.

కన్నడ, తెలుగు భాషలలో భీమకవి మహాకవి అనే పేరు గడించుకొన్నాడు. కొందరు ఈయనను


చిత్రకారిణి—కోకా జానకి (పొన్నూరు)

'లేములవాడ భీమకవి' అని కూడా పేర్కొన్నారు.

లేములవాడక సుఖియై
లేములవాడన్ జనించి లేములవాడన్
నామంబున బరగిన
భీమున్ కవిభీము సుకవిభీము దలంతున్.

అనే చాటువొకటి తెలుగునాట వినిపిస్తుంది.

గడ్డియలోపల తాడికడగి ముత్తునియగా
దిట్టిన మేధావి భట్టుకంటె.
'రెండుగడెల బ్రహ్మదండి ముండ్లన్నియు
డుల్ల దిట్టిన కవిమల్లుకంటె
మూడుగడెలకు దామొనసియుత్తిన గండి
పగులదిట్టిన కవిభానుకంటె
అరజాములోపల చెరువునీళ్లింకగా
దిట్టిన బడబాగ్ని భట్టుకంటె.'

గట్టివాడనని దిట్టనని చెప్పుకున్నాడు వేములవాడ భీమకవి. శ్రీనాథకవి సార్వభౌముడు కూడా 'వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు' అన్నాడు. చండప్రచండుడై, ఉద్దండుడైన భీమకవి అజరామరుడు.

రామునమోఘబాణమును రాజశిఖామణి
కంటి మంటయున్
భీమ గదావిజృంభణ మువేంద్రుని వజ్రము
చక్రిచక్రమున్
దామరచూలివ్రాతయు నుదారకవిద్విష
ఘోరశక్తియున్
వేములవాడ భీమకవి పిదునితిట్టును
రిత్తవోవునే.

రిత్తపోవు. కనుకనే ఆయనను తెలుగువారు మరువలేరు! మరచిపోరు.

★

# అంతేనా?

(23వ పేజీ తరువాయి)

శాస్త్రీ. ఇద్దరం ఒకనాడు ప్రాణమిత్రులుగా మెలిగాం. పెళ్ళిళ్ళయాయి. అంతే. ఎవరి దోవ వారి దయింది. ఇలాగే అయిదేళ్ళకో, ఆరేళ్ళకో ఒకసారి కలుసుకోవటం మళ్ళీ దూరమవటం జరుగుతోంది. ఆనాటి సాన్నిహిత్యం మళ్ళీ రాదా అనిపిస్తోంది. అయినా రిటైరయిపోయావుగదా, వైజాగ్ వచ్చెయ్యకూడదూ ? ఇద్దరం కలిసే ఉండొచ్చు" అన్నాడు.

"ఆలోచిస్తాను" అన్నాడు శాస్త్రిగారు నవ్వుతూ.

కాఫీ గ్లాసులు పట్టుకుని మాలతి వచ్చింది. తన కందించిన గ్లాసు తీసుకుంటూ "అలా ఉందేమోయ్ నీ కూతురు ?" అన్నాడు 'రాజా' గారు.

"నిన్నటి దాకా జ్వరం."

"ఇవాళ పనులు చేయిస్తున్నా వన్నమాట ? నిజంగా నువ్వు రాక్షసుడివిరా శాస్త్రీ !"

శాస్త్రిగారు చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

కాఫీ గ్లాసు కింద పెట్టి "కుశలప్రశ్నలు అయినాయి గనుక అసలు విషయంలోకి వస్తాను. నీతో ఒక పెద్ద పని ఉంది. శాస్త్రీ! నీ సహాయం కావాలి" అన్నాడు 'రాజా' గారు.

"మామూలేగా ? చెప్పు" అన్నాడు శాస్త్రిగారు.

"ఈ వూళ్ళో కాలేజీలో వేమవరపు లక్ష్మీనారాయణ అని ఓ కాలేజీ లెక్చర రున్నాడు. అతనికి మా శ్రీదేవిని ఇవ్వమని ఆ మధ్య మా చుట్టం ఒకడు పజెస్ట్ చేసి పెళ్ళి చూపులకు కూడా వాళ్ళను సిద్ధం చేశాడు. అతను వైజాగ్ రావడంకన్నా మేం ఇక్కడికి రావటమే అన్నివిధాలా హాయి అనే ఉద్దేశ్యంతో వచ్చాము. ఆ తతంగం మీ యింట్లో ఏర్పాటు చేయించాలి."

కలవరాన్ని అణుచుకుంటూ "అంతేకదా? చూద్దాంలే ?" అన్నాడు శాస్త్రిగారు.

"వీలయినంత తొందర్లో నేను వెళ్ళిపోవాలి. వైజాగ్‌లో చాలా అవసరమయిన పనులున్నాయి. ఈ సాయంత్రమే ఈ తతంగం అయిపోతే మరీ మంచిది."

"నీకు పను లేమిటోయ్ ? పెట్టి పుట్టిన వాడివి. అవునుగాని రాజా ! తీర్థప్రసాదాలజోలి మానేశావా ?" అన్నాడు శాస్త్రిగారు కుతూహలంగా.

"ప్రసాదాలు ఎప్పుడో మానేశాను శాస్త్రీ! పీడాది నుంచీ మా ఆవిడ పోరు పడలేక తీర్థం కూడా మానేశాను. ఇప్పుడు క్లబ్బులో చదరంగమే అన్నిటి కొరతా తీరుస్తోంది" అన్నాడు 'రాజా' గారు.

"వృద్ధనారీ పతివ్రతా అన్నారు .... అది సరే కాని నీకూ మావాడి వయస్సు కొడుకొకా డుండా అను కుంటాను. ఏం చేస్తున్నా డతను ?"

'రాజా' గారు జవాబు చెప్పేలోగా లోపలి నుంచి పనిమనిషి వచ్చి "నీళ్ళు కాగా యయ్యగోరూ ! తోడమంటే తోడతాను" అన్నది.

"స్నానానికి లేస్తావా ?" అన్నాడు శాస్త్రిగారు మిత్రుడితో.

"ఆ" అన్నాడు 'రాజా' గారు.

మిత్రుడిని స్నానాలగదికి పంపి శాస్త్రిగారు తిరిగి హాల్లోకి వచ్చాడు. ఆయనలో రకరకాల ఆలోచనలు కలుగసాగాయి. 'రాజా' బాగా ఉన్నవాడు. బాగా 'ఇవ్వగల' వాడు కూడాను. లక్ష్మీనారాయణ శ్రీదేవిని కాదనే అవకాశాలేమీ లేవు. ఎందుచేతనంటే అందచందాల్లో చదువులో మాలతికి ఏవిధంగానూ తీసిపోదామె.

అంటే తాను మరో సంబంధం చూడా లన్నమాట.

ఆ సంబంధం 'రాజా' కొడుకే అయితే మహా భేషుగ్గా ఉంటుంది. వాడు తన మాట తీసెయ్యడు. వాడికి దుర్వ్యసనాలు ఉన్నమాట నిజమే. కాని వాడు దుర్మార్గుడు కాడు. కొడుకును వెనకెప్పుడో చూశాడు తాను. అంతగా గుర్తు లేకపోయినా శ్రీదేవిని బట్టి ఆలోచిస్తే బాగానే ఉంటా డనిపిస్తోంది. గనుక లక్ష్మి సంబంధం వాడికే కుదిరినా తనకు బెంగ లేదు. అంతే !

> కోర్టులోకి తీసుకురాబడిన పాతముద్దాయిని జడ్జీ ఇలా అడిగాడు.
>
> "ఎందుకోయి! మళ్ళీ వచ్చావు?"
>
> "ఇద్దరు పోలీసులు తీసుకొచ్చారండి"
>
> "ఎందుకు? తాగినందుకేనా?"
>
> తకమనివచ్చింది సమాధానం—
>
> "అవునండి! ఇద్దరూ తాగే ఉన్నారండి" - అని.
>
> బి. హరగోపాలరావ్ (మెస్రా-రాంచీ)

స్నానం అయి ఇవతలికి వచ్చిన 'రాజా' గారు "ఏమిట్రా ? అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ ?" అన్నాడు మిత్రుడ్ని చూసి.

"ఏం లేదు" అన్నాడు శాస్త్రిగారు తేరుకుని.

"ఆ లక్ష్మీనారాయణగా రిల్లు ఎక్కడో తెలుసా? ఇప్పుడు వెళ్ళి మాట్లాడి వద్దాం" అన్నాడు 'రాజా' గారు.

"పద."

ఇద్దరూ బయలుదేరి లక్ష్మీనారాయణగా రింటికి వచ్చారు. కూర్చున్నాక తాము వచ్చిన పని టూకీగా తెలియజేశాడు శాస్త్రిగారు.

"మా ఉత్తరం అందిం దనుకుంటాను" అన్నాడు 'రాజా' గారు ముక్తాయింపు ఇస్తున్నట్టు.

"అందింది. అమ్మ కూడా రాత్రే వచ్చింది. రావడానికి మా కేమీ అభ్యంతరం లేదు" అన్నాడు లక్ష్మీనారాయణగారు.

"అయితే ఈవేళ తిథి, వారం బాగానే ఉన్నాయి. సాయంత్రమే ఏర్పాటు చేస్తాము" అన్నాడు 'రాజా' గారు.

"మీ ఇష్టం."

"అమ్మ లోపల ఉందేమిరా ?" అన్నాడు శాస్త్రిగారు.

"గాంధినగరం వెళ్ళింది. ఆమెకీ నాకుమల్లేనే సారథి అంటే విపరీతమయిన అపేక్ష. అతను వారం రోజు లయింది కనబడి. వాళ్ల అక్కయ్యనూ, వాళ్ళనూ చూసి వస్తానని వెళ్ళింది" అన్నాడు లక్ష్మీనారాయణగారు.

సారథి పేరు వినగానే శాస్త్రిగారు కంగారు పడ్డాడు. అతని భోగట్టా — ఎంత కొంచమైనా — 'రాజా' తెలుసుకోవటం మంచిదికాదు. ఆయ నీ మాట మార్చబోయే టంతలోనే "సారథి ఎవరూ ?" అన్నాడు 'రాజా' గారు.

"నా స్టూడెంటు లెండి !" అన్నాడు లక్ష్మీనారాయణగారు.

"ఇహ మేం వెళ్తోస్తాం లక్ష్మీ ! అమ్మ రాంగానే చెప్పు. సాయంత్రం యిద్దరూ మా యింటికి రండి.. అదృష్టవంతుడివిలే ! కుబేరుడి వంటి మావగారూ శ్రీ మహాలక్ష్మివంటి భార్యా దొరకబోతున్నారు" అన్నాడు శాస్త్రిగారు లేస్తూ.

లక్ష్మీనారాయణగారు నవ్వుతూ వీధి దాకా వచ్చాడు. "ఇహ నేను ఉంటాను" అన్నాడు వీడుకోలుగా.

"వెళ్తొస్తాం" అన్నాడు 'రాజా' గారు.

లక్ష్మీనారాయణగారు నమస్కరించారు.

దోవలో శాస్త్రిగారు తన సోది కొంత వెళ్లబోశాడు. మాలతికి పెళ్ళీడు వచ్చిందనీ చదువు మానిపించి పెళ్ళిచేద్దా మనుకుంటున్నాననీ చెప్పాడు.

"అదేం దుర్బుద్ధిరా ! మధ్యలో చదువు ఆపటం ఎందుకు ?" అన్నాడు రాజా' గారు.

"నీకు తెలీదులే. ఆవిడగారి చదువు పూర్తయితే ఏ ఎమ్మేవో కావాలంటుంది. నేను నీలాగా బంగారు పిచ్చుకను కాదుగదా ? ఈ రోజుల్లో ఎమ్మే ఖరీదు చచ్చు సంభావన పదిహేనువేలు!" అన్నాడు శాస్త్రిగారు.

"పోకిళ్ళ బోకు !" అన్నాడు శాస్త్రిగారితో 'రాజా' గారు.

"అలాగే ఉంటుందిలే నీకు" అన్నాడు శాస్త్రిగారు.

బండి శాస్త్రిగా రింటి దగ్గర ఆగింది. 'రాజా' గారిని వారించి బాడుగ తానే చెల్లించి మిత్రుడితో సహా ఇంట్లోకి వచ్చాడు శాస్త్రిగారు. తమ గదిలో కూర్చున్నాక "మరి ఈ సంబంధం కుదిర్చినందుకు ఏమిస్తావురా బహుమానం ?" అన్నాడు శాస్త్రిగారు నవ్వుతూ.

"నువ్వు కోరింది. అవునుగాని అతను నీకు చుట్టమా ?" అన్నాడు 'రాజా' గారు.

"మా మేనత్తకొడుకు" అన్నాడు శాస్త్రిగారు.

మాలతి గుమ్మంలోకి వచ్చి "వంటయింది నాన్నా. భోజనాలకి లేవొచ్చు" అన్నది.

శాస్త్రిగారు లేచి "ఇప్పుడే వస్తాను రాజా!" అంటూ కూతురు వెంటే వంటింట్లోకి వచ్చాడు.

అన్నపూర్ణమ్మగారు కూతుర్ని "వదినగారు అమ్మాయి కూడా తినేస్తారేమో కనుక్కోవమ్మా" అని చెప్పి పంపి భర్తతో "ఏమయింది వెళ్లిన పని ?" అన్నది.

"ఏంటే ! ఏమిటి నీ కూతురు అలా ఉంది ?" అన్నాడు శాస్త్రిగారు.

"మీ రటు వెళ్లగానే సారథి వచ్చాడు" అన్నది. అన్నపూర్ణమ్మ.

"ఎందుకు ?" అన్నాడు కోపంగా శాస్త్రిగారు.

"అతని కేదో మెడికల్ కంపెనీలో అకౌంటెంటు ఉద్యోగం వచ్చిందట. అది చెప్పి పోదామని వచ్చి వాళ్ల అమ్మనూ, చెల్లెల్నీ చూసుకు వెళ్లాడు" అన్నది అన్నపూర్ణమ్మగారు.

"అమ్మా చెల్లెలూ ఎవరు ?" అన్నాడు విభ్రాంతితో శాస్త్రిగారు.

"అతను మీ రాజశేఖరరావుగారి కొడుకుట" అన్నది అన్నపూర్ణమ్మ.

* * *

"రసగంధాయంలోకి వచ్చామన్న మాట ?" అన్నాడు లక్ష్మీనారాయణగారు సారథి చెప్పిందంతా విని.

రిక్షా జనాన్ని తప్పించుకుంటూ పరుగెత్తుతోంది. సన్నగా పొద్దున జల్లు పడటం మూలంగా వాతావరణం మరీ వేడిగా లేదు. జనం చెమటలు తుడుచుకుంటూ తిరుగుతున్నారు. కాఫీహోటళ్ల రేడియోలు మోగిపోతున్నాయి.

"నే నక్కడికి రావడం బాగుండదేమో మాస్టారూ ?" అన్నాడు సారథి.

"కబుర్లు చెప్పకు పంతులూ ! అలా అనుకునేవాడివి వూర్నించి రాంగానే అక్కడి కెందుకు వెళ్లావు ?" అన్నాడు లక్ష్మీనారాయణగారు నవ్వుతూ.

"అప్పుడు నాన్నా వాళ్లూ వచ్చారని తెలీదు గదా ?"

"పాపం .... ఇల్లొచ్చింది. దిగు" అన్నాడు లక్ష్మీనారాయణగారు.

రిక్షా ఆగింది. ఇద్దరూ దిగారు. వీధి వరండాలో రాజశేఖరరావుగారు, శాస్త్రిగారు నిలబడి ఉన్నారు. సారథిని చూడగానే రాజశేఖరరావుగారు ఏమీ మాట్లాడకుండా వూరుకున్నాడు. శాస్త్రిగారు మాత్రం "పంక్చువాలిటీ అంటే ఇలా గుండాలిరా లక్ష్మీ !" అన్నాడు నవ్వుతూ.

"సహవాసదోషం బావా" అన్నాడు లక్ష్మీనారాయణగారు సారథిని చూపిస్తూ.

నలుగురూ లోపలి కొచ్చి హాల్లో కూర్చున్నారు. అప్పటికే బల్లమీద నాలుగు పళ్లేలలో ఫలహారాలు పెట్టి ఉన్నాయి. అప్పటికి తెప్పరిల్లిన రాజశేఖరరావుగారు "టిఫిన్ తీసుకోండి" అన్నాడు.

"మా అమ్మ రాలేదా ?" అన్నా డాతడు నవ్వుతూ.

"ఏం ?" అన్నాడు శాస్త్రిగారు.

"కలికేతే అతక దంటుందిలెండి. అందుకని". శాస్త్రిగారు నవ్వాడు. రాజశేఖరరావుగారూ చిన్నగా నవ్వాడు.

"ఈ సంబంధం విషయంలో ఆ పట్టింపు లేదులేరా అబ్బాయ్ !" అన్నది లక్ష్మీనారాయణగారి తల్లి లోపలినుంచి.

"ఎందుకనో ?"

"సారథి చెల్లెలని తెలిసిపోగానే సంబంధం ఖాయ మయిపోయిందిగదా ?"

"పోయింటే" అన్నాడు లక్ష్మీనారాయణగారు అతని వంక చూసి.

సారథి మవునంగా టిఫెన్ తినసాగాడు. తండ్రి వంక సూటిగా చూడలేకపోయాడు. నాలుగు సంవత్సరాల క్రితం ఆయన వ్యసనాలు మానుకోమని పోట్లాడి ఆయన మానుకోకపోతే తాను ఇల్లువిడిచి , వచ్చేశాడు. ఈనాడు ఆయనలో పూర్తి మార్పు కనబడుతోంది. తన ఆశయం నెరవేరింది.

అతను క్రీగంట తండ్రివంక చూసి తల పక్కకు తిప్పేసుకున్నాడు. ఆయన కొడుకువంకే చూస్తున్నాడు.

లక్ష్మీనారాయణగారు రహస్యం చెబుతున్నట్లు "ఈ రెండో పెళ్లి చూపులు బాగున్నాయికదూ బావా ?" అన్నాడు రాజశేఖరరావుగారికి వినపడేలా.

శాస్త్రిగారు గ్రహించి పకపకా నవ్వాడు. "చాలించరా లక్ష్మీ. కొన్నాళ్ళు పోనీ" అన్నాడు.

లోపల్నుంచి తల వంచుకున్న శ్రీదేవి మెల్లగా వచ్చి తండ్రి పక్కన కూర్చుంది. మాటలు మానేసి కాఫీ తాగుతూ ఆమెను చూడసాగాడు లక్ష్మీనారాయణగారు.

"మా అమ్మాయికి.... బి. యే. వరకు చదువు చెప్పించాను. అంతగా సంగీతం రాకపోయినా పాడగలదు" అన్నాడు రాజశేఖరరావుగారు. సారథి తండ్రి వంకా చెల్లెలి వంకా ఆశ్చర్యంగా చూశాడు. శ్రీదు అప్పుడే బి. యే. పాసయిందా ?

కొంతసేపయినాక శ్రీదేవిని తీసుకువెళ్లి లోపలకు, తిరిగి వచ్చాడు రాజశేఖరరావుగారు కూర్చున్నాక.

"లాంఛనాలు మీరు కోరిన రీతిగానే జరిపిస్తాను. మీ అభిప్రాయం తొందర్లో తెలియజెయ్యండి" అన్నాడు.

"ఇంకా తెలియజేసేదే ముందిరా !... వాళ్ల కిష్టమే. ముహూర్తం పెట్టించటమే తరువాయి" అన్నాడు శాస్త్రిగారు.

లక్ష్మీనారాయణగారు కల్పించుకుని "మరి నీ కూతురు పెళ్లి సంగ తేమిటి బావా ? ఏదో సంబంధం చూశా నన్నావు ?" అన్నాడు.

"అది దాదాపు / నిర్ణయ మైపోయినట్లే" అన్నాడు శాస్త్రిగారు మిత్రుడి వంక చూస్తూ.

"ఏం మావగారూ ? అంతేనా ?" అన్నాడు లక్ష్మీనారాయణగారు.

"వాడికి అభ్యంతరం లేకపోతే నాకూ ఇష్టమే" అన్నాడు రాజశేఖరరావుగారు గంభీరంగా.

"ఏవయ్యా పెళ్లికొడకా ?" అన్నాడు లక్ష్మీనారాయణగారు.




చిత్రకారుడు : జి. సుబ్బాచార్యులు (జగన్నాథపురం)

"పెద్దల మాటలు వినాలిసిందే గదా ?" అన్నాడు సారథి చిరునవ్వుతో.

"మీ రడగండి మామగారూ. మా కయితే, ఇలాంటి సమాధానాలే చెబుతుంటాడు" అన్నాడు లక్ష్మీనారాయణగారు.

"కాదనడం వాడి తరమా ? ....ఏరా సారథీ! అంతే నా ?" అన్నాడు రాజశేఖరరావుగారు.

అదే కావలసింది. ఆ ఒక్కమాట గత సంవత్సరాల అపార్థాలను, అగాధాలను మాపివేసింది. వారి మనసులు కల్మషపూరితాలు కావు. నిర్మల మయినవి. నిర్భీకమూ, విశాలమూ అయినవి.

అయితే కొన్నాళ్ళు వారి మనసులపై మలినపు తెర పడింది. మంచికీ, చెడుకూ గల సరిహద్దు రేఖ జరిగి, చెరిగిపోయింది. ఒకరిలో స్వైర ప్రవృత్తి మరొకరిలా అందుకు వ్యతిరిక్తత ప్రభవించాయి. అయితే అది ఎన్నాళ్లో ఉండగల పరిస్థితి కాదు. పై మెరుగుల ఆకర్షణలోని పైశాచికత్వం కనపడగానే, స్వైరత్వం నశించి స్వధర్మం ప్రకాశిస్తుంది.

వ్యసనం అంతరించి వ్యాసంగం 'సత్' అవుతుంది.

"అంతే నాన్నా" అన్నాడు సారథి చెమరుస్తున్న కళ్ళు వత్తుకుంటూ. రాజశేఖరరావు మిత్రుడితో "అయితే ఒక్క షరతు శాస్త్రీ ! అమ్మాయి డిగ్రీ కోర్సు పూర్తి చేయించు. ఈలోగా వాడి ఎమ్. కాం కూడా అవుతుంది" అన్నాడు తేలికయిన హృదయంతో.

"అలాగే" అన్నాడు శాస్త్రిగారు.

లక్ష్మీనారాయణగారు సమస్య తీరినందుకు సంతోషించాడు.

ఆ మరుసటి రోజున క్రితం సాయంకాలం జరిగిన దంతా విన్న రాఘవరావు గుండెకాయ గాలిలో ఎనిమిది పల్టీలు కొట్టి సడెన్‌గా విరిచిపో...

అంతే 



# సాంఘికాలకు "చెడ్డకాలం"

**1959, 60** సాంఘికాలకు మంచికాలం. ఆయా సంవత్సరాలలో ఎక్కువగా సాంఘికాలే విడుదలైనవి. విజయ మొందిన వాటిలో కూడా అవే ఎక్కువ. గత మూడేళ్లలో కొత్తగా ప్రారంభించిన చిత్రాలలో కూడా సాంఘికాలే ఎక్కువ.

అయితే 1961 లో పరిస్థితులు మారుతున్న సూచనలు కనిపిస్తున్నవి. సాంఘికాలపై మోజు తగ్గుతున్నది. మోజు కంటె 'భరోసా' పోతున్నది. పెట్టుబడిపై అర్జనకు (రిటర్న్సు) సంబంధించి సంతవరకు పౌరాణికాలే క్షేమప్రదమనే (సేఫ్) అభిప్రాయం నిర్మాతలలో బలపడుతున్నది.

ఒక ప్రముఖ నిర్మాత చేసిన వ్యాఖ్య—'ఒక పౌరాణిక చిత్రం తలపెట్టినామూ అంటే ఫలితాను యిప్పుడే అంచనా వేయవచ్చు. రూపాయికి ఒక అణా అటూ యిటూలో లాభనష్టాలు చెప్పవచ్చు. సాంఘికం తలపెట్టినామూ అంటే ఇప్పుడు ఎన్ని అంచనాలు వేసుకొన్నా అసలు ఫలితం విడుదల అనంతరం కాని తేలదు. ఎందుకొచ్చిన రిస్కు. పౌరాణికాలతో 'బ్రిస్కు' గా బిజినెస్ చేసుకు పోవచ్చు.'

ఈ ధోరణితోనే ఎక్కువ మంది నిర్మాతల వ్యూహాలు పోతున్నవి.

ఇది ఇలా ఉండగా 'బి', 'సి' సెంటర్లలో (ముఖ్యంగా "సి" కేంద్రాలలో) బి. సి వాటి ఇతివృత్తాలకే ఆకర్షణ ఉంటున్నది. రెండవ వరుస మూడవ వరుస విడుదలలలో పౌరాణికాలపైన జానపదాలపైన మంచి వసూళ్లు ఉంటున్నవి. సాంఘికాలపై వసూళ్లు పైవాటితో పోల్చి చూస్తే చాలా తక్కువ. మొదటి వరుస విడుదలలో శతదినోత్సవాలు, రజతోత్సవాలు జరుపుకొన్న సాంఘికాలు మాత్రం రెండవ, మూడవ వరుస విడుదలలో నాలుగు రాళ్లు కళ్లజూస్తున్నవి కాని సగటు (ఏవరేజ్) సాంఘికాలకు ఆ రాళ్లయినా లేవు.

పౌరాణికాలు, జానపదాలు అయితే మొదటి వరుస విడుదలలో థియేటర్ల కొరతవల్ల నేమి, కొత్త చిత్రాల పోటీ తాకిడి విస్తారంగా ఉన్నందువల్ల నేమి తగినంత డబ్బు చేసుకోకపోయినా రెండవ, మూడవ వరుస విడుదలలలో ఆ నష్టం భర్తీ చేసుకొనే అవకాశం ఉంటుంది. కనీసం అట్టి అవకాశానికి ఆశ అయినా కన్పిస్తుంది. సగటు సాంఘిక చిత్రాలకు, అందులో మేటి నటవర్గం

శాంతికళా ఫిలిమ్స్‌వారి "శాంత" చిత్రంలో రేలంగి, మహంకాళి వెంకయ్య.



రాజ్ కపూర్ చిత్రం 'జిస్ దేశ్ మె గంగా బహతీ హై'లో పద్మిని.



కె. వి. ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి 'కన్నకొడుకు'లో కృష్ణకుమారి.

లేని సినిమాలకు అటువంటి అవకాశం కానీ, ఆశ కాని మరీ తక్కువకే మరీ మరీ తక్కువ.

సినిమా కేవలం వ్యాపారంగా చలామణి అవుతున్న యీ రోజులలో, డబ్బు చిక్కడం దుర్లభమవుతున్న ఈ కాలంలో—మనీ మార్కెట్ టైట్‌గా ఉన్న ఈ తరుణంలో, తక్కువ మంది తారలు, అంతకన్నా తక్కువ 'స్టార్ కాంబినేషన్'కు వీలు ఉన్న యీ దినాలలో ఏ పెట్టుబడిదారు అయినా సేఫ్ పౌరాణికాలపైనే డబ్బు వెచ్చించదలచడం, రిస్కీ సాంఘికాలపై దృష్టిని మరల్చదలచక పోవడం సహజమే కావచ్చు.

ఇవి ఇలా ఉండగా దాదాపు ఒకే తారాగణం కల సాంఘిక చిత్రాలు రెండు మూడు, ఒకటి రెండు వారాల ఎడంలో విడుదలైతే ఆ రెండింటిలో ఏదో ఒక్కటే డబ్బు చేసుకొంటుందనే అభిప్రాయం నిర్మాతలలో ఉంది అందుకు వారికి ప్రబల నిదర్శనాలు కన్పించినవి కూడా అలానే దాదాపు ఒకే ఇతివృత్తం కల, దాదాపు ఒకేతరహా పాత్రలు కల రెండు మూడు సాంఘిక చిత్రాలు మూడు నాలుగు వారాల ఎడంలో విడుదలైనా వాటిలో ఏదో ఒక్కటే డబ్బు చేసుకుంటుందని నిర్మాతల అభిప్రాయం ఈ రెండు తరగతుల చిత్రాలకు 'బి', 'సి' సెంటర్లలో మొదటి వరుస విడుదలలోనూ, దరిమిలా అన్ని సెంటర్లలో రెండవ మూడవ వరుస విడుదలలోను వసూళ్ళు సరిగా ఉండవు పౌరాణికాలకు, జానపదాలకు అయితే ఈ యిబ్బందులు ఉండవు కృష్ణులు, నారదుళ్ళ వేషంలో కన్పిస్తే చాలు—పాత్రధారుల వయసు ఎంతయినా యిబ్బంది లేదు బుట్టబొమ్మలకు ఆ వేషాలు వేసి ఆడించినా, ప్లేబ్యాక్ పాడించినా చెల్లుతుంది!

ప్రేక్షకులలో కరుడుగట్టిన అభిప్రాయాలు కొన్ని కలవని, వాటికి విరుద్ధంగా పోతే సాంఘికాలు దెబ్బతింటవని నిర్మాతల నిశ్చితాభిప్రాయమై ఉన్నది "కరుడుగట్టిన అభిప్రాయాలకు భిన్నమైనవి" అన్న పదాలకు "యాంటీ సెంటిమెంట్" అని తరుచు వాడుతూ ఉంటారు దీని ప్రకారం నిర్మాతలు అనుకొంటున్నది, నిజమని వారికి 'నిరూపితమైనది'' యిది—వితంతు పాత్రలకు వివాహం చెయ్యరాదు అన్నదమ్ముల పాత్రలు రెండు ఉంటే అన్న అన్నవాడు మంచివాడూ, తమ్ముడు అన్నవాడు దుర్మార్గుడు కావాలి అన్నను దుష్టునిగా చూపరాదు హీరోకు దుష్ట లక్షణాలు ఉండకూడదు నిర్ధనికురాలైన తల్లి కొడుకును కాపాడేందుకు అనివార్యపరిస్థితిలో దొంగతనం చెయ్యరాదు ప్రేమ ఫలించాలే కాని విఫలం కారాదు వగైరా వగైరా

నిర్మాతలు వీటిని నమ్మి 'ఛాందస మార్గం' లో పోడానికి ప్రబల నిదర్శనాలు వున్నా పాత్ర సృష్టి, సన్నివేశకల్పనా సహజంగాను, మిక్కిలి సామర్థ్యాతి సంపాదించేదిగాను ఉంటే చిత్రవిజయానికి ఢోకా లేదని "మళ్ళీ పెళ్ళి", "మాయింటి మహాలక్ష్మి", "పెళ్ళికానుక" ఇప్పటి సరికొత్త సాంఘికము నిరూపించినవి "యాంటీ సెంటిమెంట్" ను తమిళ ప్రేక్షకులు, హిందీ ప్రేక్షకులు సహించినంతగా తెలుగు ప్రేక్షకులు సహించకపోవడం శోచనీయమే అయితే, యింకా అనేక ఇతర కారణాలవల్ల చిత్రం దెబ్బతింటే, అన్నింటికీ 'యాంటీ సెంటిమెంట్' ముడిచి పెట్టి నిర్మాతలు ఛాందస మార్గంలో పోవడం ఇంకా ఎక్కువ శోచనీయమైన విషయం

సాంఘిక చిత్రాలు నిర్మించేవారిలో పదికి తొమ్మిది మంది బెంగాలీ, హిందీ కథలను అనుసరించి, లేదా రెండు మూడింటిని కలిపికొట్టి, వారికి లభ్యమయ్యే తారలకు పాత్రలు సందర్భమైనా, అసందర్భమైనా జోడించి, ఎక్కువ నిడివికోసం ఇంకా అనేక తోకలు చేర్చి కూర్చి చిత్రపు పట్టు విడచి సాము చేయడంవల్లనే పెక్కు చిత్రాలు దెబ్బ తింటున్నవి కథను చిత్తం వచ్చినట్లు చివరి నిమిషంలో కూడా మార్చడం, కథను పూర్తి చెయ్యకుండా సెట్సుకు వెళ్ళడం, నాటక ధోరణితో సంభాషణలు నడిపించి సినిమా విలువలు మంటగలపడం వంటి అనేక అనర్థాలు కూడా సాంఘికాల విషయంలో కానవస్తున్నవి

సాంఘికాలపై రెండవ వరుస, మూడవ వరుస



శ్రీ కాంత్ ప్రొడక్షన్స "సతీసులోచన"లో కాంతారావు, రాజశ్రీ.

# వార్తాభరణి

**1960** అంతంలో బొంబాయిలో విడుదలైన "అంచల్" హిందీ చిత్రాన్ని తెలుగు, తమిళభాషలలో పునర్నిర్మించేందుకు ఒక తెలుగు ఫిలిం సంస్థ హక్కులు కొన్నది.

*　　*　　*

చెన్నపట్టణంలో ఫిబ్రవరి ఒకటవతేదీ నుంచి ఏడవతేదీవరకు హంగేరియన్ చలన చిత్రోత్సవం జరిగింది. బాలల చిత్ర ప్రదర్శనశాలలో "హౌస్ అండర్ దిరాక్స్" "ఎ" "సన్ షేర్ మూన్స్" "వాట్ ఎ నైట్" రెడ్ ఇంక్ అనే ఫీచర్ చిత్రాలు "బిగుడ్ అన్‌టిల్ డెత్" అనే బాలల చిత్రం ప్రదర్శించారు. భారత ఫిలిం సొసైటీల సమాఖ్య ఈ ప్రదర్శనను నిర్వహించింది. సమాఖ్యకు శ్రీ సత్యజిత్ రాయ్ అధ్యక్షులు. పెద్ద పేర్కొన్న చిత్రాలలో మొదటి రెండూ అంతర్జాతీయ ఖ్యాతి ఆర్జించినవి హంగరీలో 20 వ శతాబ్దారంభంనుంచి మాత్రమే చలన చిత్ర నిర్మాణం జరుగుతున్నది. జిస్టావిస్కీ 1901 లో తయారు చేసిన "డాన్స్" మొదటి హంగరిజన్ చిత్రం. 1898 లోనే "అడ్వెంచర్ ఇన్‌సియాఫోక్" అనే అంగరిజన్ చిత్రం ప్రదర్శించబడినట్లు మరొక వాదనకూడా కలదు.

1945 లో ఫిలిం పరిశ్రమను ప్రభుత్వం జాతీయం చేసింది. హంగరియన్ డాక్యుమెంటరీ చిత్రాలు, కార్టూన్, పప్పెట్ తదితర చిన్న చిత్రాలు ఫీచర్ చిత్రాలకంటె ఎక్కువ బహుమతులు సంపాదించినవి గత పదేళ్ళలో ఈ విజ్ఞానదాయక చిత్రాలు అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలలో 28 బహుమతులు సంపాదించినవి హంగరీలో ప్రస్తుతం ఏడాదికి సగటున 20 ఫీచర్ చిత్రాలు నిర్మిస్తున్నారు. ప్రతిగ్రామంలోను ఒక పర్మినెంట్ థియేటర్ వుండడం మరొక విశేషం ★

*　　*　　*

బ్రిటిష్ రాణి ఎలిజబెత్ ఫిబ్రవరి మూడవ వారంలో మద్రాసు సందర్శించినప్పుడు రాజభవన్‌లో ఫిలిం తారల నాట్యప్రదర్శనాలు ఏర్పాటు చేస్తున్నారు వైజయంతిమాల, పద్మిని, రాగిణి, కమల ఆ ప్రదర్శనాలలో పాల్గొంటారు.

---

విడుదలలో ఆదాయం ఎక్కువ ఉండక పోవచ్చు అయినా జానపదాలు, పౌరాణికాల కంటె తక్కువ వ్యయంలో తక్కువ కాలంలో నిర్మించడానికి పొందికాలే అనువైనవి 'ప్లానడ్ ప్రొడక్షన్" —పకడ్బందీ అయిన పద్ధతిలో చిత్రనిర్మాణం సాగిస్తే సాంఘిక మంత క్షేమప్రదమైన చిత్రం మరొకటి ఉండదు ★



విలియమ్‌గోట్జ్ చిత్రం 'సాంగ్‌విత్‌ౌట్ ఎండ్'లో ఒక సన్నివేశం.

---

## పియానో విద్వాంసుని జీవిత చిత్రం

# 'సాంగ్ విత్‌ౌట్ ఎండ్'

**19** వ శతాబ్దంలో యూరోపు అండాన్ని పియానో సంగీతంతో ఉర్రూత లూగించిన హంగరియన్ విద్వాంసుడు శ్రీ ఫ్రాంజ్ లిస్జ్‌ట్ (1811—1886) జీవిత సాగర వినోద విషాద తరంగాల చిత్రం "సాంగ్ విత్‌ౌట్ ఎండ్" మద్రాస్ సఫైర్ థియేటర్‌లో విడుదలయింది. ఒకటవ తేదీన పత్రికా ప్రతినిధులకు ఈ సినిమాస్కోప్ ఈస్ట్‌మన్ కలర్ చిత్రం ప్రత్యేకంగా చూపించారు

లిస్జ్‌ట్ సంగీతంలో తన్మయులై భర్తను విడిచి ఈ విద్వాంసుని నిత్యసాహచర్యం కోరిన తరుణులున్నారు కౌంటెస్ మేరీ (జెనివీవ్‌పేజ్) తన భర్తను విడచి అనేక సంవత్సరాలు లిస్జ్‌ట్‌తో గడిపింది లిస్జ్‌ట్ పియానో వాద్య సంగీత కచేరీలు జరుపుతూ యూరోపులో పర్యటించినప్పుడు రష్యన్ రాకుమార్తె ఒకర్తె (కపూసైన్) లిస్జ్‌ట్ సంగీతానికి పరవశురాలై ఆయన అర్థాంగి కాదలచు తుంది కాని ఆమె భర్త (ఇవన్ డెస్నీ) విడాకులివ్వక కొత్త వివాహానికి అడ్డు తగులుతాడు పుట్టుతురకు విడాకులు సంపాదించ కలుగుతుంది. కాని లిస్జ్‌ట్ శృంగార పురుషుడు కావడంచేత క్రైస్తవ మతాధికారి, తొత్యశోభవారు అనుమతియివ్వరు లిస్జ్‌ట్ మధుర సంగీత జీవితాన్ని ఈ విషాద గీతిక దుర్భరం చేస్తుంది.

"సాంగ్ విత్‌ౌట్ ఎండ్" (పియానో) సంగీత ప్రధాన చిత్రమయినప్పటికీ లిస్జ్‌ట్ జీవితానికి నేపథ్యంగా ప్రేమ కథ ఉన్నందువల్ల, కట్టు కథ చిత్రంగా ఒప్పింది శ్రీ లిస్జ్‌ట్ రాజులు, రాకుమారులు కంటె కళనే విలువైనదిగా పరిగణించిన రీతి, ఆయన దాతృత్వం చక్కగా చిత్రించారు. పియానో కచ్చేరి దృశ్యాలను మరువలేనంతటి మనోహరంగా చిత్రీకరించారు

బ్రిటిష్ నటుడు డిర్క్ బొగార్డె శ్రీ లిస్జ్‌ట్‌గాను, ఫ్రెంచి సుందరి కపూసైన్ రష్యన్ రాకుమార్తెగాను సహజంగా నటించిన ఈ అమెరికన్ చిత్రానికి శ్రీ ఛార్లెస్ విడార్ దర్శకుడు. శ్రీ విలియమ్స్ గోయెట్జ్ నిర్మాత

చిత్రపు ఈస్ట్‌మన్ కలర్ టెక్నికలర్ అంత శోభాయమానంగా ఉంది

సంగీతాభిమానులు తప్పక చూడవలసిన చిత్రం. ★

# మిథ్యాసుందరి

(36-వ పేజీ తరువాయి)

ఒక్కొక్కప్పుడు ఇల్లు వదలి ఎక్కడికైనా పారిపోదామనిపించేది. ఆత్మహత్యగురించి ఆలోచించాను కూడా. రెండు మూడు నెలలు గడిచేసరికి నాలో ఏదో లోపం ఉందన్న సంగతి విశదమైంది. కాని దాని రూపురేఖలు నిర్ణయించలేకపోయాను. డబ్బు — ఆరోగ్యం — హోదా అన్నీ వున్నాయి. కాని ఏదో అగాథం—సిగరెట్లు మొదలు పెట్టాను. ఎవరో బ్రాంది తాగమన్నారు. అప్పుడప్పుడు అది కూడా ప్రారంభించాను. చెడు అలవాట్లు పరిస్థితుల ప్రోద్బలం వుంటేనేకాని రావు. నేను జీవిత లక్ష్యంలోంచి దిగజారిపోతున్నానని తెలుసు. కాని నాఅంతట నేను అడ్డుపడలేను—'

బండి ఆగింది. హరి స్టేషనులో ఎవర్నో గుర్తుపట్టి గబగబ దిగివెళ్ళి కలుసుకుని మాట్లాడసాగాడు. సుందరికి ముళ్ళమీదున్నట్టుంది. ఏదో పుస్తకం చదవబోయింది—దృష్టి కేంద్రీకృతం కాలేదు.

'నా క్లాస్ మేట్—పెళ్ళిచేసుకుని హాయిగా వున్నాడు' అంటూ తిరిగివచ్చాడు హరి. అతని మాటల్లో ఎక్కడో అసూయ ధ్వనించింది. బండి కదిలేసరికి, కథకూడా కదిలింది—

'అప్పుడే నా జీవితంలో మొదటిసారిగా మెరుపు మెరిసింది. ఏదో పెద్ద ఎగ్జిబిషన్. మనశ్శాంతికోసం బయలుదేరాను. దారిలో ఒకరిద్దరు పెద్దలు ఎదురై యోగక్షేమాలు విచారించి, నాన్నను వేనోళ్ళ పొగిడి పెళ్ళిచేసుకోమన్నారు. ఎగ్జిబిషన్‌లో చూడవలసిందేమీలేదు. మనం రోజూ చూసేవస్తువుల్నే ఫ్లగిపీలతో ప్రదర్శించారు — అక్కడే, ఆస్టాలుదగ్గరే ఆ అమ్మాయి నాకు కనపడింది.' హరి గట్టిగా నిట్టూర్చాడు. ఆమె రూపం కళ్ళముందు కనిపించి ఉంటుంది.

'వర్ణించేందుకు నేను కవినికాను. కళ్ళున్న ఏయువకుడైనా ఆమెను అందాలబొమ్మనే అంటాడు. బరువెక్కి ఆవులించే సౌందర్యం— కళ్ళ కదలికలతో మహాకావ్యాలు సృష్టించగలిగిన ఆ అమ్మాయి మూగదైతేమాత్రం ఏం పోయింది ? లోపల అద్దాన్ని దాచుకుని వెక్కిరిస్తున్న చెంపలు, మెడలో చిన్న గొలుసు, ఓ చేతికి వాచీ, మరో చేతిలో పుస్తకం— అలా ఆమెకేసి చూడటం సభ్యతకాదనుకుని ఏవో బట్టలు కొన్నాను. ఆమె కూడా ఏవో కొని 'ఈ పుస్తకం కూడా దానితో పేక్ చేయండి' అంది తియ్యగా. మా ఇద్దరిపేకెట్లు తయారయ్యాయి. ఎవరో జేబుదొంగ ఓ పెద్దమనిషి పర్సుమీద కన్నేసి కొట్టేశాడు. మరొకరెవరో దొంగను పట్టుకుని చావబాదుతున్నారు. ఆదృశ్యం చూస్తూ నిలబడ్డాను. వెనక్కి తిరిగిచూసేసరికి ఆ అమ్మాయి అక్కడ లేదు. ఎందుకో ఆమెను మళ్ళీ చూడాలనిపించింది. కాని ఎలా ? ఎప్పుడు ? ఇవీ సమస్యలు—పేకెట్ బరువుగా ఉందని అనుమానంగానేవుంది. విప్పి చూసేసరికి నా అనుమానం నిజమైంది. అది ఆ అమ్మాయిది.

'ఒకరి వస్తువులు నేను చూడను. కాని అట్టమీది బొమ్మ ఆకర్షణీయంగా ఉండటంతో పేజీలు తిరగవేసేసరికి ఓ చిన్న కాగితంమీద ముత్యాల్లాంటి అక్షరాలు కనిపించి, ఆమె పేరు, చిరునామా తెలియజేశాయి. సుందరి సౌందర్య లక్ష్మికి ప్రతిరూపం—'

కథ ఆగింది. సుందరి ఉలిక్కి పడింది. తన కథానాయికకు తన పేరే పెట్టటంలో అంతరార్థం ?.... ఒకవేళ తన్ను ఏడిపిస్తున్నాడా ?

'నా ఏకాంతమందిరంలో చీకటిని చీల్చుకుంటూ ఆమె అటూ ఇటూ కదిలింది. పుస్తకం తిరిగి ఇచ్చేయటానికి నిశ్చయించాను. దాని ఖరీదు రెండు రూపాయలు. సుందరి కొనుక్కోలేకపోతుందనికాదు. నా నిజాయితీ రుజువుచేసుకుందామని — అదీకాదు— అంతాఅబద్ధం—ఆత్మవంచన—సుందరిని చూడాలని, మాట్లాడాలని ఆకాంక్ష, అణచుకోలేనికోరిక—అద్దం

> ఒకడు —మొన్న వెన్నెల రాత్రినాడు నేను గాడిదలా ఉన్న దయ్యాన్ని చూశాను.
>
> వేరొకడు — బహుశా నీ నీడనుచూసి అలా భ్రమపడి ఉంటావు.
>
> —వి. లక్ష్మణరావు (వాల్తేరు)

ముందు నిలబడి నా ముఖంకేసి చూసుకున్నా— నాన్నపోయాక, మొదటిసారిగా ఇదే నన్ను నేను చూసుకోటం—ఎందుకో అందంగా ఉన్నాననిపించింది.'

'అనిపించటమేవిటి ?' అనుకుంది సుందరి.

'ఆ మరునాడు అడ్రసు ప్రకారం బయలుదేరి వెళ్ళాను—తలుపుతీసేవుంది. హాల్లో ప్రవేశించేసరికి సోఫాలో కూర్చున్న సుందరి కనిపించింది. అక్కడ మరెవరూ లేరు. అంతా నిశ్శబ్దంగా ఉంది.'

సుందరి నిట్టూర్చి వెనక్కి జారబడింది.

'నేను మొదట్లోనే చెప్పాను. నా కథ మిమ్మల్ని విసిగిస్తుందని....'

సుందరి నొచ్చుకుని 'అలా అనకండి—మీ కథ వింటూంటే ఏం తోచటంలేదన్నసంగతి కూడా మర్చిపోయాను' అంది.

'సుందరి తృళ్ళిపడి లేచింది. ఆనాడు జడలో దాక్కున్న ఆమె కురుల సౌందర్యం, తలంటుకోగా మనసును చికాకుపర్చింది. మందహాసంచేసి 'ఏం కావాలి మీకు ?' అనడిగింది. నేను జరిగినదంతా వివరించాను.

'థాంక్స్. అలా కూర్చోండి. ఇప్పుడే వస్తాను' అని పుస్తకం అందుకుని రెండడుగులు ముందుకువేసి ఆగి 'కొంచెం ఆలస్యమవుతుంది—కాస్త సంగీతం వినండి' అని రేడియో ట్యూన్‌చేసి లోపలికి వెళ్ళింది. ఏదో విరహగీతం వంపులుతిరిగిపోతోంది. పావుగంట గడిచాక సుందరి టిఫిన్—కాఫీ తీసుకొచ్చింది.

'పది నిమిషాల్లో ఒకర్నిగురించి మరొకరు పూర్తిగా తెలుసుకున్నాం. ఆమెతండ్రి ఓ పెద్ద బట్టల మిల్లు యజమాని. మా నాన్నకుమల్లే అతనికి పొలం—బంగళాలూ వున్నాయి. అభిరుచులు కూడా ఐక్యమయ్యాయి. యూల్ బ్రన్నర్ నటన ఆమెకిష్టమైతే నాక్కూడా—కింగ్‌కాంగ్‌కంటె దారాసింగ్ బలమైనవాడని ఆమె అంటే నేను ఎదిరించలేదు. బాపిరాజులా ప్రపంచంలో బొమ్మలు ఎవరూ గీయలేదని నేనంటే ఆమె వెంటనే అంగీకరించింది. అలా అనుకోకుండా అభిప్రాయాలు ఏకమయ్యాయి. తిరిగి వచ్చేస్తూంటే ఆమెను ఎలా కలుసుకోవాలో, ఎప్పుడు కలుసుకోవాలో తెలిసిందికాదు.

'ఆతరువాత వారంరోజుల్లో ఆమెను అనుకోకుండా రెండు మూడు సార్లు సినిమాలో, బీచ్‌లో కలుసుకున్నా. హృదయాలు మరింత దగ్గరకు వచ్చాయి.

'ఓనాడు సాయంత్రం —

'సుందరిని చూడాలనే కోరిక కట్టలు తెంచుకుని ఉరకలువేస్తోంది. ఈ వారం రోజుల్లో ఆమెను పూర్తిగా అర్థం చేసుకున్నాననే అనుకున్నా. మాటలూ, చేతలూ పరీక్షించి ఓ నిర్ణయానికి వచ్చాను. ఆమె నన్ను ప్రేమిస్తోంది. సుందరి తండ్రితో పరిచయం చేసుకుని ఎలాగైనా పెళ్ళి చేసుకోవాలి. ఆలస్యమెందుకని బయలుదేరితే ప్రకృతి బెదిరించింది. ఆకాశమంతా మబ్బులమయం, అక్కడక్కడా కనిపించి మాయమవుతూన్న వెలుగుముక్కలు — మెరుపులు—దూరంగా ఉరుములు—ఈశానలో వెళ్ళటం తెలివి తక్కువ. సుందరి ఏవిధంగా అర్థం చేసుకుంటుందో ఏమో మరి— ప్రకృతిని నిందిస్తూ గదిలో కూర్చున్నా —

'ఇంటిముందు ఓ కారు పెద్దగా చప్పుడు చేస్తూ ఆగింది. ఏక్సిడెంటేమోనని బయటకువచ్చి చూశాను. గాజుతలుపుల మీదుగా జారుతున్న నీటిబిందువులగుండా సుందరిముఖం పొడుగ్గా కనిపించింది. పరుగెత్తుకువెళ్ళి ఇంట్లోకి తీసుకువచ్చాను.

'అనుకోకుండా కలుసుకున్నాం' అంది చెదరిన ముంగురులు సరిచేసుకుంటూ. ఆగదిలో ఏదో చిత్రమైన దీపం వెలిగినట్టనిపించింది నాకు.

'అవును. మీరు వద్దనుకున్నా విధి మిమ్మల్ని లాక్కొస్తోంది' అన్నాను ఎత్తిపొడుపుగా.

సుందరి కోపంగా చూసింది.

'అలాంటి అభిప్రాయం నాకుంటే మీయింటికెందుకొస్తాను ?'

'కారు పాడైంది. ముందుకు కదలటంలేదు. గత్యంతరంలేదు.'

'అలాగా !....బాగు చేయటం నాకు చేతనవును. వస్తాను' అంటూ కదలబోయింది. పరిహాసం ప్రమాదంగా పరిణమిస్తుందని చనువుగా చేయి పట్టుకుని ఆపాను. సుందరి ఏమీ అనక చిన్నగా నవ్వింది. ఇల్లంతా చూపించాను. మేడమీది నాగది చూపకూడదనుకున్నాను. కాని సుందరి వదల్లేదు. అక్కడక్కడావున్న బ్రాందీ సీసాలు, జుగుప్స

కరమైన చిత్రాలు — అన్నీ ఆమెకంటబడ్డాయి. సుందరి నాగురించి ఏమనుకుంటుందో ముఖ భావాలనుండి తెలుసుకోటానికి ప్రయత్నించాను. ఎప్పటికి మల్లే నవ్వుతూ ఉంది. అది ఊహాకందని అగాధం.

'పేటితోబాటు సిగరెట్లు వుండితీరాల్సిందే ! మరి మీరు కాలుస్తుండగా నేనెప్పుడూ చూడలేదు సుమండీ' అంది మెట్లు దిగి వస్తూ—

చిన్నగానవ్వి, సమాధానంగా సిగరెట్ వెలిగించాను.

'అరగంట గడిచాక వర్షం బాగా తగ్గిపోయింది. సుందరి కారు బాగుచేసుకుని కదలిపోయింది. సుందరి నాగురించి ఏమనుకుంటుందని మీ అభిప్రాయం?' అని ఆగిపోయాడు హరి.

'అతనేదో కథ చెప్తాడు—కాలక్షేపానికి విందామనుకున్న' సుందరి ఉలిక్కిపడింది. ఆ ప్రశ్నకు ఏమని సమాధానం చెప్పటం ?

'చెప్పండి సీతాపతిగారూ!' అని రెట్టించాడు.

'సుందరి శ్రీమంతురాలంటున్నావ్ — ఇలాంటి దురభ్యాసాలు వాళ్ళకు సహజం. అందుకని ఆమె నిన్ను మంచిగానే అర్థంచేసుకునుండాలి. అదీకాక ఎలాంటి నిరసనభావన కనపర్చలేదు. మనోభావాలను పూర్తిగా దాచివుంచటం ఎవరితరమూ కాదు—'

హరి నవ్వాడు.

'అక్కడే మీరు పొరబడ్డారు. నేను ముందే చెప్పాను. ఆమె హృదయం సముద్రంకంటె లోతైనది. అందులో ఏం ఉన్నది తేలిగ్గా అర్థం కాదు. ఆ తరువాత వారంరోజులు సుందరి ఎక్కడా కనపడలేదు. ఏరోజుకారోజు ఆమెను చూద్దామనుకోటం—అభిమానం అడ్డుపడటం—జరుగుతూ వచ్చింది. చివరకు నేనే వెళ్ళాను ఓనాడు. సుందరి నవ్వుతూ ఆహ్వానించింది. కాఫీ అందించింది.

'ఏమండోయ్ ! మా ఇంట్లో కాఫీ తప్పించి బ్రాందీ దొరకదు. అతిథిసత్కారం సరిగ్గా జరగనందుకు మన్నించండి—' అంది. గుండెను చీల్చివేశాయి ఆమాటలు—అందులోవున్న వ్యంగ్యం నా కర్థమైంది. ఆమె కేం సమాధానం చెప్పాలో తెలియక నవ్వేసి గోడకేసి చూశాను.

'మీ గది గోడలమీదవున్న చిత్రాల్లాంటివి ఇక్కడ లేవండి—మీకోసమైనా తెప్పిద్దామంటే నాన్నగారు కోప్పడతారు'. మరో గుండు దూసుకుపోయింది. సుందరిముఖంకేసి చూశాను.

'ఎక్కడో-ఏమూలో-ఆ చిరునవ్వుమధ్య కాఠిన్యం కనిపించింది. నేను లేచి ఆమెకు దగ్గరగా వెళ్ళాను.

'సుందరీ !....నన్నెందు కిలా ఏడిపిస్తావ్ ?.... దురభ్యాసాలున్న మాట నిజం. ఒకమనిషి పతనమైనంతమాత్రాన అతనికి భవిష్యత్తు లేదనుకోటం పొరపాటు. పరిస్థితుల ఒత్తిడికి ప్రతివాడు తనకూ, సంఘానికీ, సహచరులకూ ఇష్టంలేని పనులు ఎన్నో చేస్తాడు. చెడు అలవాట్లను దండగా గుచ్చి మెడలో వేసుకుంటాడు. అది తనకు సౌందర్యాన్నిస్తుందని, నలుగురూ అందల మెక్కిస్తారని కాదు. అలాగైనా వాస్తవికతకు మత్తుమందు జల్లి అల్పానందం అనుభవిద్దామని. అలాంటి వ్యక్తుల్ని అసహ్యించుకోరాదు....'

సుందరి ఆశ్చర్యంతో నాకేసి చూసింది. బహుశః ఆమె ఊహించని భావాలను వెలిగక్కివుంటాను.

'మీ భావాలు విశాలమైనవే — పునర్జన్మ ఉన్నదని నమ్మినప్పుడు మీరు మంచిగా ఎందుకు మారకూడదు ?.... అలా స్వచ్ఛతపొందాక నాకు కనిపించండి—చాలు' అంది.

'సుందరికి సమాధానం చెప్పకుండా, చకచకా నడిచి వచ్చేశాను. చిత్తం వచ్చినట్లు నా అంతరంగికాన్ని విమర్శించినందుకు ఒకవంక కోపం, నిజాన్ని ఎత్తిచూపినందుకు మరోకవంక పశ్చాత్తాపం—ఒక దానితో ఒకటి పెనగులాడాయి. అలా నడుస్తూ నడుస్తూపోయి ఏకాంతంగా సముద్రపు ఒడ్డున కూర్చున్నా. ప్రతి నీటిబిందువులోనూ సుందరి సుందరరూపం కనిపించింది. నీటి బిందువు అణువులుగా విడినప్పుడుమాత్రం ఆమె రూపం అంతరించి, 'స్వచ్ఛతపొందాక నాకు కనిపించండి. చాలు' అన్న మాటలు వెలువడ్డాయి. పదే పదే అదే సంబోధన.

'అస్తమిస్తున్న సూర్యుడు ఏదో సందేశం అందించిపోయాడు. వేళ్ళమధ్య తగలడుతున్న సిగరెట్ను కోపంతో అలల మధ్యకు విసిరేశాను. చొక్కా జేబులో వున్న సిగరెట్ కేస్ తళుక్కుమంది. తెరవగానే సంగీతం పాడుతుందని విదేశంనుండి తెప్పించాను. ఏవేవో నిర్ణయాలు చేసుకుని వెర్రి ఆనందంతో ఇంటికి తిరిగి వచ్చాను.'

హరి, కథ ఆపుచేసి సిగరెట్టు వెలిగించాడు. చీకటిపడింది. సుందరి కిటికీలోంచి బయటకు చూసింది. వంకరగా తిరిగి పోతున్న రైలు నల్ల త్రాచులా కనపడింది. చలిగాలి జివ్వున కొడుతోంది. అంధకారంలో అసహాయుడి ఆర్తనాదంలా ఇంజను కూతపెట్టింది.

'ఆతరువాత నాలో వచ్చిన మార్పును మీరు ఊహించగలరు' అన్నాడు హరి.

సీతాపతి తల నిలువుగా ఆడించి 'అవును. ఆనాటినుండి క్రమజీవితాని కలవాటుపడివుంటావు. సిగరెట్లు కాల్చటం, బ్రాందీ తాగటం, వేళాపాళా లేకుండా దేశదిమ్మరిలా తిరగటం మానుకునుంటావు. జుగుప్సాకరమైన చిత్రాలు తీసిపారేసి, ఆధ్యాత్మికచింతనను, విజ్ఞానాన్ని ప్రసాదించే పటాలు తగిలించివుంటావు' అన్నారు.

'హరి తృప్తిగా నవ్వి, మీరన్నది నూటికి నూరుపాళ్ళు... వంతులు నిజం—ఆతరువాత కథను పూర్తిచేసేయండి' అన్నాడు. సుందరి అసంతృప్తిగా నిట్టూర్చింది. పసందుగా సాగుతుందనుకున్న కథ అలా ప్రేమవివాహంలో ముగింపుకావటం ఆమెకు సుతరామూ ఇష్టంలేదు. అలా శుభాంతమైవుంటే ఈ అబ్బాయి శోకమూర్తిలా ఇలా ఎందుకు విలపిస్తూ కూర్చుంటాడు ?....కనుక ఆతరువాత ఏదో దారుణమైన సంఘటన జరిగివుండాలి. ఒకవేళ సుందరి చనిపోయిందేమో !....సీతాపతి మెల్లగా దగ్గారు.

'ఆతరువాతి కథ బహు సులభం. నువ్వు రుజుమార్గంలో పడ్డావని రుజువుకాగానే సుందరి నీ మెళ్ళో దండవేసి ఉంటుంది. కొంతకాలం ఆనందంగా జీవితనౌక పయనించిఉంటుంది .ఆ తరువాత ఏదో ట్రాజెడీ....' ఆయన ఎలా ముగించాలో తెలియక ఆగిపోయారు.



చిత్రకారుడు—ఎమ్. రతన్ (ఆలూరు)

హరి అసలే బాధలో ఉన్నాడు. తనేమైనా అంటే పుండుమీద కారంలా పని చేస్తుంది. అందుకే మాటల్ని జాగ్రత్తగా ఏరుకుని వాడారు. అందు కనుగుణంగా ముఖభావాలుకూడా ప్రదర్శించారు.

'సీతాపతిగారూ !....మళ్ళీ పొరబడ్డారు. అసలు మా వివాహం జరగనేలేదు....'

సుందరి ఉలిక్కిపడింది.

'అంటే ?....' అనడిగింది అమ్మ.

బండి వెలుగుమధ్య ఆగింది. ప్లాటుఫారంమీద వెండర్ల రొద ఆకాశంవరకూ పరుగెత్తింది.

'మీరు భోజనంచేయరా ? .... ఎనిమిది కావస్తోంది' అన్నాడు.

సుందరి విసుక్కుంది. కథ పూర్తిచేయకుండా ఏవిటీ అవకతవక ప్రశ్నలు ?

'మనం మొదటితరగతి ప్రయాణీకులం. భోజనం ఇక్కడికే వస్తుంది' అన్నారు సీతాపతి. హరి మాట్లాడకుండా దిగి వెళ్ళిపోయాడు.

'ఇతనో గట్టిచిక్కే వచ్చింది. మళ్ళీ ఎప్పుడొస్తాడో ఏమో !' అనుకుంది సుందరి. బండి బయలుదేరేసమయానికి హరి వచ్చాడు. బెడ్డింగు పరిచాడు. 'ఇక నిద్ర గామోలు !' అనుకుంది సుందరి. కథ పూర్తిచేయమని నాన్న అడిగితే బాగుండుననుకుంది. ఒకటి రెండుసార్లు తనే అడిగితే తప్పేముందనుకుంది. అంతా అనుకోటంలోనే ఆగిపోయింది. ఫలితంగా హరి సుఖ నిద్రలో మునిగిపోయాడు. మరో పావుగంటకు అమ్మ, నాన్న కూడా సుషుప్తికి లొంగిపోయారు.

సుందరి పడుకుందికాని కన్ను మూతపడలేదు. రెండు మూడు సార్లు ఏదో నవల చదవటానికి యత్నించింది. కాని మనసు నిలిచిందికాదు. హరి చెప్పిన కథకు ముగింపు ఏవిటి ? ఆమె అతన్ని ప్రేమించింది. అతనిలో చెడుగును తొలగించి మంచిని నిలనాటింది. అనురాగాన్ని చిందించిన ఆమె పెళ్ళిచేసుకోలేదంటాడేవిటి ?... అలా ఆలోచనలు సాగిపోయాయి. అంతూ—దరీ చిక్కలేదు. హరి నిద్రలేస్తాడేమోనని చూసింది. మరో రెండు రోజులదాకా మేలుకునేవాడిలా కనపడలేదు.

రాత్రి పన్నెండుగంటలు.

హరి మేల్కొన్నాడు. ఏదో పెద్ద జంక్షను— అమ్మా, నాన్నా కూడా మేలుకుని టీ తాగారు.

# వ్యాఘ్రసుందరి

'నిద్ర ముంచుకొస్తోందండి—మిమ్మల్ని సస్పెన్స్‌లో ఉంచాను. సుందరి చివరిసారిగా రాసిన ఈ ఉత్తరం చదువుకుంటే కథ ముగింపవుతుంది. నేనెందు కిలా అయానో మీకు అర్థమవుతుంది' అంటూ ఓ నీలిరంగు కాగితం సీతాపతిగారి కిచ్చి మళ్ళీ నిద్రలో మునిగిపోయాడు. ఆయన ఉత్తరం చదువుకున్నాడు. చిత్రవిచిత్రమైన భావాలు సంధ్యాకాశంలో రంగుల్లా ముఖంమీద కదిలిపోతుంటే సుందరి ఆత్రంగా చూస్తూ కూర్చుంది. సీతాపతి తనలో తాను రెండు మూడుసార్లు నవ్వుకుని ఆ ఉత్తరం సుందరి కందించాడు. సుందరి గభాల్న లాక్కుని చదివింది:

'చిరంజీవి శ్రీహరికి ఆశీర్వాదములతో మీ నాన్న వ్రాయునదేమనగా, మన లక్ష్మణరావుగారి స్నేహితుని అమ్మాయి ఇంటరు చదువుకుంది. చక్కనిది. లక్షణమైన వంశం, సంప్రదాయం, ఆచారాలు—అన్నీ ఉన్నాయి. ఆ అమ్మాయిని నీ కిచ్చి వివాహం జరిపిస్తే బాగుండునని నేనూ, లక్ష్మణరావుగారూ ఆలోచించాం. ఆ అమ్మాయి, ఆమె తలిదండ్రులు ఎల్లుండి మద్రాసు వస్తున్నారు. నువ్వుకూడా ఆఫీసుకు నాలుగురోజులు సెలవుపెట్టి వచ్చి అమ్మాయిని చూసుకోవలసింది. ఇద్దరికీ నచ్చితే వెంటనే వివాహం జరిపిద్దాం. కాదు, కూడదు అనకు. బుద్ధిగా మీ నాన్న ఆజ్ఞను శిరసావహించు—నీరాకకోసం ఎదురుచూస్తున్నాం — మీ అమ్మ ఈ సంగతంతా విని తెగ మురిసిపోతోంది. నీ ఇష్టాయిష్టాలు తరువాత చూసుకుందాం. కాని మర్యాదకోసమైనా నువ్వు రావలసింది. తక్కినసంగతులు నేరుగా మాట్లాడుకుందాం. గమనించవలెను.'

సుందరి తెల్లమొహం వేసింది. ఆమెకు తలా తోకా అర్థంకాలేదు.

'సుందరి కడసారిగా రాసిన ఉత్తరం' అన్నాడు అబ్బాయి. ఇదేదో తండ్రి కొడుక్కి రాసింది. పోనీ పొరపాటున మరో ఉత్తరం ఇచ్చాడేమోననుకుంటే అతనికి తలిదండ్రులు లేరని ఇందాకనే స్పష్టపరిచాడు. ఆమె అయోమయంగా నాన్నకేసి చూసింది.

సీతాపతి చిరునవ్వు నవ్వి 'ఇంకా అర్థంకాలా?' అన్నారు.

'నేనంతా తెలుసుకున్నాను' అన్న భావన ఆ మాటల్లో స్పష్టమైంది.

సుందరి తల అడ్డంగా ఊపింది.

'అయితే చెప్తాను విను....' అంటూ మొదలుపెట్టేలోగా హరి నిద్రలోంచి లేచి కూర్చున్నాడు. కళ్ళు నులుముకుని, బద్ధకంగా వళ్ళు విరుచుకుని గడియారంవంక చూశాడు.

'అబ్బా !....ఒంటిగంట దాటింది. మద్రాసు దగ్గరపడిందన్న మాట !

ఇంతకూ ఉత్తరం చదువుకున్నారా ?.... అంతా బోధపడిందా ?' అన్నాడు.

'ఆహా !.... అంతా పూర్తిగా అర్థమైంది. నువ్వు ఏమీ అనుకోకుండావుంటే నేను కొన్ని ప్రశ్నలు అడుగుతాను. కాస్త సూటిగా, ఉన్న దున్నట్టు చెబుతావా ?' అనడిగారు సీతాపతి.

'తప్పకుండా....' అన్నాడు సిగరెట్టు ముట్టించి.

'నీ పేరు శ్రీహరి. మీ నాన్న వెంకటేశంగారు—మద్రాసులో ప్లీడరు. నువ్వు ప్రస్తుతం పెళ్ళి చూపులకు వెడుతున్నావు. ఇంతసేపూ నువ్వు చెప్పిన కథంతా నిజంగా కథ—'

హరి గుడ్లు తేలేసి గుటకలుమింగాడు. సుందరి చాటుగా నవ్వుకుంది.

'ఏం !....మాట్లాడవ్ ?' అని రెట్టించారు సీతాపతి.

'అక్షరాలా నిజం !....అయితే ఈ సంగతి మీరెలా కనుక్కున్నారు ?' అన్నాడు ఆశ్చర్యంగా.

'ఓయి వెర్రినాయనా !.... ఇంత చక్కగా కథ అల్లి నటిస్తూ వచ్చి చివరి ఘట్టంలో పప్పులో కాలేశావు' అంటూ ఆ ఉత్తరం తిరిగిచ్చారు.

హరి సిగ్గుతో తలవంచుకున్నాడు.

'క్షమించండి. మీరు పెద్దవారు. మీముందు అబద్ధమాడటం నా అభిమతం కాదు. మీ అమ్మాయి ఏం తోచటంలేదని మొదట్నుంచీ విసుక్కుంటున్నారు. ఎవరైనా ప్రయాణంచేస్తే సుఖంగా, హాయిగా ఉండాలని నా అభిప్రాయం. అందుకని ముఖానికి విషాదం పూసుకుని, నేను ఎప్పుడో అల్లిన కథను మీకు చెప్పాను. అంతేకాని మిమ్మల్ని మోసంచేద్దామనికాదు.'

సీతాపతి చిన్నగా నవ్వారు.

'అయితే సుందరి రాసిన ఉత్తరంమాట ?...' అనడిగింది. సుందరి.

'ఇదుగో ఆసక్తిగావుంటే చదవండి' అంటూ మరో ఉత్తరం అందించాడు. సుందరి చదువుకుంది. హరిని సరిదిద్దుదామని అతన్ని ప్రేమించినట్టు నటించిందని, తనకు ముందే వివాహమైందని, తన్ను మర్చిపోవలసిందని ఆ ఉత్తరంలో వుంది.

దూరంగా మద్రాసు కనిపిస్తోంది.

'నీకు పెళ్ళిచేసుకోటం ఇష్టం లేనట్టు మీ నాన్నగారు రాశారు. నిజంగానా ?' అనడిగారు సీతాపతి.

'నాకు నచ్చిన అమ్మాయి దొరికేవరకూ—ఈ చూసే అమ్మాయి ఎలా ఉంటుందో మరి—' అతని కళ్ళల్లో తియ్యటి కలలు మెదిలాయి.

'అంతదాకా ఆగటమెందుకు ? లక్ష్మణరావుగారు నా ప్రియమిత్రులు—నువ్వు చూడబోయే అమ్మాయి నీ కెదురుగానే వుంది.'

సుందరి సిగ్గుతో తల వంచుకుంది. అయితేనేం? క్రీగంట హరిని గమనిస్తూనే వుంది. అతని కళ్ళు తళుక్కుమన్నాయి.

'చూసింది చాలుకాని, ఒకవేళ ఆమెను పెళ్ళి చేసుకున్నా ఇలాంటి కథలు చెప్పమాకు—ఆడువారి బుద్ధి వక్రమార్గంలో వెడుతుంది. జాగ్రత్త !' అని సీతాపతిగారు నవ్వారు. హరి, సుందరి, అమ్మ ఒక్కసారిగా నవ్వితే ఇంజను 'మద్రాసు వచ్చేసింది. పెట్టేబేడా సర్దుకోక ఆ కేరింతా లేమిటి ?' అని కూత లేసింది. ★

# 80 రోజులలో భూ ప్రదక్షిణం

(16 వ పేజీ తరువాయి

క్షణాలమీద ఆ మొలక విరిగి పెద్ద చెట్టు అయి వూడలు వేసింది. వేళ్ళు పారింది.

"అబ్బే. లాభంలేదు. పిచ్చితనం నా దంతా" అనుకున్నాడు. "ఆ పోదూ. పిచ్చో, వెర్రో—ఉన్న దొక్కటే ఉపాయం" అని గొణిగాడు. ఏ మవుతుం దేవిటి మహా అని- ఎవరికో జవాబిచ్చినట్టు తల ఎగరేశాడు. ఇలాటి మొండి రాక్షసుల కిదొక్కటే మందు అని నచ్చజెప్పుకున్నాడు తనకి తనే.

ఉపాయానికి రూపాంతరాలేవీ ఆలోచించలేదు. ఎవరితోనూ చర్చించనూ లేదు. కాని, వెంటనే కదిలి పాములా కొమ్మ వెంబడే చరచర పాకి, కొమ్మ బాగా వంగి నేలను తాకుతున్న అవతలి చివర అందునుంచి దిగజారాడు.

గంటలు కరిగిపోతున్నాయి. చిక్కటి చీకటిమెల్లిగా తెల్లబోతూంది—జరగబోయేద కథతెలిసినట్టు.

*　　*　　*

దురదృష్టవంతురాలు అయూదా మరణానికి వేళ కావచ్చింది — ఒక్కసారిగా భారీతూర్య నాదాలతో దిక్కులు మారుమోగాయి. నిద్రాముద్రితమైన జనానీకం అంతా జాగరితం అయింది పునరుజ్జీవనంలా ఉంది ఆ దృశ్యం.

ఆలయం ద్వారాలు తెరుచుకొంటున్నాయి. లోపల నుంచి కాంతి సముద్రం ఒక్క మారుగా పెద్ద కెరటంలా ఇవతలికి విరుచుకు పడింది. కాగడాల కాంతిలో అయూదా కనిపించింది — దూరంనించి చూస్తున్న ఫాగ్ బృందానికి. ఇద్దరు పురోహితులు ఆమెను బలవంతాన పట్టుకుని ఇవతలకు ఈడ్చుకు వస్తున్నారు. ప్రాణ రక్షణ అనేది జీవికి అతి సహజమైన కోరిక. ప్రాణానికి ప్రమాదం వస్తే క్షణంలో గ్రహించగలదు. మత్తు పదార్థాలవల్ల స్పృహ, జ్ఞానం కోల్పోయిన అయూదా కూడా ఆ క్షణంలో అప్రయత్నంగానే ప్రమాదాన్ని గుర్తించి ఉండాలి. ఒక్కమారుగా మత్తును వదిలించుకుని హంతకుల పట్టు తప్పించుకు పారిపోవడానికి శతవిధాల ప్రయత్నిస్తోంది. ఆ దృశ్యం చూడగానే సర్ ఫ్రాన్సిస్ హృదయం ఉద్వేగంతో నిండిపోయింది. ఆవేశంతో అప్రయత్నంగా ఫాగ్ చెయ్యి పట్టుకోబోయేసరికి, ఫాగ్ చేతిలో విప్పిన బాకు కనబడింది.

దూరాన జనంలో సంరంభం చెలరేగింది ఒకసారి. పురోహితులు అయూదాను అదుపులో ఉంచడానికని తిరిగి భంగు, గంజాయి ధూపం ప్రయోగించినట్టున్నారు. ఆమె తిరిగి కొద్దిగా సోలిపోయింది. ఫకీర్ల చేతులలో వాలి, యాంత్రికంగా నడుస్తున్నది. జనం ఆవేశంలో నినాదాలు, హర్ష ధ్వానాలు, చేస్తున్నారు. జేజేలు కొడుతున్నారు.

(ఇంకా ఉంది) ★

# గళ్లనుడికట్టు-39

## ఆధారాలు

### అడ్డము

1. మంచి రుచి కాకరమైన చేదు కూరగాయ.
3. బంధ్నయ్యవి.
5. అలనాడులో కెరటం విరిగిపడి పోయింది. దేశం నిక్షేపంలా వుంది.
6. కంచె మేయడం దీనికి రివాజు.
8. వెయ్యగానే వణుకు పుట్టించేది; దీనిచిమలే బలవంతమైన సర్పాన్ని పట్టుకుని చంపేస్తాయి.
9. నూట ఇరవై తులాల బరువు తూగేది.
11. కీలు విరిగి తిరగబడినట్టుంది.
13. సా సామిరంగ ! అంతా చిందర వందరయి పోయిందే!
*16. 10 నిలువులో పట్టుకు పీడించే గ్రహం.
17. ముందర అకారం కల్పించి చూసుకుంటే, మొదలు కనిపిస్తుంది.
19. తెలుగు దేశంలో పేరు మోసిన ఒక కోటికి బిరుదు. తూర్పునించి ఇటొస్తే తగుల్తుంది ఆదేశం.
21. లాభం ఉంటే వుండేమోగాని సరిగ్గా కలబడి ఇదవటంలేదు గదండి.
24. చాలునంటే చాలు.
26. కర్మచేసేవాడు.
27. చదివేకొక 1 అడ్డంలో కాయపేరును ఇలా పలికాడో మనుడు.
30. ఈ బాపతు బీరకాయలు సామెతలో చాలా దొరుకుతాయి.
32. ముని వాకిటిముందు నిలబడిన మహాత్ముడు.
34. రామన్న వారన్న మాటే.
35. హలాయుధుడు ఆగ్రహించి ఎదురు తిరిగాడు.
37. ఒట్టు ! అంతేమాట, ఒట్టు !
38. ధూమశకటంలో ఎగిరిపోయింది.
39. అన్నీ టక్కరి వేషాలు. మొహం అటు తిప్పుకుంటే మటుకు తెలీదా ?

### ఆధారాల పోటీ

గళ్ళనుడికట్టు—39 లో 16 అడ్డం మాటకు, 3 నిలువు మాటకు మేము ఇచ్చిన ఆధారాలకన్న ఉత్తమమైనవి పంపినవారికి రు. 5 బహుమతి ఇస్తాము. ఆధారాలు మాకు చేరవలసిన ఆఖరి తేది ఫిబ్రవరి 18, 1961.

### నిలువు

1. పూరు పొమ్మంటే ఇది రమ్మంటుందిట.
2. కొరకంచులలో ఒక జాతి.
*3. కన్యాకుల్యానికి 'యాన బాపి' ?
4. వాలుగాలేని పీలు.
5. నావలువలలో నీటన్నై కలిసిపోయివి ఉన్నాయి.
7. చలి మిక్కిలి తిమక వహించినా స్నేహభావం కనిపిస్తూనే ఉంది.
8. చతుర్భుజాలూ ఒక్కలాగే ఉంటాయి.
10. ఆశకు నిలయం అయినచోట వంచన ఉంటుంది. వంచకుడూ ఉన్నాడు చూడండి.
12. కాకీ ! రంగులు పూసుకొన్నంత మాత్రాన చిలుకవు కాగలవా అంటే అయినా చూడు అంటోంది.
13. వేదాలలో ముఖ్యంగా, సామము చెప్పుకోవా అంటే, సంగీతంలో కసరత్తు కొంత తప్పదని చెప్పక చెబుతోంది.
14. ఒట్టుతీసి ఇక్కడ పెట్టు.
15. వాయునా ! నువ్వు ఆ పట్టెడెక్కడైనా చూశావా ?
16. సరిగ్గా ఆవేగంతో వచ్చేది ఇంకేముంటుంది గనక ?
21. ధరించేవాడు.
23. నాటక రంగంమీద ఎప్పుడూ ఇందులో కలకలం జరుగుతూ ఉంటుంది.
24. పసుపు రంగు రంగులలో ఒక్కొక్క దాన్ని ఈ పేరున పిలుస్తారు.
25. పోతా కొట్టింది మిరుకాయ. వేసు తెండి.
26. శ్రీమంతులే పుచ్చుకొనేది.
28. సామంతులే ఇచ్చుకునేది.
29. కావలసినవారున్న పూరు.
31. నవతి కాస్త చెడి, పోబోయినరికి నవతి 'ఎదురైంది'.
33. అసురుని శక్తి విజృంభించే వేళలో ఈ పూట ఆరంభం అవుతుంది.
34. అరాటంవల్ల లాభం లేదు. దాని ఆకారం మారకండి. అప్పుడు జీవనోపాధికి సాధనం కనిపిస్తుంది.
36. యమునా తీరంలో విహరించిన దేవుడు.
37. పొరబాటయిపోయింది. సరైన దారి చూడండి.

### సవరణ

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1961 ఫిబ్రవరి 8వ తేది సంచికలో ప్రచురించిన "నిత్య సంగ్రామశీలుడు అక్కినేని నాగేశ్వరరావు" అన్న వ్యాసం రచించినవారు శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ అని గమనించ కోరుతున్నాము.

—సంపాదకుడు

### 38-వ గళ్ళనుడికట్టుకు జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రా | గి | ణి | | పిం | ఛ | ము | | అం | ద | ము |
| ము | | ప | ది | | ప్ | | ఆ | బ | | జి |
| పా | రా | ణి | | వి | | సొం | | రం | మ | స |
| ద | | | జో | హా | సా | ధ | ము | | | రు |
| ము | | అ | | రం | | ము | | ర | | కు |
| | ప | డు | చు | | | | ఋ | ణ | ము | |
| శ్రీ | | సు | | పం | | వ | | సు | | కే |
| ల | | | కం | ల | చ | క్ర | ము | | | ల |
| నా | గం | గం | | న | | ము | | సే | లు | వ |
| గ | | ధ | నం | | గో | | దో | తి | | రం |
| శ్రే | ర | ము | | చే | రు | వా | | రా | మ | త |




చిత్రకారుడు—"శ్రీ కృష్ణకాశ్యప" (కాకినాడ)

## ఎలా తెలుసు?

ముద్దాయి త్రాగాడని ఎలా తెలుసుకొన్నావని మాజిస్ట్రేట్ ప్రశ్నించాడు.

పోలీసు—టాక్సీ డ్రైవర్‌తో జోరుగా దెబ్బలాడుతున్నాడండి.

మాజిస్ట్రేట్-అంతమాత్రం చేత త్రాగాడని రుజువు చెయ్యడం ఎలా?

పోలీసు—అసలక్కడ టాక్సీ లేదు, డ్రైవరూ లేడు.

* * *

## గాలివాలు

మా ఊళ్ళో ఒక రైతు అర్జంటుపనిమీద పట్టణానికి [illegible] బయలుదేరాడు, కాలినడకను. సగందూరం వెళ్ళాక పొగ త్రాగుదామని చుట్టతీసి అగ్గిపుల్ల వెలిగించాడు. అది ఆరిపోయింది. ఎన్ని పుల్లలు వెలిగించినా గాలి ఒత్తిడికి ఆరిపోతున్నాయి. ఇంక లాభంలేదని అతను వెనుకకుతిరిగి వీపు చాటుచేసుకుని చుట్ట వెలిగించుకోగలిగాడు. దానితో ఆనందంగా ప్రయాణం సాగించాడు అతను.

తీరా ఇల్లు చేరుకొన్నాక కాని పాపం ఆతనికి తెలియలేదు-గాలివాలుమాహాత్మ్యం!

—'కేఆర్కే' (విశాఖపట్టణం)

* * *

## ఉరిశిక్ష తరువాత...

గొర్రెలకాపరులు ఇద్దరు కొట్లాడుకున్నారు. ఒకడు మృతి చెందాడు.

విచారణలో "నువ్వు రామయ్యను చంపినమాట నిజమేనా" అని సోమయ్యను న్యాయాధికారి ప్రశ్నించాడు.

"నిజమేనండి."

"అయితే నీకు ఉరిశిక్ష తప్పదు" అన్నాడు న్యాయాధికారి.

"అయ్యా, త్వరగా ఉరితీసెయ్యండి. నేను గొర్రెలుకాయడానికి పోవాలి" అన్నాడు సోమయ్య.

—వి. జె. ఆనందకుమార్

* * *

పోలీసు—ఎందుకురా, ఇంత చిన్నతనంలో ఇలా దొంగతనం చేస్తున్నావు?

పిల్లవాడు—మా నాన్న జెయిల్లో ఉన్నాడండి - ఆయనను చూద్దామని.

—అడ్డగూడూరు సుజాత (కొర్పా)

* * *

ఒకరు—నాకు ఎల్లప్పుడూ ఆడుతూ పాడుతూ ఉండాలని ఉంటుంది.

వేరొకరు—మీకు దోమలంటే ఇష్టమా?

—కోయల్‌కర్ బన్సీలాల్ (నిజామాబాదు)

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd., by S. Radha Krishna at TheAndhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

